*Issued on 31— 1—1957*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

## OFFICIAL REPORT

*MONDAY, the 26th MARCH, 1956.*

VOLUME VI — No. 2.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.
ANDHRA STATE, KURNOOL.

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Monday, the 26th March,* 1956.

The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the Clock Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS.

*Starting of a Medical College in Rayalaseema area.*

397—

* 106 Q.—SRI P. GOPALAKRISHNA REDDI :—and SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether there are proposals with the Government to start a Medical College in Rayalaseema area, and

(b) if so, when and where it will be started?

THE HON. SRI K. VENKATA RAO :—

**The Government have decided to start a new medical college at Kurnool from 1st July 1956.**

ప్రభుత్వంవారు 1956 సంవత్సరము జూలై మొదటి తేదీనుంచి కర్నూలులో కొత్తగా ఒక medical college పెట్టటానికి నిర్ణయించారు.

SRI S. VEMAYYA :—ఈ కాలేజీకి సుమారు ఎంత ఖర్చు అవుతుందో చెబుతారా?

THE HON. SRI K VENKATA RAO:—దీని ఖర్చు ఎంత అవుతుందో, మనము విశాలాంధ్ర వెళ్ళినతరువాత తేలుతుంది. ఎందుకంటే, వీరికి కావలసిన buildings ఇప్పటికి చాలా భాగము ఖాళీఅవుతాయి. అదిపోను మిగతా recurring expenditure మాత్రము ప్రభుత్వం పెట్టుకోవలసిన అవసరం ఏర్పడుతుందని అనుకుంటున్నాను.

SRI G. YELLAMANDA REDDI :—ప్రభుత్వం యొక్క pro-posals కేంద్రప్రభుత్వముగాని, grants commission గాని అంగీకరించిందా?

THE HON. SRI K VENKATA RAO:—April ఒకటవ తేదీ నాటికి జవాబు వస్తుందని అనుకుంటున్నాను.

SRI P. VENKATASUBBAYYA —ఈ medical College ఏ ఏ భవనాలలో పెట్టటానికి ప్రభుత్వం నిర్ణయించింది ?

THE HON. SRI K. VENKATA RAO :—అప్పటికి ఖాళీగా ఉండే భవనాలలో నే.

*Number of students admitted into the Polytechnic Courses.*

400—

*492 Q.—SRI B. V. SIVAIAH :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) the number of students admitted into the Polytechnic Courses in all the institutions in our State in the years 1954-55 and 1955-56 ;

(b) the basis of changing the number of admissions from year to year ;

(c) the number of students who passed the licentiate courses in the year 1953-54 and 1954-55 ,

(d) whether the Government consider the question of making provision in the Government workshops for under-going apprentice ship for the licentiates , and

(e) whether the Government consider the question of giving chances to these licentiates to study B.E Courses ?

THE HON. SRI K. VENKATA RAO .—

| (a) | Year. | No. of students admitted. |
|---|---|---|
| | 1954-55 | 288 |
| | 1955-56 | 539 |

(b) The number of admissions have been increased with a view to meet the demand for technical personnel for implementation of the developmental schemes under the Second Five Year Plan,

26th March 1956]

| (c) | Year. | No. of students passed. |
|---|---|---|
| | 1953-54 | 119 |
| | 1954-55 | 155 |

(d) Facilities for practical training of the licentiates are already being provided in the Andhra Paper Mills, Rajahmundry, and the Government Ceramic Factory, Gudur, which are under the control of the Department of Industries and Commerce. Similar facilities are also provided in the Public Works Department workshops to the extent practicable.

(e) No, Sir.

(ఎ) 1954-55 సంవత్సరములో చేర్చుకోబడి విద్యార్థులు 228. 1955-56 లో 539 మంది.

(బి) technical personnel 1955-56 లో మనకు ఎక్కువమంది అవసరము ఉన్నందువల్ల ఎక్కువమంది విద్యార్థులనే చేర్చుకున్నాము.

(సి) ఇందులో ప్యాసు అయినవారు :—

1953-54 సం॥లో 119

1954-55 " 155

(డి) తరువాత రాజమండ్రి పేపరుమిల్సులోకూడ practical training యిచ్చే ఏర్పాటుగూడ చేయడము జరిగింది. గూడూరు సిరమిక్ ఫ్యాక్టరీలో గూడ special training యివ్వడం జరుగుతున్నది. Public Works Department యొక్క work shop లో కూడా యీ facilities యివ్వటానికి ప్రభుత్వం నిర్ణయించారు.

(ఇ) లేదండి.

SRI G. YELLAMANDA REDDI :—గూడూరు సిరమిక్ ఫ్యాక్టరీలో యిప్పుడు ఎంతమంది విద్యార్థులు ఉన్నారు? వారియొక్క సంఖ్యను అందులో ముఖ్యంగా గ్లాసుబ్లోయింగు నేర్చుకునేవారిని, పెంచటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—గ్లాసు బ్లోయింగుకు వచ్చినవారు అందులో ఆరుగురో, ఎనిమిదిమందో ఉంటున్నారని నాకు జ్ఞాపకము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ప్రభుత్వానికి క్రొత్తగా ఏర్పడిన బాధ్యతవలబట్టి, యీ training course లో యింకా అదనంగా విద్యార్థులను తీసుకోటానికి ఏర్పాటుచేస్తారా?

[26th March 1956

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పటికి 280 నుంచి 559 వరకు చేర్చుకోవడం జరిగింది. యిప్పటికే రెట్టింపుమంది అయినారు. ఇంకా అదనముఅంటే, ఎంతమంది, అని ?

SRI L. LAKSHMANA DAS :—230 మందినుంచి 559 వరకు పెంచాము, యింకా అదనముఅంటే యేమిటిఅని మంత్రిగారు అంటున్నారు. ఇంకా విద్యార్థులు ఎక్కువగా వస్తున్నప్పుడు ప్రతిజిల్లాలోగూడ యీ training యివ్వటానికి ఒకస్కూలును ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రతిజిల్లాలోగూడ ఏర్పాటుచేయటానికి, 1966 సంవత్సరము నాటికి ఏదైనా సాధ్యపడుతుందేమోనని అనుకుంటాను. ఎక్కడైనా ఒకచోట యీ polytechnic school ఏర్పాటు చేయాలంటే. ఒక్కొక్కచోట 30 నుంచి 40 లక్షలదాకా ఖర్చుచేయవలసి ఉంటుంది. అంత డబ్బు ప్రభుత్వానికి ఉండవలెగదా !

SRI N. C. SESHADRI :—ఈ admissions విషయములో జిల్లాకు యింతమందిఅనే principle ఏదైనా ప్రభుత్వం అనుసరిస్తున్నదా ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రతిజిల్లాయే కాదు. ప్రతీతాలూకాకు ప్రతిగ్రామానికి, యిక్కడ శాసనసభ్యులయొక్క ప్రతి Constituency కిగూడ representation యివ్వడమనేది అసంభవమైన విషయము.

SRI S. VEMAYYA :—అతురతగా ఉన్న విద్యార్థులకందరికీ యీ training యివ్వటానికి వీలుకాదు, కాబట్టి కనీసము మద్రాసులోఉంటే Polytechnic school లోనైనా ఆంధ్రవిద్యార్థులకు సీట్లు దొరికేటట్లు ప్రభుత్వము ఏర్పాటు చేస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద ఆంధ్రవిద్యార్థులను కావలసినంతమందిని తయారు చేసుకోటానికి ఏర్పాటులు మన రాష్ట్రములోనే జరుగుతాయి కాబట్టి, మనం మద్రాసుదాకా పంపనక్కరలేదు.

SRI P. VENKATASUBBAYYA :—పాసుఅయిన విద్యార్థుల కందరికీ ఉద్యోగావకాశములు కల్పించబడుతాయా ?

THE HON. SRI K. VENKATA RAO :—చదువుకునేవారు ఎవ్వరు కూడ contract మీద చదువుకోరు.

SRI M. SATYANARAYANA RAJU :—Licenciate course పాస్సయిన వారికి, B. E. course చదవటానికి chance యివ్వము అని అంటున్నారు. దీనికి కారణము ఏమి ?

THE HON. SRI K. VENKATA RAO .—Licenciate Course చదివి పాసు అయినవారికి basic గా educational qualifications తక్కువగా ఉంటాయి కాబట్టి, B.E. Course కు chance యివ్వరు.

SRI M. SATYANARAYANA RAJU :—Experience ఉన్న వారికిగూడ chance ఉండదా ?

THE HON. SRI K. VENKATA RAO—స్కూళ్లలో చదువుకున్న వారికి experience ఉంటేగూడా ఏమి లాభంలేదు గంగిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు గారు మనకు తెలుసు. ఆయన ఏ పరీక్షగూడ పాసుకాలేదు కాని experience మాత్రము ఎక్కువగానే ఉన్నది. రాజమండ్రి పేపరు మిల్లులో ఒక పెద్ద pipe వంచటానికి, ఎక్కడినుంచో లండనునుంచి Technician ను పిలిపించనవసరము లేకుండానే, ఆయన వంచ గలిగారు. ఇప్పుడు రామకృష్ణ గారు మద్రాసులో ప్యాక్టరీలకోసము పెద్దపెద్ద భవనాలు కట్టిస్తున్నారు. కాని దానికి recognition రావాలంటే, అది ప్రభుత్వములో సాధ్యమయ్యే విషయముకాదు.

*Telugu Shorthand and Typewriting Committee.*

636—

* 1124 Q.—SRI S VEMAYYA .—Will the Hon. the Cheif Minister be pleased to state :

(a) whether the Government propose to implement the recommendations of the Telugu Shorthand and Typewriting Committee during the current year ; and

(b) if not, the reasons for the delay ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) If the Member is referring to the current financial year, the answer is in the negative.

(b) The report of the Committee is under consideration and it is likely to take some time before decisions are taken.

SRI S. VEMAYYA :—Short hand and Typewriting Committee వారు ఏవి సిఫార్సులు చేశారు ?

THE HON. DR. B. GOPALA REDDI :—Committee report copy ఒకటి సభ్యులందరికి అందజేశాముగదా! అది చదువుకొన్నారనుకొంటాను. చదువుకోటానికేగదా, దానిని అందజేసింది. చదువుకొండి. చదుకుంటే తెలుస్తుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—కమిటీ వారి సిఫార్సులలో తెలుగు టైపు రైటింగు మిషినుకు కీ బోర్డు, ఫలానా అని నిర్ణయము ఉన్నది. మనము విశాలాంధ్రకు పోయేలోగా నైనా, కీ-బోర్డును నిర్ణయిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—విశాలాంధ్రకు కీ-బోర్డుకు సంబంధము యేమి ఉన్నది ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—విశాలాంధ్ర ఏర్పడుతున్నది గనుక, అక్కడ తెలుగులో ప్రభుత్వము యొక్క కార్యక్రమము ఎక్కువగా జరగవలసి ఉన్నది అందువల్ల కీ-బోర్డును యీ లోపుగా నిర్ణయము చేస్తే, విశాలాంధ్ర స్టేటులో తెలుగులోనే పని జరగటానికి యీ నిర్ణయము అవసరము కాబట్టి, అది నిర్ణయిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—కమిటీవారి రిపోర్టును Commissioner for Government Technical Examinations యొక్క రిమార్కుల కోసం పంపించాము. వారివద్దనుంచి యింకా రిపోర్టు రాలేదు. అది రాగానే, దానినిగురించి చర్య తీసుకోటానికి ప్రయత్నిస్తాము. అంతేకాని, కీ-బోర్డుకు విశాలాంధ్రకు సంబంధములేదు

SRI PILLALAMARRI VENKATESWARLU :—Telugu Short-hand examination లో యీ సంవత్సరము ఎంతమంది ప్యాసు అయినారు ? వారిలో ఎంతమందికి ఉద్యోగము లభించింది ?

THE HON DR B GOPALA REDDI :—ప్యాసు అయిన వారందరికి ఉద్యోగాలు వస్తూనే ఉన్నవని అనుకుంటాను. ఎందుకంటే, మన ఆంధ్ర దేశములో dearth of qualified Telugu Shorthand Writers ఉంటున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ సంవత్సరము నలుగురు ప్యాసు అయితే అందులో ఒక్కనికి ఉద్యోగము వచ్చింది అనే విషయము మంత్రిగారికి తెలుసునా ?

THE HON. DR. B. GOPALA REDDI :—తెలియదు.

SRI S. VEMAYYA :—కమిటీ రిపోర్టు ప్రభుత్వంయొక్క ఆలోచనలో ఉన్నది అన్నారు. అయితే యీ ఆలోచన ఎన్నాళ్లకు పూర్తి అవుతుంది ? ఆలోచన పూర్తిఅయిన తరువాత, కమిటీ సిఫార్సులు implement చేయటానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—దానిని గురించి, యింత కాలము అని స్పష్టంగా చెప్పడము కష్టం రిపోర్టును ప్రభుత్వం పరిశీలించవలసి యుంటుంది. Commissioner for Government Technical examinations యొక్క రిపోర్టును call for చేశామని చెప్పాను కదా ! ఇది technical matter కాబట్టి, దీని విషయములో తొందరపడి, ఎట్లాపడితే అట్లా నిర్ణయించి చేయటానికి వీలులేదు.

*Representations from Andhra Provincial Teachers Federation.*

637—

* 258 Q.—SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Government have received representations from the Andhra Provincial Teachers Federation and Sri Devamandiram stating that the managers of the aided Schools are not properly spending the management grant for the upkeep of the concerned schools ;

(b) whether the Government have enquired into the matter ; and

(c) if so, the action taken thereon ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) and (c) An enquiry is being made and the receipt of the Director of Public Instructions' report is awaited.

SRI S. VEMAYYA :—ఈ representationలో ఏ ఏ allegations చేయబడినవో చెబుతారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—వారు యిచ్చిన representation లో management లో ఉన్నవారిమీద కొన్ని కొన్ని allegations చేస్తూ పంపించారు. దానిని Director of Public Instruction కు పంపి

చాము. దానిని పరిశీలించి రిపోర్టును పంపమని కోరాము. ఆయనవద్ద నుంచి యింకా రిపోర్టు రాలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—దేవ మందిర మును ఉద్యోగములో నుంచి అన్యాయముగా తీసివేశారని Secretariat ముందు నిరాహార దీక్ష పూనడం జరిగింది. దీనిమీద కొంతమంది సభ్యులు జోక్యము కలుగ జేసుకొని ఆయనను నిరాహార దీక్షనుంచి విరమింప చేయడం జరిగింది ఆయనకు తిరిగి ఉద్యోగము యిచ్చే ఆలోచనచేస్తామని మంత్రిగారు చెప్పారు. ఉద్యోగము యిస్తామని చెప్పారని చెప్పడములేదు, అనుకోండి. కాబట్టి యీ విషయములో ప్రభుత్వము యొక్క ఆలోచన ఎంతవరకు కొనసాగిందో చెబుతారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ విషయము నేను నిన్ననో మొన్ననో Director of Public Instruction యిక్కడికి వచ్చినప్పుడు వారితో మాట్లాడాను. కాని ఇది private management క్రింద ఉన్న school కు సంబంధించిన వ్యవహారము ఇటువంటి విషయములో ప్రభుత్వానికి అట్టి అధికారము ఉన్నట్లు కనబడదు. అది గాకుండా మేనేజిమెంటులోనివారు దేవమంది రము గారి work బాగాలేదని తీసివేశామని రిపోర్టు పంపించినప్పుడు, management ను దేవమందిరమును తిరిగితీసుకోండి అని compel చేయడమునకు సంపూర్ణమైన హక్కు ప్రభుత్వానికి లేదు. అయితే కొన్నికొన్ని ప్రత్యేక పరిస్థితులలో ప్రభుత్వా నికి అప్పీలు అధికారము ఉన్నది. కాని యీ విషయము అటువంటి ప్రత్యేకపరిస్థితుల క్రిందకు వస్తుందోరాదో తెలియదు. ఏమైనప్పటికినీ అప్పీలు ప్రభుత్వము ఎదుట వున్నది. కాబట్టి విషయములన్నీ పరిశీలించి, యిందులో ఏమాత్రము అవకాశము ఉన్ననూ, దేవమందిరమునకు ఉద్యోగములో ప్రవేశపెట్టటానికి చూడవలసిందని నేను డైరక్టరుకు చెప్పాను.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈసమస్య సుమారు ఒకటి, ఒకటిన్నర సంవత్సరములు pending గా ప్రభుత్వము ఎదుటనున్నది. కాని ముఖ్యమంత్రిగారు, యిది యింకా ఏ రూలుక్రిందకైనావస్తుందో, రాదో, ప్రభుత్వం చర్యతీసుకోటానికి అవకాశము ఉందో, లేదో, అది అంతా విచారించాలి అనిచెప్పడము అవుతున్నది. ఈ విధముగా యీ 1½ సంవత్సరములుగా కాలయాపన చేస్తూ నిర్లక్ష్యము చేయడము కనబడుతున్నదిగాని, పర్యవసానము తేలలేదు. దేవమందిరమునకు ఉద్యో గము యివ్వలేదు. కాబట్టి యీ విషయములో ప్రభుత్వము వెంటనే చర్యతీసు కుంటుందా ?

THE HON. DR. B. GOPALA REDDI:—ఇటువంటి అప్పీల్సు అన్ని Director of Public Instruction వల్ల విచారించబడుతాయి. వారు కూడ

యీ విషయమే పరిశీలిస్తున్నారు. దేవమందిరముగారు ఎక్కడో నూజువీడులో కాబోలు, ఒక private management క్రింద ఉన్న mission school లో పనిచేస్తూవచ్చారు. తరువాత school management లో ఉన్నవారికి, వీరికిపొత్తు కుదరకనో, లేక వీరి చర్యలు బాగాలేనందువల్లనో, వీరిని ఉద్యోగములో నుంచి తొలగించినందుకు యిక్కడ Secretariat ఎదుట నిరాహారదీక్షపూనారు. ఇది అంతా మనకు తెలుసు. వారుపెట్టుకున్న అప్పీలు డైరక్టరుకు పంపడమయింది. ఈ అప్పీలును పరిష్కరించటానికి ప్రభుత్వానికి అధికారమున్నదో లేదో ముందు చూడవలసివున్నది. ప్రభుత్వానికి అధికారము ఉంటే, management లోనివారు న్యాయముగా తీసివేశారో అన్యాయముగా తీసివేశారో ప్రభుత్వము చూడవలసి ఉన్నది. ఏమైనప్పటికినీ, దేవమందిరమునకు ఉద్యోగము యిచ్చేటట్లుగా వీలు అయినంతమటుకు ప్రయత్నిస్తాము.

SRI S. VEMAYYA :—ప్రైవేటు మేనేజిమెంటులోఉండే ఉద్యోగస్థుల విషయములో, ఏదైనా అప్పీలు ప్రభుత్వానికి పంపితే, అది చూడటానికి ప్రభుత్వానికి అధికారముఉందో, లేదో అనేసందేహము మంత్రిగారు వెలిబుచ్చారు. ఒకవేళ ప్రభుత్వానికి యీ విషయములో అధికారము లేనిపక్షములో, ప్రభుత్వానికి మేనేజిమెంటువారిమీద ఇతరత్రా అధికారముఉంటే, వారుయిటువంటి అవకతవకలు చేయకుండా ప్రభుత్వము ఏవైనారూల్సు frame చేయటానికి పూనుకుంటుందా ?

MR. SPEAKER :—It is a hypothetical question.

THE HON. DR. B. GOPALA REDDI :—అదిగాకుండా, aided schools లో teachers ఏమితప్పు చేసినప్పటికినీ వారిని ఉద్యోగములో నుంచి తొలగించకూడదు అని రూలు france చేయటానికి వీలులేదు. కాబట్టి దేవమందిరము యేమిచేశారో, ఎందుకు తొలగించబడ్డారో, దానిమీద అప్పీలుచేసుకోటానికి వీలుఉందోలేదో, అనేటటువంటివన్నీ పరిశీలించవలసిన విషయములు. ఇందులో మేనేజిమెంటువారిదే తప్పు, లేక దేవమందిరముదే రైటు అని చెప్పటానికి వీలులేదు. కాబట్టి యీ విషయముఅంతా కొంచెము దీర్ఘముగా పరిశీలించి చేయవలసిఉన్నది.

*Widening the supply channel of the Kanigiri reservoir.*

638—

* 806 Q.—SRI B. SANKARAIAH :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

whether the Nellore District Planning Board submitted a scheme now to widen the supply channel relating to the Kanigiri reservoir which cultivates an area of one lakh of

acres of land and to remodel the tunnels under the Reservoir according to the ayacut ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

The answer is in the affirmative.

SRI S. VEMAYYA :—చాలా కాలంగా ఈ agitation జరుగుతోంది. ఇది ఎప్పుడో కొన్ని వందల సంవత్సరాల క్రిందట చేసినది. దరిమిలా మళ్ళీ ఏమీ repairs కూడా జరగలేదు. Remodelling కూడా జరగలేదు. ఎంత కాలంలో ఈ పని పూర్తి చెయ్యడానికి ప్రభుత్వం పూనుకుంటుంది ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—5,6 నెలలలో పూర్తి చెయ్యవలసిందిగా Chief Engineer గారిని అడిగినాము. అది జనవరి నెలలో Order issue చేశాం. కాని వారు special sub-divission కావాలని అడిగారు ఉన్న Division లోనే ఈ పని 6 నెలలలో పూర్తిచేయవలసింది గా వారికి Orders పంపించాం.

SRI SHEIK MOULA SAHEB :—ఈ reservior కనిగిరికి సంబంధించినది కాదు. మరి ఈ పేరు ఎల్లాపడిందో తెలియదు బుచ్చిరెడ్డిపాలెం reservior అనిగాని లేక కనిగిరి reservior అనిగాని మారుస్తారా ప్రభుత్వం ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—మౌలాసాహెబు గారు ఎసెంబ్లీలో ఏదైనా తీర్మానం తెస్తే అప్పుడు ఆలోచిస్తాం,

SRI G. YELLAMANDA REDDI :—Planning Board నుంచి proposals వచ్చాయని మంత్రిగారు చెప్పారు. ఆ proposals యొక్క స్వభావం ఏమిటో వివరిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI .—నీరు పారేటట్లు తూములు పెద్దవి చేయుటవి.

*Retrenchment of staff in clerical and subordinate services.*

640—

* 313 Q —SRI M. MUNISWAMY :—Will the Hon. the Chief Minister be pleased to state :

whether it is a fact that the retrenchment of staff in both clerical and other cadres of subordinate services is under contemplation ?

26th March 1956]

THE HON. DR. B. GOPALA REDDI .—
No, Sir.

*Medium of instruction in the Basic Training School at Alur.*

641—

* 553 Q.—SRI G. BUSSANNA:—Will the Hon. the Chief Minister be pleased to state .

(a) whether Kanarese is also the medium of instruction in the Basic Training School at Alur in Kurnool District ; and

(b) if not, why ?

THE HON DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) The question of introducing Kanarese as medium of instruction in the Government Basic Training School, Alur has not been felt and considered in the past.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఇప్పుడు ఆంధ్ర దేశంలో కొన్ని కన్నడప్రాంతాలు కలిసియున్నవి గదా అక్కడవారికి కన్నడంలో విద్యాబోధన చేసేందుకు అవకాశం కల్పించవలసిన అవసరం లేదా ?

THE HON. DR. B. GOPALA REDDI :—విద్యార్థులు కావలసినంతమంది ఉంటేటప్పుడు తప్పకుండా వారి భాషలో విద్యాబోధన చేయవలసిందే. ఈ విషయంలో ఉదారంగా ఉంటేనే ఏ ప్రభుత్వానికైనా క్షేమంగా ఉంటుంది. ఈ Alur school లో కావలసినంతమంది students ఉన్నారో లేదో చూడవలసియుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—No, No, the point is this, దానిలోనే కొంత provision ఉన్నది Minimum number of students 10 లేక 15 గా fix చేసి, ఇంతమంది వస్తే తప్పకుండా వారి మాతృభాషలో విద్యాబోధన చేస్తామని ఏర్పాటుచేస్తే దాన్ని చూచుకుని number of students రావడానికి వీలవుతుంది. అసలు provision లేక పోయినట్లయితే students వచ్చుటకు ఏ విధంగా వీలవుతుంది ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ విషయాలన్నీ కూడా గమనించి అక్కడ సరిపోయేటువంటి number ఉన్నప్పుడు provide చేయడానికి వీలుంది అభ్యంతరం లేదు.

[26th March 1956

*Report by the Homeopathic Committee.*

642—

* 16 Q.—SRI S. NARAYANAPPA —Will the Hon the Minister for Planning and Industries be pleased to state .

(a) whether the Government are in receipt of the Report by the Homeopathic Committee appointed by the Government ;

(b) if so, the action taken thereon , and

(c) whether the Government propose to recognise the Homoeopathic system and employ homeopathic doctors ?

THE HON. SRI K. VENKATA RAO .—

(a) The answer is in the affirmative.

(b) The report of the Expert Committee has been printed and is under examination.

(c) The question will be taken up for decision after the examination of the report of the Expert Committee for Homeopathic system of Medicine is over.

(a) హోమియోపతీ కమిటీవారు ఇచ్చినటువంటి రిపోర్టు గవర్నమెంటుకు అందింది

(b) ఈ report అచ్చుపడింది. ప్రభుత్వంవారు విచారిస్తున్నారు.

(c) ఈ విచారణ పూర్తి అయినతరువాత ఈ కమిటీవారు ఇచ్చినటువంటి సలహాలను గురించి ఆలోచిస్తారు.

SRI S. VEMAYYA :—ఈ కమిటీవారు ప్రభుత్వంవారికి సూచించిన ముఖ్యమైన సిఫార్సులు ఏమిటి?

THE HON. SRI K. VENKATA RAO:—ఆ అచ్చు book member గారికి ఇస్తాం. ఆ తరువాత వారు చదువుకుని దానిలో ఉన్న సిఫార్సులన్నీ చూడవచ్చు.

SRI M. RANGAYYA:—కమిటీ member లయొక్క పేర్లు, వారి qualifications తెలవిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:—ఆపుస్తకం table మీద ఉంది. పేర్లు కూడా ఎక్కడ చెప్పనండి. నేను ఎరిగినంతవరకూ గుర్జాజాగారు ఒకరు. తరువాత ఇంకొకరున్నారు. కీర్తిశేషులు B. Somayya గారు దానిలో ఉన్నారని

జ్ఞాపకం. ఆ ముగ్గురే మెంబర్లు. వారంతా హోమియోపతీమీద విశ్వాసం ఉన్నటు వంటివారే కాకుండా, గుట్టాజుగారు అమెరికాకూడా వెళ్లి ఈ subject చదివి వచ్చిన వారై ఉన్నారు.

SRI N. C. SESHADRI :— ఈ గుడివాడ హోమియోపతి మెడికల్ కాలేజీలో వ్రాసినవారిలో, ఇదివరలో ఇద్దరినిమాత్రం rural dispensaries కి appoint చేసినట్లుగా తెలుస్తుంది. ఇంకా ఎక్కువగా వారిని appoint చేయడానికి ప్రభుత్వంవారు ప్రయత్నిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇంతవరకూ హోమియోపతిని ప్రభుత్వం recognise చేయలేదు. కాని ప్రశ్నలు తగ్గించడానికి ఒకవిషయం చెబుతున్నాను. నిన్ననే మంత్రివర్గంవారు హోమియోపతిని గురించి ఆయుర్వేదం, యునానీ వగైరాలను గురించి బిల్లులు తయారుచేసి ప్రచురించుటకు నిశ్చయించారు. gazette జాగ్రత్తగా చదువుతూ ఉంటే వారంరోజులలోపుగా బిల్లు gazette లో వస్తుంది.

*Sales Tax on green vegetables.*

643—

* 848-C. Q.—SRI V. GOPALAKRISHNA :—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state .

(a) whether sales tax is being collected on green vegetables like potatoes and onions ; and

(b) if so, whether the Government will consider the cancellation of sales tax on these two items ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) Sales tax is being levied on potatoes and onions only and all other vegetables are exempted from sales tax.

(b) The matter is under consideration of the Government.

SRI. A. BHAGAVANTHA RAO :—ఇప్పుడు హైదరాబాదులోను, మద్రాసులోనూ, green vegetables మీద sales tax లేనప్పుడు వాటిమీద మన ఆంధ్రలో sales tax వెయ్యడానికి ప్రత్యేకమైన పరిస్థితులు ఏమి వచ్చాయో సెలవిస్తారా ?

[26th March 1956

THE HON. SRI D. SANJIVAYYA :—ఆంధ్రలో కూడా Green vegetables మీద sales tax లేదండి. ఉల్లిపాయలు, బంగాళ దుంపలమీద మాత్రమే వేస్తున్నాం.

SRI B G. M. A. NARASINGA RAO :—ఈ green vegetables అమ్మేవాళ్లు ముఖ్యంగా రెల్లివాళ్ళు, చదువురానివాళ్లు. ఇటువంటివారు లెక్కలేమి maintain చేస్తారు.

MR. SPEAKER :—There is no tax on green vegetables.

SRI B G. M. A. NARASINGA RAO—పోనీ వాటినికూడా పూర్తిగా మినహాయించి ఈ vegetables అనే వాటిమీద వేటిమీదకూడా sales tax వెయ్యడం మానేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—10 వేల turn over క్రింద వుండేవారికి exception ఉండనే ఉంది. అదువల్ల చిన్న వారి మీద ఇది భారంగా ఉండదు. వారు accounts maintain చేయవలసిన అగత్యంకూడా ఉండదని నేను భావిస్తున్నాను.

SRI B. SUBBA RAO :—వీటిమీదపన్ను 1954 మార్చిలో వెయ్యడం, తరువాత తీసెయ్యడం, తరువాత మళ్ళీ వెయ్యడం జరిగింది. దానికి కారణం ఏమిటి ?

THE HON. SRI D. SANJIVAYYA :—దీనివల్ల దాదాపు లక్ష రూపాయిలకు పైగా ప్రభుత్వానికి వచ్చేటటువంటి ఆదాయం పోతుంది. ఆ కారణంచేత మళ్ళీ potatoes మీద, onions మీద పన్ను విధించాం.

SRI PILLALAMARRI VENKATESWARLU:—Onions కూడా perishable matter గదా. అందువల్ల onions మీదకూడా ఈ sales tax తొలగించడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—మిగతా green vegetables తో పోల్చిచూస్తే potatoes, onions comparative గా అంత త్వరగా చెడిపోవును.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Potatoes కేరుచేసి onions విషయమై నే నడిగాను. రెండింటిని ఒకే category లో పెట్టడం మంచిదికాదేమో ?

26th March 1956]

THE HON. SRI D. SANJIVAYYA :—ఇప్పుడు answer to (b) లో The matter is under consideration అని చెప్పాను. అంటే exempt చేయవలెనా, లేదా అనేది consideration లో ఉన్నది.

SRI G. NARASIMHAMURTHY :—దీనివల్ల లక్ష రూపాయిలకు పైగా ఆదాయం వస్తుందని మంత్రిగారు సెలవిచ్చారు. ప్రభుత్వం పన్నులు విధించే విధానంలో ఆదాయమే ప్రధానంగా చూస్తారా ? ఇచ్చుకునే వ్యక్తుల స్థితిగతులను గురించికూడా యోచించడం ప్రభుత్వ విధానం అవునా కాదా ?

THE HON. SRI D. SANJIVAYYA :—గౌరవ సభ్యులు చెప్పినట్లు ఆదాయాన్ని అభివృద్ధి చేసేటటువంటిది ప్రధానమైన సూత్రం. తరువాత ఎవరికేనా బాధాకరంగా ఉంటుందా అనే విషయం ఆలోచించి, ఎక్కువ ఆదాయం వచ్చేటట్లు, తక్కువ బాధాకరంగా ఉండేటట్లు ప్రభుత్వ విధానాన్ని అమలుపరుస్తూ ఉంటాం.

SRI T. GOPALAKRISHNA GUPTA :—ఇప్పుడు whole-salers writ move చెయ్యడం మూలాన వారిమీద వసూలు చేయడంలేదు. Retailers మీద మాత్రం వసూలు చేస్తున్నారు. ఆవిధంగా writ పర్యవసానం తేలేవఱకూ retailers మీదకూడా వసూలు చేయకుండా ఉండే విధానం ప్రభుత్వం ఆలోచిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—గౌరవనీయులైన సభ్యులు High Court లో writ ఉన్నదనే సంగతికూడా జ్ఞాపకం చేశారు. అయితే ఇది sub-judice. అందువల్ల దీని విషయంలో ఏ నిర్ణయం జరగదు ఆ decision వచ్చేవఱకూ

*Number of yarn mills in the State.*

644—

* 1022 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

**(a) number of yarn mills proposed to be started in the State in due course on Co-operative basis, and.**

**(b) the places at which they will be started ?**

THE HON. SRI K. VENKATA RAO :—

**(a) Only one yarn mill is now proposed to be started on Co-operative basis.**

(b) The mill will be established at Tadpatri in the Anantapur District.

(అ) ఒక్కటే రాష్ట్రంలో సహకార పద్ధతిమీద ఈ నూలు వడికే మిల్లు పెడుతున్నారు.

(ఆ) ఈ మిల్లు అనంతపురం జిల్లా తాడిపత్రిలో పెట్టబడబోతోంది.

SRI S. VEMAYYA :—ఎంత పెట్టుబడితో ఈ Yarn Mill పెట్టబడుతోందో తెలుసుకోవచ్చునా ?

THE HON SRI K. VENKATA RAO :—35 లక్షలు అవుతుందని అనుకుంటున్నాం. 17½ లక్షల రూపాయిల share capital అక్కడున్న ప్రజలు వసూలు చెయ్యడానికి, 17½ లక్షలు గవర్నమెంటు ఇవ్వడానికి నిర్ణయం జరిగింది.

SRI PRAGADA KOTIAH :—ఈ సహకారపద్ధతులమీద చీరాలలో కూడా ఒక mill నెలకొల్పడంకోసం కొంతమందిచేరి promoters గా ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టారు. ఆ విషయంలో ఎంతవరకూ పరిశీలన జరిగిందో వివరిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ దరఖాస్తు వచ్చేటప్పటికి planning commission వారియొక్క allocation అయినది. అందుచేత మేము ప్రత్యేకంగా సిఫార్సుచేశాం. గవర్నమెంటువారియొక్క share capital గనుక చీరాల Mill కి కావాలన్నట్లయితే Planning Commission వారు మళ్ళీ మనకు 17½ లక్షల రూపాయిలు ఇవ్వవలసియుంటుంది. వారి జవాబువచ్చిన తరువాత ఆ విషయంలో నిర్ణయం జరగడానికి వీలుంటుంది.

SRI G. NARASIMHAMURTHY :—తూర్పుగోదావరిజిల్లాలో పిఠాపురం తాలూకాలో ప్రత్తి విపరీతంగా ఉత్పత్తి అవుతోంది కనుక గొల్లప్రోలులో కాని, పిఠాపురంలోకాని ఒక మిల్లు పెట్టడానికి యోచనఉన్నదా ?

THE HON. SRI K. VENKATA RAO:—పిఠాపురం తాలూకాలో తయారయే ప్రత్తి కొల్లలుకాదు. ఒక మిల్లుకుకూడా చాలదు. పైగా అది సన్న నూలు వడకడానికి వీలుకాదు. అయినా వారి కోరికప్రకారం కాకినాడలో limited liability క్రింద spinning mill ఒకటి పెడుతున్నారు. నరసింహామూర్తి గారు కాంగ్రెసులో చేరేవరకు ఆ బట్టలు కట్టుకోవచ్చును.

26th March 1956]

*Subsidy loans for sinking wells.*

645—

* 1004 Q.—SRI P. BIAP REDDI :—Will the Hon. the Minister for Agriculture be pleased to state .

(a) whether the Government propose to extend the time to agriculturists who have taken subsidy loans from the Government for sinking wells and have not been able to complete them, due to the extraordinary reasons ; and

(b) if not, whether the loans will be written off ?

THE HON. SRI K. OBULA REDDI :—

No, Sir.

SRI N. K. LINGAM :—అధ్యక్షా, బావులు త్రవ్వడానికి ప్రభుత్వం ఇచ్చిన subsidy కంటె ఎక్కువ డబ్బును బీదప్రజలు ఖర్చుపెట్టి బావులు తయారు చేశారు. అయినా నిర్ణీతకాలంలో పూర్తిచేయలేదని బాధపెడుతున్నారు. ఇప్పుడయినా ఒక కమిటీవేసి నిజంగా ఖర్చుచేసి నిర్మించిన బావులు విషయంలో మాఫీ చేయడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. SRI K. OBULA REDDI :—ఈ రకంగా బాధలు పడినవారికి చాలా అవకాశాలు ఇచ్చారు ప్రభుత్వంవారు ఆ అవకాశాలను రైతులు వినియోగం చేసుకోలేదు.

SRI A. BAPINEEDU :—ఈ సందర్భంలో త్రవ్విన నూతులు విషయంలోకూడా త్రవ్వలేదని Revenue officers report వ్రాశారు. ఆవిధంగా dispute లో ఉన్న wells విషయంలోఅయినా recover చేయకుండా enquiry చేయించడానికి ప్రభుత్వం చూస్తారా ?

THE HON. SRI K. OBULA REDDI .—1944 లో ప్రారంభమయిన ఈ ప్రణాళిక 1952 వరకు అమలుజరిగింది. ఇన్ని సంవత్సరాల మధ్య కాలంలో చాలా అవకాశాలుఇచ్చారు. ఇన్ని అవకాశాలుఇచ్చినా ఉపయోగించుకొనలేక పోయారు. ఇందులో ప్రభుత్వంతప్పు ఏమీలేదు. రైతులుదేతప్పు.

SRI S. VEMAYYA :—ఎన్నిబావులుకు subsidies పూర్తిఅయిపోయాయి ? పూర్తికాకుండా ఎన్నిఉన్నాయి ? ఎన్నింటికి subsidy వసూలు చేయాలి ?

THE HON. SRI K. OBULA REDDI :—Notice please.

SRI P. GOPALU REDDI:—బావుల subsidies విషయంలో చాలా అన్యాయం జరిగిందని ప్రభుత్వానికి చాలా representations వచ్చాయి. 1954 జూన్‌లో Central Government వారు, పూర్తికాకపోతే మీరే భరించుకుంటే అభ్యంతరం లేదని అనడంతో మన ప్రభుత్వమే భరించుకోవలసిన పరిస్థితులు వచ్చాయి. ఈ పరిస్థితులను మార్చుకోడానికి Central Government ను తిరిగి అర్థించడమో లేక మన ప్రభుత్వమే పెట్టుకోవడమో ఆలోచిస్తారా ? ఈ విషయం కృష్ణప్పగారు వచ్చినపుడు ప్రస్తావిస్తే " మీ ప్రభుత్వం వ్రాస్తే తప్పకుండా మేము ఆలోచిస్తామని " హామీ ఇచ్చారు. ఈ విషయం మంత్రిగారికి తెలుసునా ?

THE HON. SRI K. OBULA REDDI :—చివరి సారిగా అభ్యర్థించారు. దానిమీద 1954 సెప్టెంబరువరకు మన ప్రభుత్వం గడువు ఇచ్చింది; జూన్ వరకు పొడిగించామని Central Government వారు అన్నారు. అయినా మన ప్రభుత్వం క్షమించడానికి పూనుకున్నది. దానివల్ల రు 6,06,049-8-0 లు నష్ట పడ్డాము.

SRI L. LAKSHMANA DAS .—ఈ subsidy wells విషయంలో కొంత డబ్బు ఇస్తే త్రవ్వడం కొన్నిచోట్ల నీరుపడడం జరిగింది. వసూలు చేయడం అడ్డడానికి అభ్యంతరం ఉంటే వాటిపై వడ్డీవసూలు చేయడమైనా తగ్గించుకుని కొంతమయినా వసూలు చేయడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI K. OBULA REDDI .—ఆలోచిస్తాము.

SRI E. AYYAPU REDDI :—నూతులు నిర్మాణానికి ప్రభుత్వం subsidy ఇవ్వడానికి ఏమైనా షరతులు పెట్టారా ? వీటిప్రకారం అప్పుతీసుకున్న ఆసామీ నూతులు నిర్మించుకోడానికి దానిని చూసే అధికారి ఎవరు ? రైతులకు అధికారులకు భేదాభిప్రాయం వస్తే నిర్ణయంచేసేవారెవరు ?

THE HON. SRI K. OBULA REDDI .—నిర్ణయాలు ఏర్పాటుచేసేది ప్రభుత్వం. ఈ కాలంలో తప్పకుండా త్రవ్వాలి అని, ఈ డబ్బు దుర్వినియోగం చేయరాదు. ఎవరైనా రైతులు బావులు త్రవ్వక దగా చేస్తే వారివిషయం మన్నించడమో రద్దుచేయడమో ఆలోచిస్తామని నియమం ఉంది. దాని ప్రకారం ఈ ప్రణాళిక అములు జరిపారు. చాలామందిని మన్నించడమో లేకపోతే ఆ బావులు fail అయితే క్రొత్తబావులు త్రవ్వుకోనడానికి అవకాశాలు ఇవ్వడమో జరిగింది.

SRI S. KASI REDDI :—కొంతమంది రైతులు subsidy తీసుకున్న తరువాత సకాలంలో బావులు పూర్తిచేశారు. Thasildar వచ్చినప్పుడు రైతులు

కొన్ని యిబ్బందులవల్ల ఏవో కారణాలవల్ల ఊరిలో లేకపోవడంవల్ల బావులు త్రవ్వినా అధికారుల రిపోర్టులుమాత్రం పూర్తికాలేదని ఉన్నాయి. ప్రభుత్వం నియమనిబంధనల ప్రకారం త్రవ్విన బావుల విషయంలోకూడా summary గా recover చేస్తున్నారు. Dispute లోవున్న కేసులనయినా ప్రభుత్వం పరిశీలించడం న్యాయం. దానిని ప్రభుత్వం పరిశీలిస్తారా ?

THE HON. SRI K. OBULA REDDI:—ఇటువంటి కేసులు పరిశీలన చేయడానికిచూస్తారు. నాకు తెలిసిన భోగట్టా ఏమిటంటే ప్రభుత్వం కంట్లో దుమ్ముపోసినది రైతులే ఎక్కువమంది అని, ఇచ్చినడబ్బును ఇతర కార్యాలకు వినియోగించుకున్నారు. బావులను త్రవ్వడానికి మాత్రం ఉపయోగించుకోలేదు.

[*Note*:—An asterisk *at the commencement of a speech denotes revision by the Member ]

## II. SUPPLEMENTARY STATEMENT OF EXPENDITURE FOR 1955-56 (Discussion—contd.)

MR. SPEAKER :—Let the Members confine themselves to the demands before the House.

SRI S. RANGANATHA MUDALIAR :—Mr. Speaker, Sir, in connection with the Demands for Medical and Public Health, I wish to offer a few remarks about family planning. My friend Mr. Anthony Reddi spoke the other day about the policy of the Government in this regard.

MR. SPEAKER :—The Hon. Chief Minister has not put forth any demand for family planning.

SRI S. RANGANATHA MUDALIAR :—Then, I do not propose to talk.

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, perhaps he wants to refer to what we have not done, and to draw the attention of the Government to their failure in that regard. So, we would like to hear Mr. Ranganatha Mudaliar.

SRI S. RANGANATHA MUDALIAR :—Sir, I do not propose to talk now. Let other hon. Members speak, Sir.

SRI P. PARTHASARATHY :—అధ్యక్షా, [illegible] . [illegible] Demand ను support చేస్తూ ప్రభుత్వ[illegible] [illegible]

Sri P. Parthasarathi] [26th March 1956

నసుకొంటున్నాను. ప్రభుత్వమువారు ఫారెస్టు విధానమును వివరిస్తూ కొంత డబ్బు ఆదాయంచేసుకునే మార్గం చెబుతారని ఆశించాను. అటవీసంపదను పెంపొందించడానికి ప్రభుత్వం ఆలోచనలో లేనట్లు తెలుస్తుంది మన ఆంధ్రదేశములో ముఖ్యముగా అటవీసంపద ఎక్కువగా ఉన్నది. దీని సంరక్షణకు తగువైన ఏర్పాటు చెయ్యవలెనని నేను కోరుచున్నాను కొంపు కట్రాక్టర్లు గాని, ఉద్యోగస్తులు గాని పోయేందుకు అవసరమైన రహదారులు ఏమీలేవు. ప్రతిజిల్లాకు లక్షా, రెండు మూడు లక్షలు కేటాయించి ఈ అడవిప్రాంతాలకు పోయేదానికి రహదార్లు ఏర్పాటుచేస్తే మంచిదని భావిస్తున్నాను. 10, 20 మైళ్లు పోయేటప్పటికి మంచి నీరు దొరకని ప్రాంతాలు ఉన్నవి అక్కడ మంచినీటివసతి ఏర్పాటుచెయ్యవలెనని నా సూచన. ఫారెస్టు రేంజిలు ఎక్కువచేసి, ఉద్యోగస్తులు తదితరులకు ఫారెస్టులో చాలావరకు కొన్ని సదుపాయములుచేస్తే మంచిది

తరువాత minerals కూడా ఉన్నవి. ఒక రేంజరు, ఫారెస్టరుకు కొంత staff ఇచ్చి ఈ మినరల్సును సోధనచెయ్యవలెను అని నా అభిప్రాయము వ్యవసాయము విషయములో కొన్ని ప్రాంతాలలో 30, 40 ఎకరాలలో పండ్లపరిశ్రమ జరుగుతూఉంది. కొన్ని cold storage points ఇవ్వవలెనని అడిగినాము. రాజంపేటలో 50 వేల ఎకరాల సాగుజరుగుతూ వున్నది. ప్రభుత్వ ఆదరణ ఇంత వరకు దొరకడములేదు. సీజనులో 6,8 మాసాలు పండ్లవ్యవసాయము జరుగుతుంది. Frigidaries లేవు కోడూరు, రాజంపేటలో cold storage కల్పించవలెను అదే ప్రకారముగా విశాఖపట్నంలోను, విజయనగరములోను పండ్లకేంద్రములలో storage points ఏర్పాటుచేస్తే ప్రభుత్వానికి ఆదాయము వస్తుంది. ఆ వృత్తిదార్లకు సహాయంచేసినవారు అవుతారు ఈ విషయమై శ్రద్ధతీసుకోవలెను

ఆంధ్రరాష్ట్ర Horticultural Association ప్రతి సంవత్సరం conference పెట్టి, exhibition లు పెట్టి పండ్లసంపదను ప్రభుత్వ ఆకర్షణకు ప్రచారము చేస్తున్నారు. గాని ప్రభుత్వంవారి సమాలోచనకు రాలేదు. హార్టికల్చరలు అసోషియేషన్‌కు చేసిన తీర్మానాలను గుర్తించడములేదు. వారు కోరిన కనీస కోర్కెలను కూడా మన్నించడములేదు.

Onion Research Station, Chillies Research Station, Turmeric Research station పెట్టడములేదు. రైతుకు ఉత్పత్తికష్టాలు చాలా ఉన్నవి. ఈ ప్రకారముగా చేస్తే ఇట్లా సంపద ఎక్కువ అగుతుందని సలహాచెప్పే ప్రయత్నముచేయు. దానికి ఈ Demands కు డబ్బు కేటాయించలేదు. మూరద్దు

ముందు ప్రభుత్వంవారు పరిశోధనాలయాలను ఏర్పాటుచేస్తే వ్యవసాయదార్లు సంతృప్తిచెందగలరని ఆశిస్తూ విరమించుచున్నాను.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈ సప్లిమెంటరీ డిమాండు సందర్భములో ముఖ్యముగా ఫారెస్టు విషయములో ఒకటి రెండు విషయాలు మనవిచెయ్య దలచుకున్నాను. వీటివిషయములో చాలా తర్జనభర్జనలు జరుగుచున్నవి. వీటిని పరిష్కరించాలని మంత్రిగారు 13 మంది సభ్యులతో చర్చలు జరిపినారు కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు. పుల్లరివిషయములో ఆ విధానము అమలుజరుపబడవలెను. జమీందారీలు రద్దు అయినతరువాత తీసుకున్న ఎస్టేటు ఫారెస్టులకు సంబంధించి గ్రామానికి సుమారు ఒకమైలులోపల ఉన్న భూమి విడిచి పెట్టవలెను అనేది అమలుజరపడములేదు. దానికి staff కావలెను. దానికి ఎక్కువ మొత్తము కేటాయించవలెనని కోరుతున్నాను. కేసులుమాత్రము ఎక్కువ అగుచున్నవేకాని రైతాంగం సమస్యలు ఏవీ పరిష్కారము కాలేదు. ముఖ్యముగా ఈ లోపాలు taken over estates లో ఉన్నవి. చట్టవిరుద్ధముగా ప్రభుత్వము కంచెలను వేలమువేయిస్తున్నది. ఇక్కడ ద్వంద్వప్రభుత్వము సాగుచున్నది. Taken overestates కు ఫారెస్టు డిపార్టుమెంటువారు permit system పెట్టి ఆవులు, గొర్రెలు, బర్రెలకు పుల్లరి వసూలుచేస్తున్నారు. రెండవవైపున రివెన్యూ డిపార్టుమెంటువారు గ్రామంలో కంచెలు వేలముచేసి వసూలుచేస్తున్నారు. రైతాంగము పుల్లరివిషయములో చాలా బాధలు పడుతున్నారు. నేను ప్రశ్నసమయములో ఇలాంటి అన్యాయపుకేసులు ఉపసంహరించుకోవాలని అడిగితే అవిధముగా చేస్తాము అన్నారు. చట్టవిరుద్ధముగా, అధికారములేకుండా అర్డర్లు ఇచ్చి కంచె పుల్లర్లను వేలం వెయ్యడం న్యాయంకాదు. రైతులు కంచపుల్లరి permit లకు డబ్బు చెల్లించలేకుండా ఉన్నారు అనేకచోట్ల పశువులను బందెలదొడ్డిలోపెట్టడము అడ్డగింపు నేరాలకు కేసులుపెట్టడము జరుగుచున్నది. ఈ విషయములో ప్రశ్నల సమయములో వెంటనే stay ఇచ్చి పుల్లరి, పెర్మిట్ల వసూలు ఆపవలెనంటే చేస్తామని మంత్రిగారు అన్నారుగాని ఇంతవరకు ఏమీ జరగలేదు. నిర్లక్ష్యభావంతో శాసన సభ్యులు చెప్పినా పట్టించుకోలేదు. నేను ఈవిషయము రివెన్యూబోర్డు మొదటి మెంబరుకు చెపితే ఆలోచిస్తామన్నారు. గాని ఇంతవరకూ ఏవిధమైన ఆర్డర్లు రాలేదు. Stay ఇప్పిస్తామన్నారు కాని ఇంతవరకు ఏమీ జరగలేదు. రివెన్యూ అధికార్లు, ఫారెస్టు అధికార్లు వసూలుచేస్తున్నారు. ఎక్కువ పోట్లపోలిరోల్లువేవు కాబట్టి కొత్త మంత్రిగారు అయినా ఈ సమస్య విషయములో శ్రద్ధ తీసుకొంటారని, లేకపోతే బాధ్యత ప్రభుత్వం [illegible] మనవిచేస్తున్నాను.

నెల్లూరులో 5, 6 తాలూకాలలో ముఖ్యముగా వెంకటగిరిలో taken over గ్రామాలు చాలా ఉన్నవి. రెండు విధములైన పుల్లరి కడుతున్నారు రైతులు. ఫారెస్టు ఉద్యోగులు జులుంచేసి కేసులు పెట్టిన సంఘటనలు ఉన్నవి. Compounding విధానము చాలా అన్యాయం అని మనవిచేస్తున్నాను. నేరం ఒప్పుకున్న తరువాత D.F.O. Judgment చెప్పడము చాలా అన్యాయముగా ఉంది. వచ్చే సంవత్సరము ఒకవిధమైన పుల్లరి వసూలుచేస్తారని, కంచెపుల్లరి రద్దుచెయ్యవలెనని మంత్రిగారిదృష్టికి తెస్తున్నాను.

తరువాత ఉపాధ్యాయులకు సంబధించి నెల్లూరు జిల్లాలో aided schools ను ప్రభుత్వం తీసుకుంటుందని ప్రకటన వచ్చింది ప్రకటన వచ్చిన తరువాత తప్పకుండా ఒక జిల్లాలో నైనాసరే యీ పాఠశాలలను ప్రభుత్వం తీసుకుంటుందని చాలా సంతోషించాము కాని దానికి పెట్టిన మినహాయింపులు చూసినట్లయితే యీ scheme మొత్తంమీద ఏదో ఒక రకంగా దీనిని blow up చేసే పద్ధతిలో కనపడుతున్నది ఎందువల్లనంటే చాలా బాగా జరిగేటటువంటి పాఠశాలలు ప్రభుత్వం తీసికోదు, అని దీంట్లో clause పెట్టబడింది ఏ పాఠశాల సక్రమంగా జరుగుతుంది ఏది సక్రమంగా జరగదు అనే విషయం మొదట నిర్ధేశించబడాలి. Managers తమ యాజమాన్యంలో schools ఉంచుకోవాలని గట్టిగా ప్రాంభిసూ తమ school బాగా జరుగుతుందనీ కావలసిన certificates పుట్టించుకొస్తారు అలాంటప్పుడు ఆ బడులను అట్టేపెట్టడానికి అవకాశాలున్నాయి. కనుక తప్పకుండా ప్రభుత్వం ఈ మినహాయింపులు తీసివేయాలని మనవి చేస్తున్నాను. ఇకపోతే management క్రింద ఉండే schools ని సక్రమంగా నడిచేటట్లయితే వాటిని ప్రభుత్వం తీసుకోదని దాంట్లో ఉన్నది. దాని ప్రకారం యింతవరకు manager ఉండి management school గా మార్చుకుంటున్నారు. మా కనిగిరి తాలూకాలో వున్నటువంటి school forgery మాదిరిగా management సృష్టించి committee క్రింద school ప్రభుత్వం తీసుకోమని వ్రాసియున్నది. కాబట్టి 5½ నిమిషాలలో committee school గా మార్చివేసిన సంఘటనలు మీ దృష్టికి తీసుకురాగలను.

THE HON. Dr. B. GOPALA REDDI:—ఇప్పటికీ ప్రభుత్వాన్ని [illegible] సాగించలేరు. ఏ 2,3 సంవత్సరాలో మాసుకొని 2,3 సంవత్సరాల management క్రింద [illegible] వాళ్లని మినహాయింపు చేస్తున్నాను, overnight [illegible] Government [illegible]. [illegible]

Sri G. YELLAMANDA REDDI :—It is already done. ఎందువల్లనంటే సుమారు 10 రోజులలోపల Committee School గా మార్చారు. అటువంటి దానికి తావులేకుండా ప్రభుత్వం స్పష్టమైనటువంటి అభిప్రాయం ప్రకటన చేసినట్లయితే ఆ scheme వచ్చిన తరువాత నెల్లూరు జిల్లాలో ఒక manager క్రింద నున్న school ను మరో management కు మార్చవలసిన అవసరం ఎందుకు వచ్చింది ? అందువల్ల అలాంటి స్పష్టీకరణ తప్పకుండా ప్రభుత్వోద్యోగస్థుల కుండవలసిన అవసరంఉన్నది ఈ schoolsలో rolls సంఖ్య పెంచుతూ teachers సంఖ్య తగ్గించడానికి ప్రతి స్కూలులోను ఒక రిద్దరికి department వారు notices యిచ్చారు. ఈ రకంగా అనేక మందికి D. E. O. లు notice లు యిచ్చారు. ఈ scheme ప్రభుత్వం తీసుకున్నందుకు ఉత్సాహం ఒక వైపు నిరుద్యోగం చాలమందికి కలిగించారని రెండో వైపు విచారం కలుగుతుంది. గ్రామాలలో చదువుకునే అర్హతగల విద్యార్థులు తక్కువ ఉన్నారని ఎవ్వరమూ చెప్పలేము. చాలమంది విద్యార్థులున్నారు వాళ్లందరిని మన పాఠశాలలో రాబట్టడానికి ప్రయత్నాలు చేస్తున్నప్పుడు ఉపాధ్యాయులు జాస్తిగా ఉన్నారని చెప్పలేము. తీసేయాలనే సమస్య ఉత్పన్నంకాదు. Compulsory education పెడుతున్నాం కనుక ఉన్నటువంటి ఉపాధ్యాయులనైనా ఉంచాలని మనవిచేస్తున్నాను ఇకపోతే నెల్లూరు జిల్లా మెట్ట తాలూకాలలో కనిగిరి, పొదిలి, దర్శి తాలూకాలలో సక్రమంగా వర్షాలు కురవనందువల్ల పంటలు పాడైపోయినాయి: రెవిన్యూ మంత్రిగారు కావలి తాలూకా గురించి సమాధానం చెబుతూ కరువు ప్రాంత మని సెలవిచ్చారు. అనేక చెరువులు ఎండిపోయిన పరిస్థితులు తప్పకుండా గమనించి remissions యిచ్చి తక్కావి అప్పులద్వారాకూడా రైతాంగానికి సహాయం చేయాలని మనవిచేస్తూ విరమించుకుంటున్నాను.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా, ఈ supplementary demand ను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాను. మన ఆంధ్ర రాష్ట్రంలో III Form వరకు free education అన్ని వర్గాలవారికి యిచ్చుటకు మంత్రివర్గంలో ఒక తీర్మానం తీసుకొని ఆదేవిధంగా Homoeopathy వైద్యం అభివృద్ధి తీర్మానం చేసినట్టు తెలుస్తున్నది. III Form వరకు ఉచితంగా free education అన్ని వర్గాలవారికి ఇవ్వడమనేది ముఖ్యంగా వ్యవసాయదారులు కష్టజీవులు వారి సంతానమునకు విద్య నివ్వటంలో ఎంతో సహాయపడుతుంది. ఆదేవిధంగా

Sri P. Gunnayya] [26th March 1956

గ్రామాలకుకూడా Budget లో తగినటువంటి డబ్బును sanction చేయాలి. ఈ Supplementary Demands లో...

MR. SPEAKER :—మీరు యింగ్లీషు మాట్లాడుతున్నారు. ఈసారి 'తెలుగు' అంటే ఒప్పుకోడంలేదు (laughter)

SRI P. GUNNAYYA :—Supplementary Demands లో కూడా 8 కోట్ల రూపాయలున్నాయి. గొంట్లో చిన్న చిన్న minor పనుల గురించి 4, 5 సంవత్సరములనుండి శాసన సభ ద్వారా చెబుతున్నాను. ఎందుకంటే పెద్ద పెద్ద project లకు పెద్ద పెద్ద పనులకే ఖర్చుపెడుతున్నారు గాని గ్రామాలలోనున్నటువంటి చిన్నచిన్న చెరువులు వాగులు గెడ్డలు యిలాంటివి బాగు చేయించి పాడి పంటలు వృద్ధి చేయడానికి ఏమీ యిందులో లేదు. అదేవిధంగా యిప్పుడు హోమియోపతి వైద్యానికి ఆయుర్వేద వైద్యానికి ప్రోత్సాహమివ్వడానికి ప్రభుత్వం తగినటువంటి పూచీపడాలి. దానికి దృష్టాంతం గత నాలుగుమాసాలుగా నాకాల్లో పుండుపడి పార్వతీపురం శ్రీకాకుళం డాక్టర్లు చాలా injections చేసినా అది యింతవరకూ పోలేదు. కానిఇక్కడ శాసనసభ్యులు, హోమియోపతి డాక్టరు బి. ఆదినారాయణగారు, సోషలిస్టుపార్టీ ఆయన, యీ Budget సమావేశందగ్గరనుంచీ హోమియోపతిమాత్రలు యిస్తున్నారు. నా కాలుపుండు యిప్పటికి నిర్మూలం అయిపోయింది. అందుచేత తప్పకుండా ఆ వైద్యం విషయంలో ప్రాముఖ్యతయివ్వాలి. అదేవిధంగా Budget లో హరిజనుల విషయంలో గతప్రభుత్వం 10 లక్షలరూపాయలు reserve చేసినది. ఇప్పుడు ప్రభుత్వం యీ Budget లో ఏమీ యివ్వలేదు. ఆ 10 లక్షల రూపాయలు ఖర్చయినదో లేదో అదికూడా తెలియదు. కాబట్టి యీ ప్రభుత్వంకూడా హరిజనుల విషయంలో కొంత reserve fund కనీసం 5, 6 లక్షలయినాయిచ్చి హరిజనుల నివేశనస్థలాలకోసం ప్రత్యేకించి నివేశనస్థలాలు హరిజనులకివ్వాలి. అదికాకుండా శ్రీకాకుళంజిల్లా రాయలసీమకంటె చాలా వెనుకబడివున్నది. ఆ జిల్లాలో హరిజనులకు Field Labour Society అయినా పెట్టి నివేశనస్థలాలివ్వాలి. శ్రీకాకుళంజిల్లాలో బంజరుభూములను హరిజనులకు, భూములులేని పేదవాళ్లకు రెవెన్యూ అధికార్లుయివ్వలేదు. కాబట్టి, అవి గవర్నమెంటు స్వాధీనంలో తీసుకొని పేదలకు హరిజనులకు పంచిపెట్టాలి. అదికాకుండామా శ్రీకాకుళం జిల్లాలో ప్రతిగ్రామంలోనూ, రాత్రిపూట పాఠశాలలున్నాయి. Central Government డబ్బిస్తుంది. ముగ్గురు మాస్టర్లకు డబ్బు వస్తుంది మాస్టర్లు చదువుచెప్పడంలేదు. ఇదంతా వృధా అయిపోతుంది.

దాన్ని గురించి D. E. O. కు Inspector లకు అనేకదఫాలు చెప్పాను. ఇప్పటివరకు తనిఖీలేదు. వయోజనవిద్య మంచిదేకాని అంతా సరైనపద్ధతిలో నిర్వహించడానికి ప్రభుత్వం పూనుకోవాలి. ఆదేవిధంగా aided school లో కూడా చూడండి. ఒకగ్రామంలో 6 గురు మాస్టర్లున్నారు, 70 మంది పిల్లలున్నారు. ఆపూరు శిస్తంతా మాస్టర్లే తీసేస్తున్నారుగాని బాలురకు ఒక అక్షరంకూడా రావడం లేదు. Inspector ద్వారా ఆ teachers కు తగినటువంటి instructions యివ్వమని కోరుతున్నాను. కష్టపడి పనిచేసే రైతుకు సంతకం నేర్చుకునేపాటి చదువయినా రావడానికి ప్రభుత్వం యిప్పుడు పూనుకుంటున్నది. అలాంటప్పుడు గ్రామాలలో చదువు సదుపాయాలు ఎక్కువ చేయించాలని ప్రార్థిస్తున్నాను.

అస్పృశ్యతా నివారణకు ఈ బడ్జటులో ఏమీ కేటాయించలేదు. ఇప్పటికి గ్రామములలో 50% అస్పృశ్యత నివారణ అయినది. ఇంకా 50% నివారణ కావలసిఉన్నది. అస్పృశ్యతా నివారణకోసం M.L.A. లు వారి శక్త్యానుసారం పనిచేస్తున్నారు ఉద్యోగస్థులుమాత్రం ఈ హరిజన దినోత్సవములు వగైరావాటికి డబ్బు కేటాయించినాకూడా వాటినిఖర్చుపెట్టక, mischief చేస్తున్నారు. కలెక్టర్లు, తహసీల్దారులు వారి బంగళాలలోనుంచి కదలకుండా రిపోర్టులు తెప్పించుకుంటు న్నారు. క్రింద ఉద్యోగస్థులు బాగాజరిగినాయని వ్రాస్తున్నారు. అందువల్ల ఆయాగ్రామములలో ఉన్నటువంటి మునసబు, కరణములు, పంచాయితీ వారిదగ్గర నుంచి అవి జరిగినాయాలేదా అని కలెక్టర్లు రిపోర్టులు తెప్పించుకుంటే బాగుంటుంది.

గ్రామములలోని హరిజనులకు రివెన్యూఉద్యోగస్థులు భూములమీద పట్టాలు ఇచ్చినప్పటికికూడా, ఆ ఊర్లలోని 10 మంది పెద్దలుకలసి వారిని ఆ భూముల నుంచి కొట్టివేస్తున్నారు. అటువంటప్పుడు పోలీసుఅధికారులుకూడా వారిపై ఏ చర్య తీసుకోకుండా నిర్లక్ష్యముచేస్తున్నారు. వారికి ఒక వెండికప్పులో కాఫీనో, గవర్నమెంటు ముద్రఉన్న కాగితమో చేతిలోపెడితే వాళ్ళ మనస్సులుమారి, వారి జోలికి రాకుండా ఉంటున్నారు దానికి దృష్టాంతము, మార్కొండపుట్టఅనే గ్రామంలో 60 మంది హరిజనులు, వగైరాలన అంతా వారొక కాగితము వ్రాసి నంతమాత్రముచేత, వారిని అరెస్టుచేశారు. నేనుపోయి అయ్యావారిని కావలయు నంటే దావావేసుకోమనండి, ఊరికనే అరెస్టుచేయడం ఎందుకనిచెబితే ఆ సాయంత్రం వారిని విడిచిపెట్టారు మన ప్రజాప్రభుత్వములో ఇటువంటి అన్యా యములు జరుగుతున్నాయి. వీరందరికి గ్రామాలలో సరియైన సౌకర్యాలు ఏర్పాటు చేసి, మన ముఖ్యమంత్రిగారి నాయకత్వములో ఈ ప్రభుత్వమును నడిపిస్తారని ఆశిస్తూ, అధ్యక్షులవారికి నా హృదయ పూర్వకాభివందనములు సమర్పిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI N. K. LINGAM :—అధ్యక్షా, అసెంబ్లీలో మంచినీళ్లు తెప్పించుకొని త్రాగడము, పత్రికలు చదవడము, ఇంకా అనేకం చేస్తున్నారు. ఇవి చేయవచ్చునా అని ప్రశ్నిస్తున్నాను.

MR. SPEAKER :—వేసవికాలములో మంచినీళ్లు తెప్పించుకొని త్రాగడానికి అవకాశములు కల్పించాము. పత్రికలు చదవకూడదు

* SRI Ch. S. R. V. P. MURTY RAJU :—అధ్యక్షా, నేను ప్రతి సంవత్సరంకూడా ప్రత్యేకంగా ప్రకృతి వైద్యవిధానముగురించి మాట్లాడడము జరుగుతున్నది. బాధకలిగినప్పుడు, దానిని చూచి సందేహించడం జరుగుతున్నది. దానికి ఎంతమాత్రం ప్రభుత్వం సహాయముచేయ పూనుకోనందుకు విచారిస్తున్నాను.

ప్రకృతి వైద్యచికిత్స అనేది, మందులు వాడకూడదనే సిద్ధాంతము. దానిని మందులు ఇచ్చే వారియొక్క ఉద్దేశమును అనుసరించి దానిని రికగ్నైజ్ చేస్తాము అని ప్రభుత్వంవారు చెబుతున్నారు. ఆ ప్రకారంగా అనడంచూస్తే, ప్రకృతి వైద్య సిద్ధాంతాన్ని వ్యతిరేకించడం గాదనిపించుతున్నది. ప్రకృతి వైద్యసిద్ధాంతానికి వ్యతిరేకులను తీసుకువచ్చి దానిని ఒప్పుకోమంటే ఎవరూ ఒప్పుకోరు. ఈరోజు మమ్ములను మందులను తీసుకువచ్చి ఒప్పుకోమంటే మేము ఒప్పుకోము. ఇంతటివైపరీత్యమువున్న సిద్ధాంతాలతో ఒకరినొకరు గౌరవించడం చాలా కష్టము. ఈ విధానంలోవచ్చిన లాభాలుకూడా చాలా వున్నాయి. ప్రకృతివైద్యసిద్ధాంతము అంటే అదికూడా ఒకచికిత్సె. మానసికమైన మనుష్యులయొక్క తత్వాలు మార్చడం, వారికి ఆహార నియమములు, విహారనియమములను అలవాటుచేయడం. ఇది చేయడంవల్ల వ్యాధి కుదరడానికి ఎక్కువగా అవకాశములు ఉన్నాయి. అందువల్ల మందులలో జరిగే వైద్యంవల్లకంటే దీనివల్ల ఎక్కువమంచి జరుగుతున్నదా లేదా అనేది నిర్ధారణ చేయుటకు ఒక కమిటీనిగాని, experts గాని పెట్టి, వాటిని తెలుసుకొని, దానికి రికగ్నిషన్ ఇవ్వవలసిన అవసరము ఎంతైనా ఉన్నదని, పూర్తిసహకారంకూడా ఇవ్వవలసిన అవసరం ఉన్నదని మనవిచేస్తున్నాను. ఈపనికి పూనుకోకుండా, ఈ ప్రజాప్రభుత్వంలో దానికి ఏవిధంగా ప్రోత్సాహం, పూర్తి సహకారంచేయాలో అర్థమపక్షం ఆలోచనకూడా చేయకపోవడం చాలా శోచనీయం.

ఈ ప్రకృతివైద్యము అంటే చెప్పడమేగాని సాధారణముగా ఎవరికి తెలియదు. విటమిను బిళ్లలు ఇంజెక్షనులు వచ్చిన ఈ రోజుల్లో దానిని మరచిపోవడం ఆశ్చర్యం. ప్రకృతి వైద్య సిద్ధాంతమునకు, ఎంతకాలంనుంచో, అనేక పదార్థాలను మనకు

అవసరం ఉన్నా, లేకపోయినాకూడా తిని శరీరాన్ని అనారోగ్యంగా చేసుకొంటున్నాము.

ప్రతి మనిషికీకూడా తను ఆరోగ్యవంతుడని చెప్పుకోవడానికి ధైర్యంలేకుండా వున్నది. ఈ పరిస్థితుల్లో నేను ఆరోగ్యవంతుడనయాను అని ఎవరిమటుకు వారు నిర్ధారణచేయాలి. ఇప్పుడు ఉన్నటువంటి యంత్రాలుగాని, డాక్టర్లుగాని వాటిని నిర్ధరణ చేయలేరు. నేను రోగినా లేదా అని చెప్పడానికికూడా ఎవరికీ ధైర్యం లేదు. దీనిని నిర్ధారణ చేసుకొనుటకోసం తనయొక్క శరీరంమీద తనే దాని ప్రభావాన్ని గ్రహించాలి. ఒక ఆహారపదార్థం తీసుకున్నప్పుడు అది ఏమి పని చేస్తున్నది అనేది శరీరానికే తెలుసును తెలిసికోకుండా చేసేస్థితిలో మనం పడిపోయాము. దానికి ఒకటిచేయాలి. ఏవస్తువు అయినా శరీరంమీద ఏమిపని చేస్తున్నది అనేదానిని తెలుసుకోవాలన్నప్పుడు, దానికి ముందు 4, 5 రోజులు ఉపవాసముచేయాలి. ఎనిమా చేసుకోకుండా ఉపవాసముచేస్తే అది ఒక పొరపాటు అవుతుంది. ఎనిమాచేసి ఉపవాసంచేసినతరువాత మీరు ఒక పదార్థం తిన్నట్లయితే దానివలన శరీరానికి ఏమి లాభము కలుగుతుందో తెలుసుకుంటారు. అది నేర్చుకున్నప్పుడే దాని ఫలితంకూడా కలుగుతుంది. అది ఈ చికిత్సావిధానముయొక్క ప్రథమ దశ. ఉపవాసంచేసి, ఎనిమాచేసినప్పుడు, మన bad matter అంతా లివరు, మూత్రాశయం, మలాశయం, ఊపిరితిత్తులు ఇవన్నీకూడ సరిగా నడుస్తాయి. మలాశయాన్ని బాగుచేయాలనుకుంటే నిమ్మకాయరసమును నీళ్లలోకలిపి తీసుకున్నట్లయితే, అది శుభ్రపడుతుంది. తరువాత కొబ్బరినీళ్లు తీసుకున్నట్లయితే అది మూత్రాశయాన్ని శుభ్రపరుస్తుంది తరువాత నారింజరసం, ద్రాక్ష, జీడిమామిడికాయలు వగైరాలు దీసుకొన్నట్లయితే ఊపిరితిత్తులను బాగు చేస్తుంది. ఈ మూడు సరిగా పనిచేసే స్థితికి వచ్చినపుడు మన ఆరోగ్యం సవ్యంగానే ఉన్నదని చెప్పుకొనవచ్చును. ఉపవాసములు చేయుట చాలా తేలికైన పని. ఎనిమా చేయించుకొనకుండా ఉపవాసములు చేయుట పొరపాటు. ఉపవాసములు మానేటప్పుడు చాలా జాగ్రతగా ఉండాలి. అపత్యం చేయకూడదు. అపత్యం చేస్తే ప్రాణాపాయం కల్గుతుంది. మనం ఎన్ని రోజులయితే ఉపవాసములుచేస్తామో అధమ పక్షం దానికి రెండు, మూడు రెట్లు రోజులు అయినాసరే చాలా జాగ్రతతో పత్యం చేయాలి. ఆలా చేసినట్లయితేనే మన ఆరోగ్యం సక్రమంగా ఉంటుంది. ప్రకృతి చికిత్సవలన రోగములు తగ్గుతాయా, లేదా, అనే అనుమానం అక్కర లేదు. మేము అనేక వందల కేసులను చేశాము. వారందరికి రోగములు తగ్గినవి.

దానిని ఎపెండిసైటాస్ అని చేసినట్లయితే రొమేటిజం వస్తుందని మేము మొట్టమొదట జనరల్ ఆస్పత్రిలో చెపితే అక్కడి వారు నవ్వేవారు. ఇప్పుడు ఈ విషయాన్ని మిషనుల ద్వారా చెపితేగాని ప్రజలు నమ్మే స్థితిలో లేరు. నీకు ఆకలి అవుతోంది అని మిషనులు చెపితేనేగాని తెలియని స్థితిలో ఉన్నారు కొంత మంది ప్రజలు. ఆకలి అవుతోందో లేదో కూడ తెలియనివారు తమ ఆరోగ్యమును ఎట్లా బాగు చేసుకొనగలరు ? ఇటువంటి పరిస్థితులలో మనము ఏమిచేయాలి ? రోగికి ఆ రోగము ఎందుకు వచ్చినది అనే విషయమును మిషను ద్వారా కాకుండా అతని ద్వారా నే అతనికి అర్థమయ్యేటట్లు చేయాలి. అటువంటి వారికి ముఖ్యంగా ఆరోగ్య సూత్రములు తెలుపవలెను. ఇందుకుగాను ప్రత్యేకంగా విద్యా సంస్థలను ఏర్పరచి వారిని ఆరోగ్యవంతులుగా చేయాలి ఈ మిషనులకు, మందులకు ప్రజలను బానిసలుగా చేయకుండా బాగు చేయవలసినదిగా కోరుచున్నాను. పురిటి కేసులు, heart complaints, blood pressure మున్నగు వాటిని చాలా తేలికగా నివారించుటకు అవకాశములున్నవి. ఆ విధంగా మేము చేస్తున్నాము.

Mr. SPEAKER :—మీరు అసలు subject ని గురించి మాట్లాడకుండా వైద్యంమీద ఉపన్యాస మిస్తున్నారేమిటి ?

Sri Ch. S. R. V. P. MURTY RAJU :—Subject ఏమిటండి ?

Mr. SPEAKER :—మీరు వైద్యంమీద ఉపన్యాసం ఇస్తున్నారు.

Sri Ch. S. R. V. P. MURTY RAJU :—వైద్యంలో ప్రకృతి చికిత్సకు ఎలాంటి ప్రాధాన్యం ఇవ్వవలెనో చెబుతున్నాను. దీనిని గురించి ఈ మాత్రమైన చెప్పకపోతే అందరికి అర్థముకాదేమో అనే ఉద్దేశ్యంతో చెబుతున్నాను. ఇది subject కాకపోయినప్పటికీ క్షమించమని కోరుతున్నాను.

Mr. SPEAKER :—అయితే క్లుప్తంగా చెప్పండి.

Sri Ch. S. R. V. P. MURTY RAJU :—ఈ డైబెటిస్ అనే వ్యాధి మన ఆహారవిహారములమీద నే ఆధారపడి ఉంటుంది. మనం చేసేటటువంటి పనికంటె ఎక్కువగా ఆహారము తినుటవలన ఈ వ్యాధి వస్తుంది. మనం చేస్తున్న పనినిబట్టి ఆహారము తీసుకొన్నట్లయితే ఈ వ్యాధి వచ్చుటకు అవకాశంలేదు. ఈ వ్యాధి వచ్చినవారికి కారికురుపులువేసి అనేక ప్రమాదాలు కలుగుతాయని చెపుతారు. పంచదార తినుటవలన ఈ వ్యాధి వస్తుందని కొంతమంది చెబుతారు. పంచదార తిన్నంతమాత్రాన ఈ వ్యాధి రాదు. ఈ వ్యాధికలవానిచేత నేను వీశెడు పంచదార తినిపించి అతనికి రోగంలేకుండా చేయగలను.

26th March 1956

THE HON. SRI A. B. NAGESWARA RAO.—కళా వెంకట్రావు గారు ఇప్పుడు డైబెటీస్‌వ్యాధితో బాధపడుతున్నారు. వారికి ఏమైనా సలహా ఇవ్వండి.

SRI CH. S. R. V. P. MURTY RAJU.—సలహా ఇవ్వమంటున్నారు. తప్పకుండా ఇస్తాను. కాని ఈ సలహాను ప్రకృతి చికిత్సావారు కాకుండా ఆధునిక వైద్యులు చెప్పినట్లయితే వారు తప్పకుండా పాటిస్తారు. కళా వెంకట్రావుగారు ఆహారమును ఎక్కువగా తీసుకోనకుండా ఉన్నట్లయితే ఈ రోగం తప్పకుండా తగ్గుతుంది. మనం తిన్నటువంటి ఆహారం అరగకపోతే ఈవ్యాధి వస్తుంది. మనం భుజించిన ఆహారము పంచదారగా మారి తరువాత రక్తముతో కలియుటకు శక్తిలేనపుడు పంచదార రూపంగా బయటపడుతుంది అందుచేత ఆహారం ఎక్కువగా తీసుకొనవద్దని ఒకపూటమాత్రమే భోజనంచేయమని వెంకటరావుగారికి సలహా ఇస్తున్నాను. మన ప్రజలు పురిటి కేసులలో హెచ్చుగా మంత్రసానులను ఉపయోగిస్తూ ఉంటారు జంతువులు ఈనుటకు అట్టే శ్రమపడవు. ఎండలో తిరిగి పనిచేసేవారుకూడ ఎక్కువగా ప్రసవవేదన చెందరు. అంటే ఇవి ముఖ్యంగా ఆహారవిహారాలలో వచ్చేటటువంటి తేడాలు. ఎండలో తిరగనివారు, ఏపనీ చేయని వారు ప్రసవించేటప్పుడు చాల బాధ పడతారు. అసలు నడవడం, తినడంచేత కాని వారికి కనడం మాత్రం ఏలాచేత నవుతుంది ? మొదటినుంచి ఆహారవిహారములు ఎట్లు తీసుకొనవలెనో నేర్పినట్లయితే ఇటువంటి లోపము రాదు.

T. B. patients ను ఉపవాసములు చేయినీయకూడదు. దానికి మేము తగిన చికిత్స చేయగలము. ఆఖరుదశలోకి వచ్చినతరువాత ఆ రోగమును తగ్గింప జేయలేము కాని ప్రథమదశలో నున్నపుడు మేము దానిని cure చేయగలమని చెపుతున్నాను. మేము కొన్నివందల కేసులను cure చేసినాము. గాంధీగారు దానికి ప్రోత్సాహమివ్వవలెనని చెప్పినారు, ఆచరించారు. గాంధీగారు పేరుచెప్పుకొని నడిచే మనమందరమూకూడ ఈ ప్రకృతి చికిత్సకు సహాయపడకపోవుటవలన గాంధీ గారి తత్వమునకే వ్యతిరేకులమని చెప్పుట తప్పుటలేదు. ఇప్పుడు ఈ ప్రకృతి చికిత్సనుగురించి ఎక్కువగా చెప్పాలంటే చాలా time తీసుకుంటుంది. ఇప్పుడు విద్యాసంస్థలలో మార్పు తీసుకురాకపోయినట్లయితే మనదేశమునకు దిక్కులేద నే స్థితిలో ఉన్నాము. మనం చదువుకొనేచదువు ఉద్యోగములుచేయుటకు, పుస్తకములు చదువుటకు ఉపయోగిస్తున్నది. M.A., లు B.A లు చదివి ఇంటికి వచ్చినతరువాత

Voting on Supplementary Statement of Expenditure for 1955-56.

Sri Ch. S. R. V. P. Murty Raju] [26th March 1956

ఏమి చేయవలెనో తెలియనిస్థితిలో మనం ఉన్నాము. చదువుకొన్నవాడు బయటి ప్రపంచంలోకి పోయినతరువాత అవసరమైతే తన bedding తను మోసుకోవాలని తెలియనిస్థితిలో ఉన్నాడు. ఇటువంటి చదువు చెప్పించినందువల్ల ప్రయోజనం ఏమిటి? Central Government వారు ప్రత్యేకంగా జనతా కాలేజీలు పెట్టి వాటికి grants ఇస్తున్నారు. దానిని మనరాష్ట్రంలో ప్రారంభించాలనే ఉద్దేశ్యమే లేదు మనప్రభుత్వమునకు. ప్రజలకూ లేదు. అసలు ఎవరికీకూడ జనతా కాలేజీ అంటే ఏమిటో అర్థంకావడంలేదు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—మా జిల్లాలో నరశింహమూర్తిగారు అని ఒకరు ఉన్నారు. ఆయన ఏదో ప్రయత్నం చేస్తున్నారు. మీకు వివరములు ఏమైనా తెలిసినట్లయితే చెప్పండి.

SRI Ch. S. R. V. P. MURTY RAJU :—ప్రభుత్వంవారు support చేయకపోయినట్లయితే వివరములే మిగులుతాయి. పని మాత్రం జరగదు. నరసింహమూర్తిగారి వంటివారు, నావంటివారు ఎన్ని ప్రయత్నములు చేసినప్పటికీ ప్రభుత్వంయొక్క support ఉందా? అసలు ఈ ప్రభుత్వంవారు ఏమి ప్రయత్నం చేసినారు? ఎయిరోడ్రామ్సు అన్నీ మాకు కావాలని నర్సన్నగారు అడిగినారు. ఆనాడు ప్రభుత్వం దానివిషయమై ఆలోచించిందా? మేము ఎన్ని పర్యాయములు అడిగినప్పటికీకూడ buildings ను smash చెస్తోంటే చూస్తూ కూర్చున్నారు గాని జనతా కాలేజీలను గురించి ఏమైనా ప్రయత్నం చేసినారా? T. B. Sanitoriums పెడతామని ఆ buildings బద్దలు కొట్టేదాకా ఊరుకున్నారు. శ్రీ నాగేశ్వరరావుగారు అప్పుడులేరు కొబట్టి తెలియక పోవచ్చును.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—T. B. Sanitorium కు ఆ స్థలం పనికిరాదనే నా అభిప్రాయం.

SRI Ch. S. R. V. P. MURTY RAJU :—అసలు ఇచ్చినట్లయితే ఎందుకో ఒక అందుకు పనికివచ్చును. ఇవ్వలేదుకదండీ?

ఇప్పుడు ఆంధ్ర రాష్ట్రంలోని చిన్న పిల్లల విద్యా విధానమును మార్చుచేసి వారికి కావలసిన సౌకర్యములను కలుగజేస్తారని నమ్ముతున్నాను. గోపాలరెడ్డిగారు మన రాష్ట్రంలో III Form వరకు ఉచిత విద్యా సౌకర్యములు కలుగజేస్తున్నారు. ఆడపిల్లలకు Secondary Education వరకు ఉచితంగా చెప్పించవలెనని కోరుతున్నాను. అమాయక బీద పిల్లలను పోషించే అనాథ శరణాలయములు కొన్ని

ఉన్నవి. ప్రభుత్వంవారు ఆ సంస్థలకు ప్రోత్సాహం, సంపూర్ణ సహకారం ఇవ్వవలసి ఉన్నది.

ప్రభుత్వం తగినంత ప్రోత్సహింపకపోవుటవలన అటువంటి సంస్థలను పెట్టిన ప్రజలు నాశనమై పోవడం, ఆ సంస్థలు మాత్రం అలాఉండిపోవడం జరుగుతున్నది. ఇటువంటి సంస్థలకు సంపూర్ణ సహకారమిచ్చి అనేక సంస్థలు పెట్టుటకు కావలసిన సదుపాయములు కల్పిస్తారని ఆశిస్తున్నాను. కేంద్ర ప్రభుత్వంవారు industrial labours కు గృహసౌకర్యములు కలుగజేస్తున్నారు. మనందరకు కావలసిన ఆహార పదార్థములను పండించే రైతు కూలీలకు ఎటువంటి సౌకర్యములు కలుగజేయలేక పోతున్నాము. వారు ఇళ్లు కట్టుకొనుటకు సగము ప్రభుత్వంవారు భరించి సగం గ్రాంటుగాను సగం loan గాను యిచ్చి తగిన సౌకర్యములు కలుగజేసినట్లయితే ప్రజలయొక్క ఆదరాభిమానములను ప్రభుత్వం పొందగలదని ఆశిస్తున్నాను. ఇప్పుడు మన రాష్ట్రంలో భూదానోద్యమం సాగుచున్నది. ఆ భూదానోద్యమములో మంచి భూములు, చెడ్డ భూములుకూడ వస్తున్నాయి. ఆ భూములను బీదలకు ఇచ్చేటప్పటికి ఉపయోగంలో లేకపోయినట్లయితే వారికి ఎకరమునకు 100 రూపాయలో 200 రూపాయలో గ్రాంటుగా ఇచ్చి దానిని మంచి భూమిగా మార్చి బీదలకు సహాయ పడతారని ఆశిస్తున్నాను. అధ్యక్షులవారు నాకు ఎక్కువ time ఇచ్చినారు. నేను ఇంకా ఎక్కువ time తీసుకొనకుండా గౌరవముగా వెళ్లాలనే ఉద్దేశ్యంతో ఇంతటితో విరమిస్తున్నాను.

SRI M. SATYANARAYANA RAJU:—అధ్యక్షమహాశయా, ఈ suplementary demad ను ఇంత ఆలశ్యంగా తీసుకురావడంవల్ల ఈ శాసనసభ యొక్క హక్కును ధిక్కరిస్తుందని చెప్పడానికి నేను విచారిస్తున్నాను. ఈ సంవత్సరం ఇంకా నాలుగురోజులతో పూర్తికానున్నది. ఇంత ఆఖరుసమయంలో తీసుకొచ్చి శాసనసభముందు పెట్టి consideration కోసం అని చెపుతున్నారు. Discuss చేయడంలో ఏమి అర్థం ఉన్నదో నాకేమి బోధపడడంలేదు. Discussion చేయకుండా ratify చేయాలని చెపితే బాగుంటుంది. Discussion చేసినందువల్ల ప్రయోజనం కనబడడంలేదు. Dead body ని తీసుకొచ్చి operation చేసినట్లుగా ఉంది. ఈ supplementary demands చర్చించడం ఎప్పుడు వస్తుంది అంటే, అత్యవసరమైన పరిస్థితులు వచ్చినపుడు ప్రభుత్వం ఖర్చుపెట్టదలచిన డబ్బును శాసనసభముందు పెట్టి చర్చించ మన వచ్చును. ఇప్పుడు అటువంటిపరిస్థితులు రాలేదు. ఉదాహారణకు police demand మీద 22 లక్షలు ఖర్చుపెట్టాలని police కు ఈ provision అప్పజెప్పాలాము

Sri M. Satyanarayana Raju] [26th March 1956

గతసంవత్సరము ఆరుమాసాలక్రితమే అనుకొన్నాము. కాబట్టి ఏమాత్రం ఖర్చు అవుతుందోనని ముందుగా estimate వేసి అక్టోబరులో దానిని supplementary demand గా పెట్టవలసియుండినది. తతిమా పద్దులలోకూడా establishment వాటికి salaries, allawances, T.A.లు అని చెప్పి చాల పద్దులు చూస్తున్నాము.

ఈ సందర్భంలో అత్యవసరమైన పరిస్థితు లేమి ఏర్పడలేదు. ఇది కేవలం Assembly యొక్క ఆమోదం పొందకుండా నిర్లక్ష్యభావంతో ఖర్చుపెట్టి దీనిని మనముందు ఉంచి ratify చెయ్యమని చెప్పడం చాల అర్థరహితంగా ఉన్నది. శాసనసభ్యులు చాలమంది వారియొక్క నియోజకవర్గాలలోని అత్యవసరపరిస్థితులను చెప్పారు. అందులో ఒకదానినిగూడా చెయ్యలేదు. ఫలానా శాసనసభ్యుడు village school గురించిగాని, village education గురించిగాని, village communication గురించిగాని లేక అధిక వర్షాలచేత చెరువులు చాలవరకు కోసుకుపోయినాయి అనిగాని చెప్పినా వాటిని ప్రభుత్వం నిర్లక్ష్యంచేస్తున్నది కాని ఆటువంటి పనులను తొందరగా చేయడానికిగాను కలెక్టర్లను, రెవెన్యూ అధికారులను ఒత్తిడిచేసి తొందరగాచేశాము. వాటిక్రింద ఖర్చు అయింది, మీరు ఆమోదించండి, అంటే అర్థం ఉన్నది. ఈ సంవత్సరం అధికవర్షాలవల్ల జమీందారీ ప్రాంతాలలో లెక్కలేనన్ని చెరువులు కట్టలుతెగిపోయినాయి. ఎన్నిమారులు చెప్పినా ఇప్పటికికూడా వాటిని మరమత్తుచేయలేదు. ఇంత అత్యవసరమైన పరిస్థితులు ఎక్కడా లేవు. అందుచేత ఈ supplementary demand సమర్థనీయంగా లేదని చెప్పడానికి విచారిస్తున్నాను. గౌరవనీయులైన ప్రణాళికల మంత్రిగారు, ఉపముఖ్య మంత్రిగారు శ్రీకాకుళం వచ్చినపుడు అక్కడున్న పరిస్థితులను యదార్థంగా చూచినప్పటికి ఏవిధమైనచర్య తీసుకోలేదు.

Manganese transport లారీలకు రహదారీసౌకర్యం లేకపోవడంవల్ల heavy load అగుటచే driver control చేసుకోలేకపోవడంవల్ల ఒకనెలలో ముగ్గురు చనిపోయారు. ఈ సంగతి మంత్రిగారిదృష్టికి తీసుకువచ్చాము. ఆప్రదేశంలో వారిని దింపి చూపించినప్పటికి దానికేమి చర్యతీసుకోలేదు. ఇటువంటి ప్రాణహాని కలిగేటటువంటి పరిస్థితులున్నప్పటికి ప్రభుత్వం వీటికి ఏమిచేయకుండా వారికిష్టం వచ్చినట్లు ఏదో ఒక establishment వేయడం వారికి T. A లు ఇస్తున్నాం అది ఇస్తున్నాం, ఇది ఇస్తున్నాం, అని ఏవేవో ఖర్చులు చూపించి సమర్థించడం ఎంత మాత్రం సమర్థనీయంకాదని చెప్పడానికి విచారిస్తూ ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులవారిని అభినందిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

* SRI G. NAGESWARA RAO:—అధ్యక్షా, ఈ supplementary budgetలో 3 కోట్ల చిల్లర ఇప్పుడు Assembly ఆమోదానికి పెట్టడం సరిగాదని నా ఉద్దేశ్యం. Irrigation విషయం తీసుకొంటే తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకా కేసినపల్లి సైఫన్ (minor irrigation works) విషయంలో Chief Engineer వచ్చి చూచారు. అయినప్పటికి దానిని ఈరోజు బడ్జెట్‌లో శాంక్షను చేయలేదు. కేసినపల్లి అనే గ్రామంలో 2 వేల ఎకరాలు సాగుకువచ్చే భూమి ఉన్నది. అక్కడ ఉప్పుకాలువమీద కొత్తలెనుపాడు 1వ నెంబరు కాలువద్వారా సైఫన్‌కట్టి నీరు సరఫరాచేస్తే 2 వేల ఎకరాలు సాగులోకివచ్చే అవకాశం ఉన్నది. కాని దానిని ప్రభుత్వంవారు తీసుకోలేదు. అదేవిధంగా కడలికాలువమీద తాటి పాకవద్ద ఒక dam ఉన్నది. ఆ dam ను remodel చేయాలనికూడా ఇంతకు ముందే కోరాము. కాని దీనినికూడా ప్రభుత్వము తీసుకోలేదు. దీనిని remodel చేయకపోవడంవల్ల దీనికింద వున్న ఆయకట్టు కొన్నివేల ఎకరాలకు నీరు సరిగా అందక దెబ్బతింటున్నది. ఇది రైతాంగానికి ప్రధానసమస్యగా ఎదుర్కొంటు న్నది. అందుచేత తాటిపాక దగ్గరఉంటే ఆ dam ను remodel చేయడానికి తగినంత మొత్తాన్నికూడా ప్రభుత్వం కేటాయించాలి. గోదావరి డెల్టాలో locali-zation scheme ను revise చేయాలనికూడా మేము కోరాము. Localization schemeను revise చేయుటకు వెంటనే staffను వేసిపనిచేయిస్తే 57 సంవత్సరంలో second crop నాటికైనా పని పూర్తిఅయ్యేటట్టు చూడాలి. ఆవిధంగా చేస్తే రైతాంగముయొక్క కోర్కెలను కొంతవరకైనా తీర్చడానికి అవకాశం ఉంటుంది. రెండవపంట లేకుండా శాశ్వతంగా మూలపడివున్న కాలువను, తూములను తెరి పించడానికి అదనపు staff ను వెంటనే వేసి పనిచేయించాలని కోరుతున్నాను.

అదేవిధంగా medical విషయంతీసుకొంటే జిల్లాబోర్డుక్రింద ఉంటే కొన్ని ఆస్పత్రులను ప్రభుత్వం తీసుకొన్నది. రాజోలుతాలూకా జనరల్ ఆస్పత్రిని 1954 జూలైలో ప్రభుత్వం తీసుకొంది. అయితే ఇంతవరకు దానిని ఏమాత్రము అభివృద్ధిచేయలేదు. నేను ఈమధ్య ఆస్పత్రికివెళ్ళిచూస్తే 18, 19 మంచాలు మాత్రమే order లో వున్నాయి. Patients వరాండామీద పడుకొంటు న్నారు. అక్కడ lady doctor ను వెయ్యవలసిందిగా ఎన్నోసార్లు కోరాము. 1 లక్ష 60 వేల జనాభాగల రాజోలుతాలూకాకు ఒక్క లేడీడాక్టరు లేకపోవ డము చాల విచారకరం.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—కాకినాడ ఆస్పత్రిలో 400 beds ఉన్నాయి. మీరు 18, 19 మంచాలని చెపుతుంటే చాల ఆశ్చర్యంగా ఉంది.

SRI G. NAGESWARA RAO :—కాకినాడ ఆస్పత్రి కాదు. నేను రాజోలు తాలూకాగురించి చెపుతున్నాను. Lady doctorను వేస్తామని యింతకు ముందు ఎప్పుడో ప్రభుత్వము చెప్పింది. కాని యింతవరకు వేయలేదు. ప్రభుత్వము తీసుకోకముందునుండి 10, 12 మంచాలు పాడైపోయివున్నాయి. అవి అప్పుడు ఎక్కడ వున్నాయో ఇప్పుడుకూడా అక్కడే అదేస్థితిలోవున్నాయి. మొన్న నే ఒక ప్రశ్న సందర్భములో శ్రీ కళా వెంకట్రావుగారు రాజోలు ఆస్పత్రిని ప్రభుత్వము తీసుకున్నతరువాత ఎంతో అభివృద్ధిచేశామని చెప్పారు. ఆ అభివృద్ధి ఎక్కడా కనబడ్డములేదు అందుచేత ప్రభుత్వము వెంటనే పూనుకుని లేడీడాక్టరును వేయడము, అదనంగా ఒకవార్డును కట్టించడము, పాడయిన మంచాలు బాగుచేయించడము చేయాలనికోరుచున్నాను రాజోలుతాలూకాలో అంతర్వేదిపాలెం, మలికిపల్లి, మామిడికుదురు(?) మానేపల్లి, గన్నవరము గ్రామాలలో local fund డిస్పెన్సరీలు వున్నాయి. వీటికి తగినంత డబ్బు జిల్లాబోర్డులు యివ్వలేకపోవడమువల్ల ఏమీ వుపయోగములేకుండా వున్నాయి. వీటినికూడా ప్రభుత్వము వెంటనే తీసుకొని తగినంతడబ్బు మంజూరు చేయాలి. అదేవిధంగా బూరుగుపూడిలో మాతా శిశు సంరక్షణాలయము ఒకటి పెట్టారు. అక్కడ తరచు మందులులేకుండా ఉంటున్నాయి. కాబట్టి ఇటువంటి centres లోవుంటే మాతా శిశుసంరక్షణాలయంలో కనీసం మందులైన supply చేయడానికి ప్రభుత్వం పూనుకోవాలని కోరుతున్నాను.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—మాతాశిశుసంరక్షణాలయములు పురుళ్లు పోసుకొనేందుకు, పిల్లలకేగాని మామూలు వైద్యానికికాదు.

SRI G. NAGESWARA RAO :—దానికి కావలసిన మందులే లేకుండా వున్నాయి. గోదావరి లంకల విషయం తీసుకొంటే సోదరుడు గొల్లకోట నరసింహమూర్తిగారు మనవిచేసినవిషయం ఇంతకుముందు మేముకూడా అనేకసార్లు చెప్పాము. కొన్నివందల ఎకరాలు గోదావరిలో కలిసిపోయినప్పటికీ ప్రభుత్వం వేలాదిరూపాయలు పన్ను వసూలుచేస్తున్నది. ఆ విధానాన్ని ప్రభుత్వం ఇప్పటికికూడా మార్చుకోలేదు. అంతేగాకుండా వేలంపాటల పద్ధతిమాని లంకలను labour society లకు సరిపోయినన్ని లంకలుయిచ్చి మిగులు ఏమయినావుంటే వాటిని కూడా పేదప్రజలకే యివ్వాలని కోరుతూవచ్చాము. Average rent 3 సం.

26th March 1956] [Sri G. Nageswara Rao

సగటు రేటు యిస్తామంటేనే సొసైటీలకు లంకలు యిస్తామని లేకుంటే పాటకు పెడతామనే పద్ధతి ప్రభుత్వము అవలంబిస్తూ వుంది. దీనివల్ల ఎక్కువ సొసైటీలు యీ పద్ధతికి అంగీకరించడము లేదు. అంగీకరించిన సొసైటీలకు చాల నష్టమువస్తోంది. ప్రతి సంవత్సరము ఆ సొసైటీలు రిమిషను కోరే విషయము ప్రభుత్వానికి తెలుసు అందుచేత లంక భూములను, నామమాత్రపు రేటుకట్టి F. L. C సొసైటీలకే యివ్వాలి.

Average rental పద్ధతిని రద్దుచేసుకొమ్మని 1952 నుండి బడ్జెట్ సమావేశాల్లో మనవిచేశారు. కాని అది రద్దుచేయలేదు. పైగా ఆ rental కు అంగీకరించిన సొసైటీలకే ఇస్తున్నారు. లేకపోతే ఆ లంకభూములను పాటకు పెడుతున్నారు. పాటకుపెట్టితే అందులో భూస్వాముల వొత్తిడికి, Labour societies తట్టుకోలేకపోతున్నాయి భూస్వాములే లంకలు పాడుకొంటున్నారు: అదీకాకుండా, లంకలను పాటపాడుకొన్న ఆసామి ఆ లంకలలో (Commercial crops) పుగాకు మొదలైన వ్యాపారపంటలు పండించుకోవచ్చును. కాని సొసైటీలకు లీజు (Lease) కు ఇచ్చిన లంకలలో Commercial crops పండించుకోకూడదనే నిబంధనఉన్నది. ఇది చాలా అన్యాయము. లీజుకుయిచ్చిన లంకల్లో పుగాకు పండిస్తే మొత్తము amount లో 3 వ వంతు వ్యాపారపన్ను విధిస్తున్నారు. అందుచేత ఈ నిబంధనలను రద్దుచేసి సొసైటీలకుకూడ ఆ అవకాశము ఇవ్వాలని కోరుతున్నాము. అదేవిధంగా deposits కట్టుకొనే విషయంలో, అసలు పాట మొత్తంలో మూడవవంతు deposit, 15 వందలకు దాటకుండా కట్టాలి. అయితే క్రింది ఉద్యోగస్థులకు ఈ విషయంలో discretion ఇవ్వడంవల్ల sub-collector గాని, deputy collector గాని, Labour society e సమస్యవచ్చేసరికి 24 వేల రూపాయలు ఆ lease amount గాని, పార్టు amount గానిఉంటే, వాళ్లను half the amount, deposit కట్టమని అడుగుతున్నారు. Labour society వాళ్లు వెంటనే 2 వేలు కట్టుకోలేకపోవడంవల్ల అంకలను పాటకు పెట్టివేస్తున్నారు. దానిని ఏ భూస్వాములో పాడుకోవడము జరుగుతుంది. అందుచేత క్రింది ఉద్యోగస్తులకు ఈ discretion ఇచ్చే పద్ధతినికూడ రద్దుచేయకపోతే, అసలు 15 వందలకుమించి deposit కట్టనవసరంలేదు అనే Rule అమలు జరుగదు. ఈ లంకల విషయము ప్రభుత్వము ఇదివరకు గుర్తించినట్లులేదు. 1953 ఆగస్టులో వచ్చినటువంటి వరదలవల్ల లంకలన్నీగూడ ఇసుకమేట్లు వేశాయి. అదేవిధంగా గతసంవత్సరం అధికవర్షాలవల్ల పంటలు పాడైపోయాయి. దానివల్ల ఈ సంవత్సరం ఎన్నో remission petitions వచ్చాయి. వాటిలో ప్రభుత్వము

Sri G. Nageswara Rao] [26th March 1956

ఇదివరకు ఎన్ని grant చేసిందో తెలియదుగాని మొత్తంమీద ఈ సంవత్సరం ఎక్కువగా లంకల సొసైటీలకు remissions ఇవ్వవలసియుంటుందని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. ఇక ఆహారసమస్యగురించి ఆలోచిద్దాము. ఈ రోజు మన రాష్ట్రములో ధాన్యంబస్తా 21 రూపాయలు మొదలుకొని 24 రూపాయల వరకు అమ్ముతుంది. గ్రామాలలో, వ్యవసాయకూలీలు, ఇతర వెనుకబడిన తరగతుల మాట అటుంచి, మధ్యతరగతి కుటుంబాలుకూడ బాధపడేరోజులు అప్పుడే సమీపించాయి. వ్యవసాయకూలీలబాధ అసలు చెప్పనవసరంలేదు. ఈ పరిస్థితులలో బ్యాంకులు కొంతమందికి, భూస్వాములకుగాని డబ్బుఉన్నవారికిగాని, అప్పులు ఇస్తున్నాయి. వారికి ఎక్కువ మొత్తము అప్పుఇచ్చి వారిచేత ధాన్యంకొనిపించి loan చేయిస్తున్నారు. వారు ఈ బ్యాంకు అప్పులను అసలీఫాయిదాలతో తీర్చివేసి ఆ కొన్నటువంటి ధాన్యాన్ని వారి ఇష్టమువచ్చిన రేటుకు అమ్ముకొంటున్నారు. అందుచేత, వెంటనే ఆ loan చేసిన ధాన్యాలన్నింటిని స్వాధీనంచేసుకొని చౌకడిపోలు తెరువకపోతే విపరీతమైన కరువును మనము ఎదుర్కోవలసి యుంటుందని, అందుచేత ముందే ప్రభుత్వము మేల్కొవాలని కోరుచున్నాను.

తరువాత, రాజకీయ బాధితులకు బంజర్లుఇచ్చే విషయం మొన్న బడ్జెట్ సమావేశములో ఏదోవిధంగా ప్రభుత్వంవారు తేల్చుతారని అనుకొన్నాను. కాని తేల్చలేదు. ఈ రోజున గ్రామాలలో 10, 12 సంవత్సరములనుంచి సాగుచేసుకొంటున్న బంజరుభూములను రాజకీయబాధితులకు ఇస్తున్నారనే సంగతి అందరికి తెలుసు. కాని, అటువంటి సాగుచేసిన భూములను ఎక్కడా ఇవ్వడంలేదు, కాళీగా ఉన్న భూములను మాత్రమే రాజకీయ బాధితులకు ఇస్తున్నామని మొన్ననే శ్రీ సంజీవరెడ్డిగారు ఒక ప్రశ్న సందర్భములో చాలా కోపంగా మాట్లాడారు. ఆ విధంగా కాళీగా ఉన్నటువంటి వాటిని పేద రాజకీయ బాధితులకు యిస్తే మాకేమి అభ్యంతరంలేదు. కాని ఆక్రమించుకొన్న వాటిని గాని, సాగుచేస్తున్న వాటినిగాని రాజకీయ బాధితులకు ఇస్తున్నటువంటి కేసులు ఉన్నాయి. రాజోలు తాలూకా, అంతరవేది కసప F.L.C సొసైటీ 226 ఎకరాలు సాగుచేస్తూఉంటే, అందులో 158 ఎకరాలు రాజకీయ బాధితులకు ఇవ్వడానికిగాను, వారిని ఆటంకము పెడుతున్నారు. ఆలాగే అమలాపురం తాలూకాలో, నిమ్మకాయల కొత్తపల్లి F.L.C. సొసైటీ చేస్తూన్న 75 ఎకరాలు రాజకీయ బాధితులకు పట్టాలు యిచ్చినట్లు తెలుస్తోంది. ఆలాగే, నరసారం తాలూకాలో లింగింబాగినచెర్లలో toddy tappers 4, 5 సంవత్సరములనుంచి చేస్తున్న ఫారెస్టు బంజరును రాజకీయబాధితులకు ఇవ్వడం కోసం వాళ్లను ఆ భూములనుంచి తోల

గిస్తున్నారు. అదేవిధంగా నూజివీడు తాలూకాలో రేమిల్లి గ్రామంలో 130 ఎకరాలు చేసుకొంటున్న హరిజన కుటుంబాలకు eviction notices జారీ చేస్తున్నారు. ఈ రొంపేరు బంజర్ల విషయముకూడ యింతే. అన్ని పార్టీల నాయకులు రొంపేరు బంజర్ల విషయంలో సమావేశమయ్యారని పత్రికలలో చూశాను. అయితే వారు ఏమి తేల్చారో తెలియదుగాని, అసలు ఈ విషయంలో ఒక నిర్దిష్టమైన విధానాన్ని ప్రభుత్వము అవలంబించకపోతే, తాలూకాలలోను, గ్రామాలలోను మాలాంటి M.L.A. లకు ఇది ఒక burning issue గా (మండే సమస్యగా) ఎదుర్కొంటుంది. గ్రామాలలో వెళ్ళేసరికి ప్రతివారు ఈ విషయం గురించి ప్రశ్నిస్తారు. అందుచేత ఖాళీగా ఉన్న భూములను మాత్రము పేద వారైన రాజకీయ బాధితులకు ఇవ్వవచ్చునని మేము చెప్పుతున్నాము. కాని పేద వాళ్లు సాగుచేసుకొంటున్న భూములనుండి వారిని తొలగించి రాజకీయ బాధితులకు ఇవ్వడమనే policy వెంటనే ప్రభుత్వము విరమించుకోవాలి అది విరమించుకోక పోతే అనేక క్లిష్ట సమస్యలను ప్రభుతము ఎదుర్కోవలసి వుంటుంది పేదవారికి, కష్ట పడేటటువంటి వ్యవసాయ కూలీ వర్గానికి అన్యాయం చేయడమే అవుతుంది. అందు చేత ప్రభుత్వంవారు ఇప్పుడైనా ఈ విషయాన్ని ముఖ్యంగా గుర్తించి వ్యవసాయ కూలీలకు రక్షణ కల్గిస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఇప్పుడు 8 కోట్ల రూపా యలకు Supplementary demands తీసుకువచ్చినందుకు ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. ప్రభుత్వము ప్రజల అవసరాలగురించి ప్రత్యేక శ్రద్ధవహించి ఎంత మొత్తాన్నైనా తీసుకువచ్చి ఖర్చుపెట్టినందుకుకూడ వారిని అభినందిస్తున్నాను. కాని ఒక్క విషయములో మాత్రము ప్రభుత్వాన్ని హెచ్చరిక చేయక తప్పదు. ప్రభుత్వము ఈధనాన్ని supplementary demands రూపములో తీసుకువచ్చినా, మరే రూపములో తీసుకువచ్చినా, ఎక్కడ నిజంగా అవసరమున్నదో అక్కడ ఖర్చు పెట్టడం మంచిదనే విషయం గమనించాలి. కాని ఆవిధంగా గమనించకుండా, ఇప్పుడు వ్యవహారం జరుగుతున్నదని ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను. మా శ్రీకా కుళం జిల్లా విషయం తీసుకోండి. ఆ జిల్లాలో కరువు రోడ్లు 7, 8 సంవత్సరాల క్రింద ప్రభుత్వము వేసింది. కరువు రోడ్లు వేసిన తరువాత, వానిని అభివృద్ధి చేసుకోవలసిన బాధ్యత ప్రభుత్వము మీద ఉన్నది. అందులోను, అవి చాలా అవసరమైన రోడ్లు. అక్కడ ఉద్దానంలోను, పాలకొండలోను 8 సంవత్సరముల క్రిందట రోడ్లు వేశారు. దానికి కావలసిన సామానులన్నీ తీసుకువచ్చారు. కాని ఆ పని మాత్రము ఎందుకు ఆలస్యం చేస్తున్నారో నాకు అర్థంకావడంలేదు. ఈ విషయంలో

Sri L. Lakshmana Das] [26th March 1956

ముఖ్యమంత్రిగారు ప్రత్యేక శ్రద్ధ వహించాలని కోరుతున్నాను. ఆ రోడ్డును 8 సంవత్సరముల క్రిందట ఎన్నో లక్షలు ఖర్చు పెట్టివేశారు. అది ఈ రోజున పాడైపోతున్నది. అది చాలా అవసరమైన రోడ్డు అని ప్రజలు చెప్పుచున్నప్పటికి, దానిపైన 1,2 లక్షలు రూపాయలు ఖర్చుపెట్టి అభివృద్ధి చేయకుండా ఈ విధంగా ఎందుకు అశ్రద్ధ వహిస్తున్నారో, ఆ Department యొక్క ఉద్దేశమేమిటో నాకు అర్థంకావడంలేదు. అదేవిధంగా కోళ్ళ అనే గ్రామానికి ఒక రోడ్డు వేశారు. దానికి 40 వేల రూపాయలు ఖర్చు పెట్టారు. దానికి కావలసిన తూములు వగైరా సామానులు తీసుకువచ్చారు. కాని ఇంకొక 15 వందల రూపాయలు ఖర్చుపెట్టి దాన్ని బాగుచేయకుండా, రెండు సంవత్సరములనుంచి దానిపట్ల ఆశ్రద్ధ వహిస్తుండడంవల్ల ఈ రోజు ఆ రోడ్డును బాగుచేసేందుకు, 5, 6 వేల రూపాయలు ఖర్చుపెట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ additional expenditure భరించవలసింది ఎవరు ? ఎందుకు ఇటువంటి అశ్రద్ధ డిపార్టుమెంటులో జరుగుతున్నది అనే విషయాలు ప్రభుత్వము గమనించకుండా ఉంటే ప్రభుత్వము ఎంతధనము తీసుకువచ్చి అభివృద్ధిచేస్తున్నా, ప్రజలలో నిరుత్సాహం కలగడానికి అవకాశాలుంటాయి. అదేవిధంగా పాత పట్నంతాలూకాలో జమీందారు తయారుచేసిన 50 మైళ్లురోడ్డు ఉన్నది. ఆ 50 మైళ్లకు, కనీసం ఒకలక్షా, రెండులక్షలు ఖర్చుపెట్టితే, అవి first class రోడ్లుగా తయారు అవుతాయి. ఆ రోడ్లను స్వాధీనంచేసుకొని అభివృద్ధిచేయండిఅంటే, ఆ విషయంలో అశ్రద్ధ చూపిస్తున్నారు. కాని మరొకచోట తారురోడ్లు, సిమెంటు రోడ్లు తయారవుతున్నాయి. అనేకచోట్ల, కనీసం బండ్లు పోవడానికిగాని, నడవడానికిగాని అవకాశము కలిగించేందుకు ఆ ఉన్నరోడ్లను బాగుచేయండిఅంటే అశ్రద్ధ చేస్తున్నారు. కనుక దాన్నిగురించి ప్రత్యేకమైన శ్రద్ధవహించాలని మంత్రిగారిని హృదయపూర్వకంగా కోరుతున్నాను ఇటువంటి విషయాలలో ప్రభుత్వము ప్రత్యేకశ్రద్ధ తీసుకోకపోతే, ప్రజలలో నిరుత్సాహం కలుగకమానదు. ఎందుకంటె ఆ బెల్లమరారోడ్డుకు రాతిసామాను వగైరా తయారుగాఉన్నాయి. దాన్ని కొన్నివేలు ఖర్చుపెట్టి అభివృద్ధిచేయకుండా 7,8 సంవత్సరములనుండి అట్లే వదలి వేయడంవల్ల, ఇప్పుడు దాన్ని బాగుచేయాలంటే, చాలాడబ్బు అవుతుంది. అందుచేత ఇప్పటికైన అటువంటి విషయాలలో అశ్రద్ధచేయకుండా, నేను చెప్పినరోడ్లే కాకుంటే, ఇంకా ఎక్కడెక్కడ అటువంటివి ఉన్నాయో వాటన్నటిని బాగు చేయడానికి, ఇప్పుడు supplementary demands లో తీసుకువచ్చిన 6 కోట్లే కాదు ఇంకొక 8 కోట్లు తీసుకువచ్చినా ఈ సభతప్పకుండా ఆమోదిస్తుందని తెలుపుతూ, అటువంటివాటిని గురించి ప్రభుత్వము శ్రద్ధవహించవలెనని కోరుతున్నాను.

26th March 1956] [Sri L. Lakshmana Das

తరువాత medical విషయములో ప్రభుత్వము కొంతచేస్తున్నదిగాని అది చాలదని చెప్పుతున్నాను. పల్లెలకు సంబంధించినంతవరకు ఈ medical సౌకర్యాలు చాలా తక్కువగా ఉన్నాయి రెండు లక్షల జనాభాగలిగిన మా పాత పట్నం తాలూకా మొత్తానికి ఒక Hospital కూడలేదు అని మేము ఈవేళ చెప్పుకొంటున్నాముఅంటే చాలా విచారపడుతున్నాము. ఇందాకా ఈ విషయము గురించి ప్రభుత్వానికి అనేకసార్లు తెలియజేశాము. అంతేకాదు, చిన్నచిన్న dispensaries విషయంగురించి చాలాసార్లు మంత్రిగారు సమాధానంచెప్పుతూ డాక్టర్లు రావడంలేదని అన్నారు. ఈనాడు డాక్టర్లకు చదువు చెప్పించడంలో ప్రభుత్వము ఎంతోధనము వెచ్చిస్తున్నది. గ్రామాలలో వారికిఇచ్చే జీతాలు చాలా తక్కువని పట్టణాలలోనే private practice పెట్టుకొంటే ఏ 4,5 వందలో వస్తుందని డాక్టర్లు గ్రామాలకు రావడం మానివేశారు. అయితే, వాళ్లకు ఒక నిబంధనపెట్టితే, ఈ సమస్య పరిష్కరించవచ్చుననుకొంటాను. వారు చదువుకొన్న తరువాత, పల్లెటూళ్లలో కనీసం మూడు సంవత్సరాలైనా పనిచేస్తేతప్ప మీకు డిగ్రీలు ఇవ్వముఅని ప్రభుత్వము ఆదేశించవచ్చునని చెప్పుచున్నాను.

ప్రభుత్వం లక్షలకొలది మెడికల్ కాలేజీలమీద ఖర్చు పెట్టుతున్నప్పుడు, యిక్కడ ప్యాసు అయ్యేవారందరికీ పల్లెలలోగూడ పనిచేయాలనే నిర్బంధ విధానము విధించడములో తప్పేమి కాదని నేను భావిస్తున్నాను. దీనికి కారణం డాక్టరు పరీక్ష ప్యాసు అయినవారు పల్లెలలో ఉపయోగపడకుండా పోతున్నారనే. అందరూకూడ పట్టణములలోనే ఉండాలని అంటే, యిక పల్లెలోని వారి సంగతి ఏమిటి ? ఈ మధ్య నేను మరల కురుపాం ఏజన్సీలో పర్యటనకు వెళ్లాను. అక్కడ కొండ జాతులలో యాస్ అనే జబ్బు ఒకటి ప్రబలంగా ఉన్నది. ఆ జబ్బుకు pencillin injection యిస్తే, చాలా భాగము తగ్గిపోతుంది. ఈ injection యివ్వటానికి డాక్టర్లు లేక వాళ్లు నానా బాధలు పడుతున్నారు. అక్కడ డాక్టర్లను పంపి యీ జబ్బు నివారించేటట్లు చేయమని ప్రభుత్వానికి ఇదివరకుఎన్నోసార్లు చెప్పడమైంది. ఈ జబ్బు విపరీతముగా ఉన్నప్పుడు మాత్రము డాక్టర్లు వెళ్ళి యిస్తున్నారు గాని, అక్కడనే నిలకడగా ఉండే ఏర్పాట్లు లేవు. నేలకొలది కొండ జాతులవారు దూరప్రాంతములనుంచి వచ్చి యింజక్షను యివ్వండి అని కోరితే, సమయానికి డాక్టరు ఉండడు. కనీసము ఒక mobile van అయినా ఆ ప్రాంతాలలో ఏర్పాటు చేస్తే, అక్కడ యీ జబ్బు లేకుండా పోతుంది. కొండ ప్రాంతాలు చాలా వెనుకబడి ఉన్నవి. చేరువలో ఎక్కడ చూచినా dispensaries లేవు. Dispensaries పెట్టించలేక పోయినను mobile van అయినను ఏర్పాటు

చేయాలని కోరుతున్నాను. ఇటువంటి కనీస సదుపాయములైనను చేస్తే, అక్కడ కూడ ప్రజలు దారుఢ్యముగా ఉండగలరు. ప్రభుత్వము యీ విషయములో శ్రద్ధ వహిస్తారని ఆసిస్తున్నాను.

తరువాత విద్యవిషయములో గోపాలరెడ్డిగారు ఉచితముగా విద్య నేర్చుకోటానికివచ్చే జూలై నెలనుంచి III form వరకు ఏర్పాటుచేశామని చెబుతున్నారు. ఇందుకు ముఖ్య మంత్రిగారిని అభినందిస్తున్నాను. ఇది చాలా ఉత్తమమైన విధానము. ముఖ్య మంత్రిగారి చేతులలో విద్యాశాఖకూడ ఉన్నందులవల్ల, రాష్ట్రములో అనేక హైస్కూల్సుకూడ ఏర్పాటుచేశారు. అక్కడక్కడ యింకా ఎన్నో స్థాపించవలసిన అవసరము ఉన్నది. డబ్బు యివ్వటానికి ధనవంతులు, దాతలు ముందుకువస్తున్నారు. అయితే యిదివరకు వాగ్దానములు చేసినచోట్లలో, ఆవాగ్దానములు చెల్లించకపోతే, ఏర్పాటు అయినస్కూల్సు ఎత్తివేస్తామని ముఖ్య మంత్రిగారు చెబుతున్నారు. కొద్దోగొప్పో డబ్బుయిచ్చి, మిగతా వాగ్దానములు చెల్లించక పోవడములో కొన్ని కారణముల చేత ఆలస్యము అవుతున్నమాట నిజమే ఒకసారి ఏ విధమైన వాగ్దానముచేసినను, అది చెల్లించుకునే ప్రయత్నములోనే ఉంటున్నారుగాని, పొత్తుగా ఎగగొట్టాలనే ఉద్దేశ్యములోలేరు. గత సంవత్సరము ముఖ్య మంత్రిగారు, ఎవరైనా వాగ్దానమునములుచేసి, అవిచెల్లించని చోట్లలో ప్రభుత్వము ఏర్పాటుచేసిన స్కూల్సును ఎత్తివేస్తామని హెచ్చరికచేశారు. వాగ్దానములు చేసిన వారందరు నాకు తెలిసినంతవరకు, స్కూలుకు కమిటీ మెంబర్లుగా ఉండి, వాగ్దానములు చెల్లించాలనే ఉద్దేశ్యముతోనే ప్రయత్నము చేస్తున్నారు చాలా వరకు పనులుగూడ సాగుతున్నవి. ఎక్కడైనా డబ్బు దొరకకనో, సరియైన స్థలము దొరకకనో, మరే యితర కారణముల చేతనో వాగ్దానములను చెల్లించుకోవడములో కొంత ఆలస్యము అయితే కావచ్చు. లేదని నేను చెప్పను. కాని వారికి యింకా కొంత కాలవ్యవధిని యిస్తే వారు ఆ వాగ్దానములను చెల్లించుకోటానికి అవకాశము యిస్తే, ఆవాగ్దానములను చెల్లించగలరు. నిన్ననో మొన్ననో మార్చి 31-వ తేది చేసిన వాగ్దానములను చెల్లించకపోతే, స్కూలు ఎత్తి వేస్తామని నోటీసులు గూడ ప్రభుత్వము పంపించింది. కాని వారు యింతవరకుచేసిన progress ను బట్టి అయినా కాలవ్యవధి యివ్వాలని కోరుతున్నాను. కనీసము మరొక సంవత్సరము అయినను వారికి వాయిదా యిస్తే, వారు యింతవరకు చేసిన కృషి అంతావృధా అయిపోకుండా, వారు చేసిన వాగ్దానములను పూర్తిగా చెల్లించటానికి అవకాశము ఉంటుంది. నేను ఏ స్కూలు విషయము మాట్లాడుతున్నానో, ముఖ్య మంత్రిగారికి

తెలుసును. వారు అయిదు ఎకరములస్థలం యిస్తామని వాగ్దానము చేసిన మాట నిజమే. కాని యింతవరకు మూడు ఎకరములు యిచ్చారు. ఇంకా రెండు ఎకరములు యివ్వవలసియున్నది. ఈ రెండు ఎకరముల భూమి, యిప్పుడు యిచ్చిన భూమికి ప్రక్కనే లేక పోవడమువల్లనో, మరే యితర కారణములచేతనోగాని, యింకా రెండు ఎకరముల భూమి యివ్వలేకపోయినారు. కాని వారు యివ్వాలనే ప్రయత్నములోనే ఉన్నారు. ఈ స్వల్ప కారణముచేత అసలు స్కూలునే ఎత్తివేస్తామని చెప్పడము సబబుగా లేదు.

THE HON. DR. B. GOPALA REDDI :—వారు వాగ్దానములు చేసి యిప్పటికి ఆరు, ఏడు సంవత్సరాలు అయింది. ఈ ఆరు, ఏడు సంవత్సరాలుగా వారు యిదివరకు చేసిన వాగ్దానములను తీర్చలేకపోతే యింకా ఎప్పుడు తీర్చగలరు ? కాబట్టి ప్రభుత్వము యీ విషయములో కొంతవరకు కఠినముగానే ఉండదలచుకున్నది.

SRI L. LAKSHMANA DAS :—ప్రభుత్వము యీ విషయములో కఠినముగా ఉండవలసిందే. వద్దు, అని నేను చెప్పడములేదు. కఠినత్వము ప్రభుత్వము వహించకపోతే, పనులు కావు అనే సంగతికూడ నాకు తెలుసును. కాని ప్రజల డబ్బు తీసుకొనివచ్చి, ఇప్పటికి కొంతవరకు progress చేశారు, ఇంకా కొంత వ్యవధిని యివ్వక ఇప్పుడు స్కూలును ఎత్తివేస్తే, యిప్పటివరకు ఆ స్కూలుకొరకు వారు చేసిన కృషి అంతా వృధా అయిపోతుంది. పైగా ఆ ప్రాంతములో స్కూలు కూడ లేకుండా పోతుంది. మరల విద్యార్థులుకూడ దూర ప్రాంతాలకు వెళ్లి చదువుకోవలసిన పరిస్థితి ఏర్పడుతోంది. దీనివల్ల చాలా యిబ్బందులు కలుగుతాయి. చేసిన వాగ్దానములు చెల్లించకుండా, వారు ఎక్కడికో పారిపోతారని ప్రభుత్వము భావించ నక్కరలేదని మనవి చేస్తున్నాను. ఇంతవరకు వారు చేసిన progress యేమిటో మరొకసారి ముఖ్య మంత్రిగారికి విన్నవిస్తున్నాను. వారు అక్కడ స్కూలుకుగాను buildings కట్టారు. ఇంతవరకు అయిదు గదులు కట్టవలసిన చోట నాలుగు గదులు కట్టించారు. ఇప్పటికి మూడు ఎకరముల భూమి యిచ్చారు. ఇంకా రెండు ఎకరముల కోసము వారు చాలా కృషి చేస్తున్నారు. వాగ్దానాలను చెల్లించుకొనేవారికి యివ్వవద్దు, చెల్లించకుండా మూల కూర్చునేవారికి యివ్వాలని అని నేను చెప్పను. చేసిన వాగ్దానము చెల్లించవలెననే ప్రయత్నములోనే వారు ఉంటున్నారు. కాబట్టి, వారికి కనీసము యింకొక సంవత్సరమువరకు వాయిదా యివ్వమని కోరుతున్నాను. వారు చేసే ప్రయత్నమువలన కొంత వ్యవధి కోరినంతే వాస్తవముగా అవకాశమిస్తే వారు ఎక్కువ ఉత్సాహపూరితముగా ప్రయత్నిస్తున్నారు. తప్పకుండా చెల్లిస్తారుకూడా.

THE HON. DR. B. GOPALA REDDI :—ఇలాంటివారికి ఒక మాసముకంటె గడువు యివ్వటానికి వీలులేదు. ఇంకా ఒక మాసము గడువు యిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS .—ఒక మాసము గడువు చాలదు. ఒక మాసములో పనులు పూర్తిచేయటానికి వ్యవధిచాలదు. ఈ విషయము ముఖ్య మంత్రి గారికి తెలియక పోలేదు. ఒక సంవత్సరము ఆయినను గడువు యివ్వమని కోరు తున్నాను. ఈ నాడు Local Development works విషయములో మేము మా జిల్లాలలో ప్రయాణముచేస్తూ, కొన్ని చోట్లలో చూచాను ప్రజలు రాత్రి, పగలు అనకుండా యీ మార్చి 31 వ తేదిలోగా పూర్తిచేయటానికి పన్నుల విషయములో 15 రోజులు ఆ యేరియాలలో తిరిగినప్పుడు నేను స్వయముగా చూచాను. వారు అక్కడ రాత్రులయందు Petromax lights పెట్టుకుని స్కూలుయొక్క condition సరిగా లేకపోతే ఎత్తివేస్తారేమోనని ఉత్సాహపూరితముగా, పనులు పూర్తి చేస్తున్నారు. III Form వరకు ఉచితముగా చదువుకోవచ్చని అక్కడ ప్రజలు ఎంతో ఆనందిస్తున్నారు. భాగ్యవంతులు, పేదవాళ్లు అనే విచక్షణలేకుండా, అందరి పిల్లలకుగూడ III-Form వరకు చదుకునే సౌకర్యము ఏర్పడిందని చాలా మంది సంతోషిస్తున్నారు. కాబట్టి ఈ స్కూలు విషయములో ఒక నెల అనే సిద్ధాంతము కాకుండా ఒక సంవత్సరము అయినా కాల వ్యవధి నివ్వమని ముఖ్య మంత్రి గారికి మనవి చేస్తున్నాను. వారు చేయవలసిన వాగ్దానములు పూర్తిగా చెల్లిస్తారని నేను వారి తరపున హామీ యిస్తున్నాను. ఇకమీదట కాల వ్యవధిని పొడిగించమని కోరము అని చెబుతున్నాను. కాబట్టి ముఖ్య మంత్రిగారు కొంతవరకు కాఠిన్యము తగ్గించి, వాళ్లయందు ఉదార స్వభావము చూపించి ఒక సంవత్సరమువరకు అయినా వాయిదా యివ్వాలని కోరుతున్నాను. ఈ నాడు ప్రవేశపెట్టిన Supplementary Demands ను నేను బలపరుస్తూ, యింతటితో విరమిస్తున్నాను.

SRI E. NAGAYYA :— అధ్యక్షా, Supplementary Demads ను నేను బలపరుస్తూ, నేను కొన్ని సూచనలను చేయదలచుకొన్నాను. మావిశాఖ పట్టణము జిల్లాలో పరమడ నియోజక వర్గములో సుమారు 45 చెరువులున్నవి. ప్రజలకు ముఖ్యముగా కావలసినది తిండి. గనుక, ఆ తిండికోసము పంటలు పండించుకునే అవకాశము ప్రభుత్వము గలుగజేయాలని కోరుతున్నాను. పంటలు సమృద్ధిగా పండినప్పుడే, ప్రజలు సుంతుష్టిగా జీవించగలరు. ఈ చెరువులకు నీటి పారుదల సౌకర్యాలు బొత్తిగాలేవు. ఈ మధ్య మన డిప్యూటీ ముఖ్యమంత్రిగారితో కూడ యీ చెరువుల విషయము మనవిచేయగా, వారు మా నియోజకవర్గపు ప్రజలయందు

కొంత దయతలచి పది, పన్నెండు చెరువులు మాత్రము మరమ్మతుచేయించే ఏర్పాటు చేశారు. పనులుగూడ సాగుతున్నవి. కాని యీ మాత్రము సౌకర్యము ప్రభుత్వము కలుగజేసినంతమాత్రాన, మాకు, మా ప్రజలకు కడుపునిండా ఆహారము లభిస్తుందని మేము అను కోవడములేదు. కొన్ని ప్రాంతాలలో పనులు జరిగి, మరికొన్ని ప్రాంతాలలో చేయకపోవడము సబబుకాదు. క్రిందటి సారి బడ్జెటు సమావేశములో గూడ నేను యీ విషయమును గురించి ప్రభుత్వమును కోరియున్నాను ఇంతవరకు ఆ పనులు అన్నిచోట్లలోను జరిపించలేదు. మరల యీ సమావేశములో ఆ విషయ మును గురించి విన్నవించవలసి వచ్చింది. గత సంవత్సరము ఏ పరిస్థితులు ఉన్నవని నేను విన్నవించానో, యిప్పుడుగూడ అదేపరిస్థితులు ఉంటున్నవని అంటున్నాను. కాబట్టి మరొకసారి ప్రభుత్వానికి విన్నవిస్తూ ఈ చెరువులు అన్నీ బాగుచేయించ వలసిందిగా కోరుతున్నాను.

ఇక minor irrigation పనుల, విషయములో మా జిల్లాలో విజయనగరము ఎస్టేటులో ఒక engineering శాఖపని చేస్తున్నది. పూర్వము విజయనగరం ఎస్టే టులో సంతర్పణలు అనేవి జరిపేవారు. ఇప్పుడు ఆ సంతర్పణల పేరుతో యీ యింజనీరింగు శాఖ పనిచేస్తున్నది. ఈ మార్చి 31-వ తేదీలోగా పనులు పూర్తి కావలసినవి కాలేదని, ఏవో కొన్ని చెరువులు బాగాఉన్నవి, బాగాలేనివి, అన్నీకలిపి ఏవో కొన్నిపనులు పూర్తిచేశాము అని చెప్పకోటానికి వీలుగా, కొన్ని అనవసరమైన వాటికిగూడ estimates వేసిఉన్న డబ్బు అంతేయు ఖర్చుచేస్తున్నారు. ముఖ్యముగా అవసరమైనచోట్లలో యీ మరమ్మతులు వగైరాలు చేయించవలెనే గాని, ప్రభుత్వము యొక్క డబ్బు ఏదో విధముగా ఖర్చు చేయాలని చేస్తున్నారు. అంతేకాని వాస్త ముగా అవసరము ఉన్నచోట్లలో యీ మరమ్మతులుచేయడమే లేదు. ఇటువంటి విధముగా ప్రభుత్వము సొమ్ము అన్యాయముగా దుర్వినియోగము చేయకుండా చూడాలని మనవిచేస్తున్నాను.

తరువాత జిల్లాబోర్డుల పరిపాలన చూస్తే, ఒక విషయము మనవిచేయదలచు కొన్నాను. మన లోకల్ బోర్డ్సు మంత్రిగారికి అన్ని విషయములు తెలిసియే యున్నవి. ఎక్కడైనా ఒక చోట ఒక స్కూలు కావాల్సి ఉన్నది, అది ఏర్పాటుచేయండి, మేము contribution యిస్తాము, buildings కట్టిస్తాము, అని చెప్పినప్పటికినీ, ఆ స్కూలు open చేయటానికి శ్రద్ధ వహించకుండా ఉన్నారు. జిల్లాబోర్డు special officer, ఏదైనా ఒక తప్పుధోరణిలోపడి, యీ స్కూలుని

Sri E. Nagayya] [26th March 1956

ఏర్పాటుకాకుండా నోటుపెట్టి ప్రభుత్వానికి పంపితే మంత్రిగారు వారి సలహానే పాటిస్తున్నారు. వాస్తవపరిస్థితులను గుర్తించకుండా ఉత్తరువులు వేస్తున్నారు. ఈ విషయములో మంత్రిగారు తమయొక్క స్వంతబుద్ధిని ఉపయోగించుచున్నట్లు కన్పించడములేదు వారికి అవసరమని తోస్తే, ఆ ప్రదేశానికివెళ్లి విచారించవచ్చు. ఆప్రాంతములో పిల్లలచదువుకు యిబ్బందిగా ఉన్నందువల్లనే అక్కడ స్కూలు open చేయవలసిందిగా కోరుతున్నారుగాని, వృధాగా కోరడములేదు. ముఖ్యంగా పరవాడ ప్రాంతంలోనూ, సిరిపిల్లి ప్రాంతంలో ఆరువేల, ఏడువేల జనాభాగల గ్రామాలు ఉన్నవి. ఇప్పటివరకు మారుప్రదేశాలకువెళ్లి చదువుకుంటున్నారు పిల్లలకు చాలా యిబ్బందిగా వున్నది. ప్రతి 500 లు జనాభాగల గ్రామంలోనూ, ఒక elementary school పెట్టినట్లయితే పిల్లలకు ఉపయోగముగా ఉంటుంది దానికి కావలసిన contributions కూడ యిస్తామని అంటున్నారు. అటువంటప్పుడు ఆగ్రామాలలో స్కూలుపెట్టించటానికి ప్రభుత్వానికి అభ్యంతరము ఏమి ఉంటుంది ?

THE HON. DR. B. GOPALA REDDI:—అయిదువందలు జనాభాగల ప్రతి గ్రామములోనూ single teacher school కొత్తగా ఏర్పాటు చేస్తున్నాము. ఇప్పుడు మా నెల్లూరుజిల్లాలోమాత్రము 30 స్కూల్సు యింకా ఏర్పాటుకాలేదు. అక్కడతప్ప అయిదువందలు జనాభావున్న ప్రతి గ్రామములో స్కూల్సుపెట్టారు. ఆ విధముగా ఎక్కడైనా ఏర్పాటుకాలేదు అని ప్రభుత్వము యొక్కదృష్టికితెస్తే, దానిసంగతి విచారించి, అక్కడకూడ పాఠశాల ఏర్పాటు అయ్యేటట్లు చూస్తాము.

SRI E. NAGAYYA:—అయిదువందలజనాభాగల గ్రామాలు మావిశాఖ పట్టణములో ఎన్నోవున్నవి. ఆవిషయము నేను ప్రభుత్వానికికూడ వ్రాశాను.మా ఆనకాపల్లి మునిసిపల్ ఏరియాకు ప్రక్కనే కొత్తఊరు అనేగ్రామం వున్నది. ఆ గ్రామంలో 600 జనాభావున్నది. ఆ గ్రామంలోని దాతలు buildings కూడ కట్టిస్తామని అంటున్నారు. ఈ విషయము జిల్లాబోర్డుయొక్క Special Officer కు తెలియచేయగా, ఆ గ్రామములో యింకా ప్రభుత్వం నడిపే schools ఉన్నవి. అందువల్లవారు ఎలాంటి చర్యతీసుకున్నట్లులేదు. ఈ స్కూలుకాకుండా యింకా ప్రైవేటు వ్యక్తులుకూడ యిది ఒక వ్యాపారముక్రిందకొన్ని స్కూళ్లు ఆగ్రామంలో నడుపుతున్నారు. ఆ స్కూళ్లు అన్నీ చెడిపోతాయని, ప్రైవేటు వ్యక్తుల influence కు లోబడి, యీ special officer యిందులో శ్రద్ధతీసుకోవడములేదు. ఈ స్కూళ్లుకు

రెండుమైళ్లు, మూడుమైళ్లదూరములో ఉన్న స్కూళ్లకు యింకా recognition కూడ యివ్వలేదని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

Prohibition department వారు సారావండడానికీ, అమ్ముకోడానికీ permission ఇచ్చి పదిరూపాయిలో, 20 రూపాయిలో లంచం పుచ్చుకుంటున్నారని అనుకునేవారు. ఇప్పుడు police వారిచేతికి prohibition అమలుపరపడం ఒప్పగించి ఎన్నోరోజులు కాలేదు. కొన్నికొన్ని ఊళ్ళలో పూర్వం prohibition వారు 20 రూపాయిలు పుచ్చుకుంటే police వారు ఇప్పుడు 1,000, 1,500 రూపాయిలు contract ఇచ్చి వ్యాపారంగా సాగిస్తున్నారు. పోలీసువారంటే అందరూ corrupt గా వున్నారని నేను మనవి చేయడంలేదు. మాడుగోలు ఎస్టేటులో agency produce కి contract రెండు సంవత్సరాలకు కలిపి 150 వేల రూపాయిలకు ఇస్తూ ఉండేవారు. ఈవిషయం ఇంతకుముందుకూడా Chief Minister గారికి మనవిచేసి వున్నాను. ఇప్పుడు ఈ season లో 3 నెలలకు 15 వేలకే contract ఇచ్చారని ప్రజలు ఆందోళన చేస్తున్నారు. అది Chief Minister గారి notice లోకి వచ్చినట్లయితే నాకు తెలియజేస్తారని కోరుతున్నాను.

SRI G. SURYANARAYANA :—అధ్యక్షా, మనరాష్ట్రంలో ఆహారధాన్యాల ఉత్పత్తి అధికంకావాలంటే పెద్దపెద్ద project లు గాక ఈ చిన్నచిన్న minor irrigation schemeలు అమలుజరవాలి. పెద్ద projectలు ఏ 30, 40 సంవత్సరాలకోగాని పూర్తిగా ఉపయోగానికి రావు. ఈ చిన్న scheme లు తక్కువ ఖర్చుతో వెంటనే ఫలితం ఇస్తాయి. ఎక్కువ ఆహారధాన్యాల ఉత్పత్తికికూడా చాలా అవకాశాలుంటాయి. విజయనగరంతాలూకాలో లోవజగన్నాథపురం దగ్గర ఒక dam కడితే కొద్దిధనంతో అది నిర్మాణమవుతుంది. దానివల్ల 25 వేల ఎకరాలు సాగులోకి వస్తాయి లింగాల వలసగడ్డవగ్గర చెల్లాన మెట్ట ఉన్నది. ఆమెట్టదగ్గర ఒక reservoir కడితే దాని చుట్టుప్రక్కల ఉన్న 30,40 గ్రామాలకు నీరు సప్లయి అవుతుంది. ఈ చిన్న స్కీములు తక్కువ ధనంతో పూర్తి అవుతాయి. ఎక్కువ ఆహారపదార్థములు ప్రజలకు అందుబాటులోకి వస్తాయి. అందువల్ల ఈ scheme లు నిర్మాణం చెయ్యాలని విజ్ఞప్తి చేస్తున్నాను మనరాష్ట్రంలో వైద్యసౌకర్యాలు చాలా తక్కువ. ఈనాడు పట్టణాలలోనే hospitals ఉన్నవి. పల్లెప్రాంతాలవారు పట్టణానికి రావాలంటే ఒక్కొక్కప్పుడు 20 మైళ్లు 30 మైళ్ళు రావలసియుంటుంది. వ్యాధిగ్రస్తులు చికిత్సకు రావాలంటే చాలా కష్టం. ప్రతిగ్రామంలోనూ ఆసుపత్రి నిర్మించాలంటే చాలా కష్టం కాబట్టి 3,4 గ్రామాలకైనా ఒక ఆసుపత్రి నిర్మించి అక్కడ వైద్యసౌకర్యం కల్పించాలని విజ్ఞప్తిచేస్తున్నాను. గ్రామాధికార్లకు

గవర్నమెంటు గ్రామాలలో 20 రూపాయిలవరకూ జీతం ఇస్తున్నారు. ఎస్టేటు గ్రామాలలో 16,17 రూపాయిలు మాత్రమే ఇస్తున్నారు. ఈ గ్రామాధికారులు సక్రమంగా పని చేయాలంటే వారికి కుటుంబపోషణకు సరిపడ జీతాలు ఇవ్వాలి గ్రామ తలార్లు పల్లెటూరునుంచి విజయనగరంలాంటి పట్టణాలకు ఏదైనా రిపోర్టు తీసుకురావాలంటే bus charge ఇవ్వాలి. కోనాడనుంచి భీమునిపట్టణం నెలకు 4 సార్లు తిరిగాడంటే 8 రూపాయిలు bus charge క్రింద అయిపోతుంది. నడవడానికి చాలా దూరం. వారికి సంవత్సరానికి రెండు జతలు దుస్తులైనా సప్లయి చేయడం న్యాయం. వారి కుటుంబపోషణకు సరిపడ వారిజీతాలు ఎక్కువచేస్తారని రెవిన్యూమంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను.

SRI K. SANTHAPPA :—అధ్యక్షా, ఈ demand బలపరుస్తూ కొన్ని సంగతులు ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను మా తాలూకా కల్యాణదుర్గం చాలా బీద తాలూకా మాకు జీవనదులు లేవు. మైనూరు estate ని ఆనుకుని వేదావతి నది పారుతున్నది. మా తాలూకాలో 40, 50 చెరువులున్నాయి. వేదావతి నదికి పరశురాంపురం పైభాగమున ఒక ఆనకట్ట నిర్మించినట్లయితే ఆ చెరువులు నిండి కంబదూరు, కుందిరిఫిర్కాలలో ఉండే చెరువులు పారి ఆహారకొరత తీరిపోతుంది. తుంగభద్రా high level కాలువనీళ్లు వస్తాయని ప్రజలనుకుంటున్నారు. ప్రభుత్వం వారు engineer లను పంపి level పరీక్షచేసి, మాకువచ్చే అనుకూలం ఉంటే దాన్ని ఏర్పాటుచెయ్యాలని కోరుతున్నాను. కల్యాణదుర్గానికి మాగ్రామం 18 మైళ్ళదూరం. ఖాయిలా మనుషులు, గర్భిణీస్త్రీలు ఆసుపత్రికి పోవాలంటే చాలా కష్టం. మా కంబదూరుగ్రామంలో 3 వేల జనాభా ఉన్నా అక్కడ high school లేదు. నేను సర్కారు నాకిచ్చిన 2 ఎకరాలభూమి ఇస్తానని చెప్పాను. ప్రభుత్వంవారు high school కట్టించాలనీ అక్కడ ఆసుపత్రులు improve చెయ్యాలని ప్రార్థిస్తున్నాను.

SRI Y. CHANNIAH :—అధ్యక్షా, మన ముఖ్యమంత్రిగారు ప్రవేశ పెట్టిన supplementary demand ను నేను బలపరుస్తున్నాను. Forests గురించి కొన్ని సూచనలు ప్రభుత్వదృష్టికి తీసుకురాదలుచుకున్నాను. గుంటూరుజిల్లాకు కృష్ణాజిల్లాకు ఒకే forest office ఉన్నది. క్రిందట నిర్ణయించారు జమీందారీ అడవులు, ఎస్టేట్ల అడవులు ప్రభుత్వంవారు తీసుకున్నారు. Forest officer రెండు జిల్లాల్లో tour చేయడంవల్ల మా జిల్లాలో అనేకసార్లు కలుసుకుందాం అనుకున్నా దొరకడంలేదు. రెండుసంవత్సరాల క్రితం ఇచ్చిన కాగితాలకు కూడా ఇంతవరకు సమాధానం రావడంలేదు. అందువల్ల నేను ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చేది ఏమిటంటే

ప్రత్యేకంగా గుంటూరుజిల్లాకు ఒక forest office ను, కృష్ణాజిల్లాకు వేరే forest office ఏర్పాటుచేయాలి. ముఖ్య మంత్రిగారు దీనిని వెంటనే చూస్తారని ఆశిస్తున్నాను.

SRI M. SATYANARAYANA RAJU :—అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ demand ను నేను బలపరుస్తున్నాను. శ్రీకాకుళం జిల్లాలో చీపురుపల్లి తాలూకా చాలా వెనుకబడిన ప్రాంతం. ఆ తాలూకాలో రోడ్ల సౌకర్యం కాని మంచి నీటి సదుపాయం కాని చాలా తక్కువగాఉన్నది. ఒకే ఒక Trunk Road తప్ప మరి ఏ ఇతర రోడ్లు లేవు కాబట్టి ఈ తాలూకాలో ఎక్కువ రోడ్లు గురించి అవకాశం కలుగజేస్తారని ఆశిస్తున్నాను. నారాయణపురం ఆనకట్ట ఒకటి ఈ ప్రాంతంలో కడుతున్నారు ఇది low level లోనుంచి పోతోంది. పాతగా ఉన్న channel లో నుంచి పోతుంది. కాని క్రొత్తగా కడుతున్న ప్రయోజనం ఏమీ మా తాలూకాకు కనిపించడం లేదు. ఎక్కువ ఎత్తుగా చేస్తే ఎక్కువ irrigation కావడానికి అవకాశం ఉన్నది. చిన్నచిన్న గడ్డలున్నవి. వీటికి irrigation ఆనకట్టలు కట్టడానికి తక్కువ మొత్తం చాలు ; ఎక్కువ ఆయకట్టు రావడానికి అవకాశం ఉన్నది. ఇటువంటి అవకాశాలు కల్పించాలని అధ్యక్షుల ద్వారా తెలియచేస్తున్నాను. శ్రీకాకుళాన్ని ఆనుకుని ఉన్న చీపురుపల్లి తాలూకాను block development చేయాలని కొంతమంది M. L. As. సంతకాలుచేసి పంపించినా షేక్ మహమ్మద్ పురం-కుప్పిలి ఫిర్కాలు కలిసి ఉన్నప్పటికి, పాలకొండ తాలూకాను block development area చేశారు. వచ్చే సంవత్సరమైనా చీపురుపల్లి తాలూకాను block development area గా తీసుకుంటారని ఆశిస్తున్నాను. Village Officers గురించి చాలామంది సభ్యులు ఇదివరకే మాట్లాడిఉన్నారు. మాది జమీందారీ area. అక్కడ ఉండే Village Officersకు గవర్నమెంటు గ్రామాలలో ఇస్తున్నట్లుగా జీతాలు ఇవ్వడంలేదు. Officers ఎక్కువ అయినారు. అనేకమంది గ్రామాధికారులను headquaters కు తెప్పిస్తుంటారు. వారికి సరిఅయిన భత్యాలుకూడా ఇవ్వకుండా పంపిస్తున్నారు. వారికి పదహారో పద్దెనిమిదో రూపాయల జీతాలు ఇస్తున్నారు. వారికికూడా గవర్నమెంటు area లో ఇస్తున్నట్లు జీతాలు ఇప్పించాలని కోరుతున్నాను. Rural Water Supply గురించి ఎక్కువ నూతులు తీసిఉన్నారు. అవి సగం పని అయి ఉండిపోయాయి. పూర్తి చేయండి. అని అడిగితే ఆ స్కీము ఎత్తివేశాము, Health వారిని అడగండి అంటున్నారు. ఈ సగం పని అయిన నూతులు పూర్తి అయ్యేట్లు చూడాలని కోరుతూ విరమిస్తున్నాను.

SRI D. V RAMANA REDDI :—అధ్యక్షా, ముఖ్య మంత్రిగారు తీసుకువచ్చిన supplementary budget ను నేను బలపరుస్తున్నాను. వారి దృష్టికి కొన్ని విషయాలు మాత్రం తీసుకు వస్తున్నాను. ప్రభుత్వ ఉద్యోగాలలో ఉండే నిర్లక్ష్యం, జాప్యం ఎన్నాళ్లనుంచో పోగొట్టాలని అనేక దఫాలుగా members చెప్పినా వారి పద్ధతి తాబేలు నడక మాదిరిగానే ఉన్నది కాని చక్కపడే మార్గం కనిపించడం లేదు. దీనిని తగ్గించాలంటే మరింత జాస్తి అవుతోంది; మరింత ఆలస్యానికి కారణం అవుతోంది. ప్రజాభిప్రాయాల గురించి ప్రజల కష్టాలను గురించి జాగ్రత్తగా ఆలోచించాలని వారికి ఏ మాత్రం మనస్సులో ఉన్నట్లు లేదు. అవినీతి ఎక్కువగా పెరిగిపోతోంది. ఉదాహరణకు ఒక చిన్న విషయం మనవి చేస్తాను. మాది వెనుకబడిన దర్శి తాలూకా. Food Production Department వారు 1951 వ సంవత్సరంలో తెగిపోయిన ఒక చెరువు restore చేయడానికి 24 వేలరూపాయలకు ఒక estimate వేసారు. దానిని Revenue board వారి approval కు పంపారు. Food Production Department వారు 1952 వ సంవత్సరంలో దీనిని పూర్తిచేసి రెవెన్యూ బోర్డుకు పంపిన తరువాత, 1956 వరకు దీని మంచిచెడ్డలు ఎవరూ కనుక్కోలేదు ప్రజలే కాకుండా M. L. As మొదలయిన వారు చేసిన correspondence కు జవాబుదారీ కలిగిన Revenue Board నుంచి జవాబైనా రావడంలేదంటే ఏమని చెప్పాలో తెలియడంలేదు. గంగనపాలెంఅని ఊరుఉన్నది. 24 వేల రూపాయిలకు Estimate చేసారు. గవర్నమెంటుకు నష్టం కలిగేట్లా ఉన్నది కాబట్టి అందులోసగం ప్రజలు భరించాలన్నారు. 1/6 కట్టుకుంటాముఅని ప్రజలు చెప్పారు. దానికి వారు agree అయినారు. Undertaking కూడా ఇచ్చారు. అంతటితో తృప్తిపడడానికి వీలులేదు; రు. 3 లు తరంఉంటే దానిని రు 7 లు చేయడానికి ఒప్పుకుంటే చెరువువేస్తాము అన్నారు. చెరువు వేయడంలో ఒక ఎకరం మునిగిపోతుంది కాబట్టి రు 1,100లు ఇచ్చుకుంటాము అన్నారు. ఇన్ని ఒప్పుకున్న contribution యిచ్చే పనులకు, approval ఇవ్వడమేతప్ప ఎలాంటిపని లేనివికూడా 5 సంవత్సరాలనుంచి బయటకురాలేదంటే ఏమనిచెప్పాలో అర్థం కావడంలేదు. ఈ మధ్య Revenue Board కు వెళ్ళి చెప్పినతరువాత నెల్లూరు Superintending Engineer కు కాగితాలు పంపుతున్నాం అని చెప్పారు. Superintending Engineer గారిని కలుసుకుంటే estimates, plan పోగొట్టారని చెప్పారు. మళ్ళి approach చేస్తే తిరిగి estimates, plan తయారు కావాలని చెప్పారు. ఇంత అన్యాయం జరుగుతుంటే ఏమి అనుకోవాలో అర్థం

కావడంలేదు. ప్రభుత్వంవారు జోక్యం కలిగించుకుని జాప్యం, ఇబ్బందులు లేకుండా చేస్తారని మనవి చేస్తున్నాను. అవసరమయిన విషయాలకు డబ్బుకావాలంటే డబ్బు లేదనిచెప్పడం పరిపాటిఅయినది. అనవసరమయిన schemes మీద వృథాగా ఖర్చు చేస్తున్నారు. వయోజనవిద్యక్రిందచూస్తే practical గా ఏపనీ జరగడంలేదని ఇక్కడఉండే 200 మంది సభ్యులకు తెలుసు.

THE HON. DR. B. GOPALA REDDI :—1956 జూలైనుంచి దీనిని రద్దు చేస్తున్నాం.

SRI D. V. RAMANA REDDI :—అందుకు నా అభినందనాలు. చేవ్రాలుచేసేవారిని అక్కడ కూర్చోబెట్టి deputy inspector దయతో అక్కడ ఉంటే day school లో పనిచేసే టీచరుగారే night school లోగూడా టీచరు దానికి రు. 60 లు దీనికి రు. 20 లు తీసుకుంటూ అయ్యా, మాకు జీతం చాలదు ; ఇంకా జీతం కావాలిఅంటున్నారు. ఒక్కనికి అక్షరం చెప్పడంఉండదు. Paper, lighting charges కూడా వయోజన పాఠశాలకు తీసుకుంటారు. అది ఆయన ఇంటికికూడా సరిపోతుంది ఇప్పుడైనా ఎత్తివేస్తున్నామని చెప్పినందుకు అభినందనాలు కరువుకాలములో వేసిన రోడ్లున్నాయి. వీటికి metal చేర్చినారు. Incomplete గాఉన్న రోడ్లను పూర్తిచేయించి తరువాత క్రొత్తరోడ్లు వేయాలని మనవిచేస్తున్నాను.

SRI M. MATCHARAJU :—అధ్యక్షా ! ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జటును బలపరుస్తూ కొన్ని విషయాలు మీ దృష్టికి తీసుకొని రావడం నా ఉద్దేశముగాఉన్నది. విశాఖపట్నంజిల్లా గూడెం ఏజన్సీ మెట్టప్రాంతం. రైతులు చాలా తక్కువగా వ్యవసాయము చేస్తుంటారు. సుమారు ఆరుమాసాల గ్రాసం వస్తుంది. చోడి, సామ పండుతుంది. దానిలో రిజర్వు అన్ రిజర్వు అనిఉంది. జమీందారుగారు ఉన్నప్పుడు పోడుగఉండేది. రిజర్వు అన్ రిజర్వు అనేదిలేదు. ఈనాడు పోడుకు రు. 100/- రు. 75/- పన్నువేస్తున్నారు. ఇది చాలా అన్యాయముగా ఉన్నది. పండించేపంట రు. 10/- 25/- 30/- మాత్రమే, పశువులను అమ్ముకొన్నాకూడా వారి బువ్వలకు చాలడములేదు, నీటి వనరులకు సిమెంటుకట్టు ప్రభుత్వము వేస్తారని ఆశించుచున్నాను 1800 చదరపుమైళ్లు విశాలం, 1675 గ్రామాలుఉన్నవి. అక్కడ వైద్యసౌకర్యములులేవు. 4 డిస్పెన్సరీలు ఉన్నవి. కనీసము 100 గ్రామాలకు ఒక ఆసుపత్రిఅయినాలేదు. అట్లా ఉంటే

మలేరియా నివారణ అవుతుంది. అని నేను మనవిచేస్తున్నాను. విద్య విషయములో కూడా చాలా వెనుకబడిఉన్నది. 15, 20 గవర్నమెంటు స్కూల్సు మాత్రము ఉన్నవి, గాని టీచర్లకు ఇళ్లులేవు. ఆ సదుపాయములు కల్పించవలెను. వారికి మలేరియా వస్తున్నది. కాబట్టి ఇళ్లు ఇవ్వవలెను వారికి వచ్చే ఇంక్రిమెంట్లు త్వరగా ఇప్పించవలెనని నేను ముఖ్యమంత్రిగారికి ఒక memorandum దాఖలు చేసినాను. 8, 9 సంవత్సరాలనుంచి ఇంక్రిమెంట్లు రావడములేదు. చాలా విచారకరమైన విషయము.

మురాదారీ system ఇంకా ఉన్నది. అది రద్దుచేసి విలేజి ఆఫీసర్లనువేస్తే బాగా ఉంటుంది. Proposal ఉండేది. ఇంకా ఏమీ చెయ్యలేదు. ఈ సనదులు cancel చేసి వారికి V.M. లకు ఇచ్చే జీతాలు ఇస్తేనేగాని వచ్చేపోయే ఆఫీసర్లకు చాలా బాధలకు గురిఅవుతున్నారు. అందరము గవర్నమెంటు శిస్తులు తింటున్నాము అంటున్నారు. త్వరలో agency ప్రాంతాలను బాగుపరచవలయును అని మనవి చేస్తున్నాను. రోడ్డు విషయములో 1934 లో త్రిగడ్డనుంచి పాశేరువరకు గంగరాజు మాడుగులమీదుగా రోడ్డు వెయ్యాలని P.W.D. వారు అన్నారు. ఈనాటి వరకు ఏమి పని అయినదో తెలియదు. నిరుడు బడ్జటులో చెప్పాను. శ్రీ వారికి తెలియు పరచుకొన్నాను అతీగతీలేదు. ఏజన్సీ ప్రజలను దయార్ద్ర హృదయముతో కనిపెట్ట వలెనని నేను చెపుతూ విరమించుకొంటున్నాను.

[At this stage Temporary Chairman Sri A. Kaleswara Rao occupied the Chair.]

* SRI K. VENKATA REDDI :—అధ్యక్షా, మన మంత్రి గారు ప్రవేశపెట్టిన సప్లిమెంటరీ బడ్జటును బలపరుస్తున్నాను. ఉదయగిరి తాలూకాలో 40, 50 సంవత్సరాలనుండి, ఒక మైలు రోడ్డయినా వెయ్య లేదు. ప్రజలకు ఇబ్బందిగా ఉన్నది. ముఖ్యమైన రోడ్లు వెంటనే పూర్తి చెయ్య వలెనని కోరుచున్నాను, మా ఉదయగిరి తాలూకా మెట్ట ప్రాంతము, అందువల్ల మాకు నందికొండ ప్రాజక్టువచ్చే అవకాశములేదు. కనుక చిన్న చిన్న చెరువులను వెంటనే పూర్తి చెయ్యవలయును అని కోరుచున్నాను. శంకవరం చెరువు 1952 లో గోపాలరెడ్డిగారు శంకుస్థాపన చేసేరు. పదివేలు ఖర్చుచేసేరు కాని ఆ పని నిలిపి వేసినారు. దీనిని వెంటనే పూర్తి చెయ్యవలయును. చెరువుల estimates పూర్తి చేసి పని వెంటనే చెయ్యవలయును.

మా ఉదయగిరి తాలూకాలో వింజమూరు L. F. Dispensary ఉన్నది. [illegible] మందులు ఉండవు డాక్టరుగారు ఊరికే కూర్చుంటారు.

మాటలతో కుదురుస్తున్నారు రోగాలు. అందుచేత ఆ ఆసుపత్రిని ప్రభుత్వము స్వాధీనము చేసుకోవాలని "ప్రాస్తే ఎక్కువమంది రోగులు లేరు అందువలన ప్రభుత్వము తీసుకొనుటకు వీలులేద"ని సమాధానము యిచ్చారు. కనుక ఆ ఆసుపత్రిని వెంటనే ప్రభుత్వం తీసుకోవలెను అని మనవిచేస్తున్నాను.

ఫారెస్టు ఉద్యోగస్థులు విపరీతముగా లంచాలు తీసుకొంటున్నారు. మేకకు రు. 0-4-0 లంచం తీసుకొంటున్నారు అని రిపోర్టు వచ్చింది. అది ఓబులరెడ్డిగారికి పంపించినాము. విచారించవలెనని మనవిచేస్తున్నాను.

SRI U. RANGA BABU :—అధ్యక్షా, తాలూకా ఆసుపత్రులను Government Hospitals గా convert చేస్తామని గవర్నమెంటు పాలిసీలో అన్నారు. మా శ్రీకాకుళంజిల్లాలో కొన్నింటిని అలా convert చేసినారు. ఇచ్ఛాపురం తాలూకా ఆసుపత్రిపై ఒరిస్సావారుకూడా ఆధారపడవలసివస్తున్నది. దీనిని ఇంతవరకు గవర్నమెంటు ఆసుపత్రిగా convert చెయ్యకపోవడము విచారకరముగా ఉన్నది. ఆ హాస్పిటలులో పరిస్థితులు చాలా కష్టముగా ఉన్నవి. డాక్టరు ఉండడము లేదు. మందులు లేవు. చదువుకొన్న డాక్టర్లు లేరు, ఉంటే చూపించండి అంటున్నారు. భోరుకమిటీవారు డాక్టర్లకు మూడుసంవత్సరముల కోర్సు చాలును అన్నారు. రాజగోపాలాచారిగారుకూడా చాలును అన్నారు, గాని మనము అట్లాంటి సూచనలకు నిరాదరణచూపిస్తున్నాము. Course ను lighten చేస్తే ఎక్కువమంది డాక్టర్లను తయారుచేసుకొనవచ్చును.

కేవలము అలోపతీమీద ఎక్కువగా ఆధారపడుతున్నాము. అది ప్రాముఖ్యానికి రావడానికి కారణం clinical side కాక surgical side వల్లనే ఈ పెన్సిలును, స్ట్రెప్టోమైసిను, వచ్చినతరువాత clinical side లో ఎక్కువగా ప్రాధాన్యం పొందుతున్నారు ఈ డాక్టర్లు.

పూర్వం మనగ్రామసీమలలో ఆయుర్వేదవైద్యం యూనానీ వైద్యం యిత్యాదులుండేవి. అయితే కొత్తగా 25 ఏళ్ళనుంచి తలెత్తినది హోమియోపతివైద్యం. దానినికూడా నిరాదరణచేయడం మంచిదికాదని నా విశ్వాసం. ఎందుకంటే అనుభవంలో అది ఆశ్చర్యఫలితాలనిస్తుంది. రోగి coma state లో నున్నప్పుడు అలోపతిక్ డాక్టర్లదగ్గరకు వెళ్ళితే ఏమీ చేయలేనని నిరుత్సాహం కలపర్చారు. కాని tincture arsenicum తో ఆ రోగికి ½ గంటలోనే ప్రాణరక్షణవచ్చినది. Homeopathy efficacy పట్ల ఎవరికీ సందేహం అక్కరలేదు. ఇది శాస్త్రసమ్మతమైనది. Germany లో యిది అమలులోఉన్నది. పోతే భారతదేశములోనే

Sri U. Rangababu] [26th March 1956

U. P., Bombay రాష్ట్రములలో కూడా దానికి recognition ఉన్నది. అయితే మన ప్రభుత్వంమట్టుకు గుడివాడలోని హోమియోపతిక్ కాలేజీకి కొద్దిగా subsidy యిస్తున్నదే కాని కేవలం ధైర్యసాహసాలతో ఇది ఒక శాస్త్రసమ్మతమైన పద్ధతి అని ఒప్పుకుని, Government వారు Training course open చేసి హోమియోపతికి డాక్టర్లను హెచ్చు గ్రామసీమలలో వేస్తే మనకు డాక్టర్ల కొరత పోతుంది. అలాగున చేసినట్లయితే గ్రామసీమలలో కూడా యీ వైద్యం ప్రజలకు అందుబాటులో ఉండడానికి అవకాశం కల్పించినవాళ్లమవుతామని నేను మనవి చేస్తున్నాను.

ఇచ్ఛాపురంతాలూకాలోని రోడ్లవిషయమై మిత్రుడు లుకలాపు లక్ష్మణదాసు గారు ప్రస్తావించారు. ఇప్పటికి 10 ఏండ్లముందు famine roads క్రింద వీటిని వేశారు. Famine road లు వేసిన తరువాత మేము ఎన్నిసార్లు petitions పెట్టినా యీరోడ్ల పరిస్థితి అధ్వాన్నంగా ఉన్న సంగతి ఉద్యోగులకు తెలుసును, మంత్రులకు తెలుసును ఇంకా యిది Government కు రాలేదు. Government తలపెట్టడానికి అవకాశంలేదు అంటారు. ఇదివరలో ఉద్యోగస్థులకు మనవి చేస్తే post-war development క్రింద చేయవచ్చునన్నారు. Postwar development కూడా అంతం అయినది. ఇప్పుడు ప్రభుత్వమే దీనిని తలపెట్టాలి. కాబట్టి సత్వరము ఏదో ఒక విధంగా దానికి famine division ఏర్పాటుచేసి ఆ roads త్వరలో బాగుచేయాలి. అంతేకాదు ఉద్దానం అనేది ప్రత్యేకమైనటువంటిది. రోడ్లను Grand Trunk Road కు connect చేయడాన్ని కేవలం జిల్లా బోర్డుకు అప్పచెప్పడం కంటె Highways క్రింద convert చేస్తేనే అది చాలా అనుకూలంగా వుంటుంది. Roads మరమ్మత్తు, bridges నిర్మాణము అవసరం. అది చేయాలంటే వాటిని State Highways క్రింద convert చేసిననాడే అది జరుగుతుంది. Funds లేనటువంటి District Boards రోడ్లు, వంతెనల విషయాన్ని ఎక్కువ ఆదరణతో చూడలేదని మనవిచేస్తున్నాను. నేను ఈ రోజున మాట్లాడడానికి ప్రధాన కారణమొకటి ఉంది. దానిని ఇప్పుడు మనవి చేస్తాను. మనం యితర జిల్లాల మాదిరిగానే శ్రీకాకుళం జిల్లాలో కూడా Prohibition Department ను Police Department కు అప్పచెప్పాం ఏ ఉద్దేశంతో? Police కు prohibition అప్పచెబితే హెచ్చు efficiency తో crime ను detect చేస్తారని prohibition చాలా successful అవుతుందనే ఉద్దేశంతో చేశాము, నిజమే. దానికి సాధారణంగా కొన్ని ఉదాహరణలు చెప్పవచ్చు. ఇచ్ఛాపురమునకు సంబంధించినంతవరకు Police కు hand over చేసిన తరువాత యిదివరకు Prohibition Department ఉన్నప్పుడు crime

detection report లో చూపబడిన కేసుల సంఖ్య కంటె యిప్పటి కేసుల సంఖ్య 10 రెట్లు హెచ్చిందని తెలుస్తున్నది. అయితే యీవిధంగా అక్కడ ఉన్నటువంటి Police Staff prohibition crime detect చేసి track down చేస్తుంటే దానికి పెద్ద ఉద్యోగస్థుల సహకారం పోలీసు ఉద్యోగస్థులకు లేనందువల్ల వారిమీద ఏ చిన్న petitions వెళ్లినా ఆ పోలీసు ఉద్యోగులపై enquiry తెచ్చిపెట్టడం anonymous petition అయినాకూడా దానికై దర్యాప్తు చేస్తుంటే police కి ఉన్నటువంటి ధైర్యము సాహసము తప్పిపోయి ఏమి బ్రతుకిది పాత సంగతే బాగుంది. మామూళ్లు ఎదో విధంగా చూసుకుంటే బాగుంటుంద నే నైతిక పతన హేతువైన దృక్పథం ఏర్పడుతుంది. ఈ Prohibition ను Police కు అందజేసిన తరువాత క్రొత్తగా police చేయవలసిన పని ఎంతో ఉన్నది. ఇచ్ఛాపురంలో Sub-Inspector ను prohibition force బాగా tackle చేయవలసినదిగా హెచ్చరిక చేసి ఉన్నాం. దాని పర్యవసానంగా హెచ్చు cases track చేస్తే ఆయనను transfer చేశారు. Prohibition ను police కు అప్పచెప్పిన తరువాత కొంత కూస్తా efficiency హెచ్చయినది. కాని police department లో కూడా నీతి చాలా కొరతపడివున్నదని యిదివరలో మనవిచేశాను. ఇప్పుడుకూడా పునరుద్ఘాటన చేస్తున్నాను. అందుచేత పెద్ద ఉద్యోగస్థులు చిన్న police ఉద్యోగస్థులను ఉత్సాహపరచాలి. లేకపోతే police వారుకూడా పాత prohibition అలవాట్లకు లోనై అధ్వాన్న పరిస్థితిలోకి వెళ్ళగలరని మనవిచేస్తున్నాను. Police Department కు సంబంధించినంతవరకు యిదివరకు నేను సూచనలు చేసి ఉన్నాను. ఇంకొక సూచన చేస్తున్నాను. Prohibition కూడా policeకు అప్పచెప్పిన తరువాత Sub-Inspector కు execution పని హెచ్చుగా ఉంటుంది. Local records, monthly reports, C.Ds. వ్రాయడం ఇదంతా ఒక్కడే చేయడం చాలా కష్టమైనసమస్య. చిన్న తాలూకా station లను ఇంకా చిన్నవిచేశారు. ఎంతచిన్నవి చేసినప్పటికీ prohibition యిప్పుడు police కు అప్పచెప్పిన తరువాత police Sub-Inspector work రెట్టింపు అవుతుంది. కాబట్టి ఇప్పట్లో constable rank వానికి writer పని అప్పచెబుతున్నట్లుగా కాకుండా Orissa ప్రభుత్వంలో ఉన్నట్లుగా Public Service Commission పరీక్ష పాసయిన గుమాస్తాను యీ poilce station కు తెచ్చిపెడితే ఆయన యీ వ్యవహారం సరిగా చూసుకుంటాడు. Police constable writer గా ఉంటే ఉన్న అనర్థం ఏమిటంటే, మామూళ్ళకు అలవాటుపడిన స్వభావంతో report లో చాలా పొరపాట్లువ్రాసి information leak out చేయడానికి

Sri U. Rangababu] [26th March 1956

సిద్ధపడతాడు. కాబట్టి Public Service Commission పరీక్ష పాసయిన గుమాస్తాను వేయాలని మనవిచేస్తున్నాను. తరువాత యిచ్చాపురం police Sub-Inspector ను ఎందుకు transfer చేశారు ? దీని విషయం public enquiry పెట్టిస్తేనేగాని రభస బయటపడదు. ప్రజాశాసన మన department లో ఏ విధంగా జరుగవలసినదీ Local incidents పర్యవసానంగా ఆలోచించడానికి అవకాశం ఉంటుంది కాబట్టి దానిని ప్రభుత్వం తలపెడతారని ఆశిస్తూ ముగిస్తున్నాను.

Sri P. RAMACHARLU :—అధ్యక్షా, ఇదివరకు prohibition విషయం చాలమంది మిత్రులు చెప్పినారు. ఇప్పుడు prohibition ను సంజీవ రెడ్డిగారి police department కు transfer చేశారు. అయితే prohibition మంత్రిగా నాగేశ్వరరావుగారే ఉన్నారు. Police సిబ్బందిఅంతా సంజీవ రెడ్డిగారి మంత్రిత్వంలో వారి అధికారంక్రిందఉన్నది. తరువాత prohibition department నాగేశ్వరరావుగారిక్రింద ఉండడం అంత భావ్యంగాలేదు. కాబట్టి దీనిని transfer చేస్తే కొంచెం బాగా పని జరుగుతుందేమోనని నేను విశ్వసిస్తున్నాను. ఇంక అడవుల విషయంలో చాలా కట్టుదిట్టాలు చేసినట్టుగా బయట జిల్లాలనుంచి వార్తలు తెలుస్తున్నవి. ఎవరూకూడా వంటచెఱుకులు అమ్మడానికి వీలులేకుండా చేసినారు అనికూడా మా ఊరినుంచి వార్తలు వచ్చినాయి. ఏదయినా Government ఏర్పాటుచేస్తేనేగాని లేకపోతే వంటచెఱుకు లేకుండా సంసారులంతా జీవించడంకష్టం. ఈ చట్టాలన్నీ పెట్టి ఎవరైనా కట్టెలు తెచ్చినటువంటి వారందరిని తీసుకువచ్చి prosecute చేయడం ఊర్లో కట్టెలు లేకపోవడం అల జడిగా ఉన్నదని ఒక్క అనంతపురంజిల్లాలోనే కాకుండా ప్రతిజిల్లాలోనూ అనుకున్నారు. నాకుకూడా నిన్న మొన్న జాబులువచ్చాయి. ఈ విషయంలో Forest Department శ్రద్ధవహించవలసియున్నది. క్రొత్త మంత్రిగారు వచ్చినారు, యీ విషయాలు వారికి తెలుసునోలేదో తెలియదు. ఏ G. O. వలన యీ బాధకలుగుతుందో వానిని కొంచెం శ్రద్ధంలేక సర్ది క్రొత్తగా ఏర్పాటుచేస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. ఆసుపత్రులలో ఔషధాలులేవని యిదివరకు చాలమంది చెప్పారు. క్రొత్త ఆసుపత్రులు ఏర్పాటుచేసే దానికంటె పాత ఆసుపత్రులలో కావలసినటువంటి సౌకర్యాలు, ఔషధాలయినా ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఇక్కడ 5, 6 మంది ధర్మవరంనుంచి deputation వచ్చారు. ఆసుపత్రులలో మందులులేవని చెబుతున్నారు. యిటువంటి సందర్భంలో క్రొత్త ఆసుపత్రులకంటె

పాతఆసుపత్రులకు కావలసినటువంటి ఔషధాలయినా supply చేస్తే బాగుంటుంది. ఆయుర్వేదానికి ప్రోత్సాహం యివ్వడానికి దానిని ప్రచారంలోనికి తేవడానికి ఆయుర్వేద పరీక్షలుపెట్టి త్వరగా recognition చేసి డాక్టర్లను ఎక్కువ పెంచాలని నేను మనవి చేసుకుంటున్నాను.

విద్యా విషయములో చాలా అక్రమాలు జరుగుతున్నవి. ఉపాధ్యాయులుగా పనిచేసేవారికి అనుభవం ఏమాత్రంలేకుండా ఉన్నదని మనవిచేస్తున్నాను. ట్రయినింగు కోసం విద్యార్థులను సెలక్టు చేసేటప్పుడే వారి సాంప్రదాయాన్ని బట్టి, వారి యోగ్యతనుబట్టి, సెలక్టు చేయవలసిఉన్నది. మార్కులు వచ్చినాయనగానే వారిని చేర్చుకొనకూడదు. కాలక్రమము ప్రకారం కాకుండా జాగ్రత్తగా వారి అర్హతలనుబట్టి సెలక్టు చేస్తారని, పాఠశాలల్లో అర్హులైన ఉపాధ్యాయులను ఏర్పాటు చేస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

* SRI N. K. LINGAM :—అధ్యక్షా, ఈ డిమాండును నేను బలపరుస్తూ కొన్ని అంశములను ప్రభుత్వ దృష్టికి తీసుకు రాదలచుకున్నాను. నందికొట్కూరు తాలూకాలో వరదరాజుల ప్రాజెక్టుకొఱకు 10 సంవత్సరములనుంచి ప్రభుత్వమునకు మహాజర్లు పంపుకుంటున్నాము. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో దానికి ఎస్టిమేట్సు అయినా యని విన్నాము. కాని ఇంతవరకు ఆ విషయము ఏమైనదో తెలియు లేదు. దానిని త్వరగా చేస్తారని ఆశిస్తున్నాను.

ప్రభుత్వమునకు ఎక్కువ ఆదాయము పల్లెల నుండి వస్తున్నది, కాని ఆ పల్లెలలో నివసించే వారికి సౌకర్యములు ఏ మాత్రము అభివృద్ధి కావడములేదు. నందికొట్కూరు తాలూకాకు సంబంధించినంతవరకు కర్నూలు నుంచి గుంటూరు రోడ్డు ఒక్కటి మాత్రమే తలపెట్టినారు. ఇంకేదీ తలపెట్టలేదు. అందువల్ల మంత్రిగారు ఆ విషయం గురించి ఆలోచించాలని కోరుతున్నాను.

మా గ్రామాలలో మందులు లేని ఆస్పత్రులు చాలా ఉన్నాయి. రోగులు వస్తే మందులులేవని చెప్పి పంపుతున్నారు. ఆస్పత్రుల staff కు సంవత్సరమునకు 12 వేలు రూపాయలు ఖర్చు పెట్టుతున్నారు. ఆ ఆస్పత్రులకు 420 రూపాయలు మాత్రమే మందుకు ఖర్చు పెడుతున్నారు. అటువంటప్పుడు మందులు లేని ఆస్పత్రులను వెంటనే రద్దుచేస్తే యేటా 12 వేల రూపాయలు లాభము ఉంటుంది అని మనవిచేస్తున్నాను

విద్య పల్లెటూళ్లలో నివారికి ఏమాత్రం అందుబాటులో లేదు. హైస్కూలు విద్య గాని, ప్రాథమిక విద్యగాని, సక్రమమైనటువంటి పద్ధతిలో వారికి లభించడములేదు.

రైతులకు కో ఆపరేటివు డిపార్టుమెంటుద్వారా, అగ్రికల్చరలు డిపార్టుమెంటు ద్వారా అప్పులు ఇస్తున్నారు. రివెన్యూ డిపార్టుమెంటువారు, Harijan Welfare Department వారుకూడా అప్పులు ఇస్తున్నారు. వాళ్లకు ఉండేది ఒకటే ఆస్తి. దానిని ఆ నలుగురికికూడా తాకట్టుపెట్టి మీరు ఏమైనా చేసుకోడానికి పరిస్థితులు జరుగుతున్నాయి. అందువల్ల వెంటనే ప్రభుత్వమువారు దానిని దర్యాప్తు చేయించి, ఒక డిపార్టుమెంటుద్వారానే వారికి అప్పులు ఇచ్చేందుకు ప్రయత్నం చేయాలని కోరుతున్నాను.

Block Development Schemesను community project areasలో ఏర్పాటుచేశారు వీటిని అనుభవము లేనటువంటి ఉద్యోగస్థులకు అప్పగించారు. రోడ్లు వేయుట, పాఠశాలలు పెట్టుట, వయోజన విద్య మొదలగునవన్నీ ఒకే ఆఫీసరుయొక్క అధికారంలో పెట్టారు. వారికి వాటిలో నిపుణత తెలియనందువల్ల మొదటి పంచవర్ష ప్రణాళికలో ఆ పనులు సక్రమంగా జరుగలేదు. సక్రమంగా ప్రజానీకానికి బోధింపబడలేదు. అందువల్ల రోడ్లవిషయము వచ్చేటప్పటికి ఇంజనీరింగు డిపార్టుమెంటు, విద్యవిషయంలో విద్యాడిపార్టుమెంటు, ఆస్పత్రులు మొదలగునవి ఆయాశాఖలకు అప్పగిస్తే సక్రమంగా ఇకముందు రెండవ పంచవర్ష ప్రణాళికలో సక్రమంగా పనులు జరుగుతాయని మనవిచేస్తున్నాను

హరిజనుల ఇండ్ల స్థలాలసమస్యకు, కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వం అనేక లక్షలురూపాయలు ఖర్చుపెడుతున్నా ఆసమస్య తీరకుండా ఉన్నది. 2 లక్షల రూపాయలు మనప్రభుత్వం కేటాయించింది. అది సంగ్రామాలకుకూడా చాలదు. అందువల్ల ప్రధానమంత్రిగారు, ఈ విషయంలో తగినశ్రద్ధ తీసుకొని, ఏవిధంగా అయినా కేంద్రప్రభుత్వము వద్దనుంచి ఒకకోటీరూపాయలు సంపాదించి, ప్రతివాళ్లకు ఇండ్లవసతి ఏర్పాటుచేయాలని కోరుతున్నాను. ఎన్నికలలో ప్రజలకు మనం ఎన్నో వాగ్దానాలు చేశాము అందువల్ల కనీసం త్రాగడానికి మంచినీళ్లవసతి అయినా కల్గజేయాలని మనవిచేస్తున్నాను

ప్రభుత్వం సాంఘిక సంక్షేమశాఖ అనే ప్రత్యేకశాఖను ఏర్పాటుచేసినది. నాలుగైదు జాతులను అందులో కలిపారు. దానివల్ల ఏమీప్రయోజనంలేకుండాఉన్నది. ఆ జీతాలకు ఇదివరకు సేవచేసినటువంటి experts ను తీసుకువచ్చి, ఆశాఖలో ఉద్యోగులుగావేస్తే అంటరానితనము నిర్మూలన అనేది బాగా జరుగుతుందని మనవి చేస్తున్నాను. రవీంద్రనాథఠాకూరు పాఠశాలలో విద్యాభ్యాసం గరిపిన ముఖ్యమంత్రిగారు ఈవిషయంలో తగినశ్రద్ధ తీసుకోవాలని మనవిచేస్తున్నాను.

దేవాలయాలప్రవేశములు అంటున్నారు మంత్రులు, కలెక్టర్లు వచ్చినప్పుడే వారితో దేవాలయప్రవేశములు జరగడానికి వీలుంటుందిగాని, ఇతర సమయములలో వారికి అటువంటి అవకాశములు దొరకడములేదు. వారిని సాంఘికంగాను, ఆర్థికంగాను, వైజ్ఞానికంగాను అభివృద్ధిలోకి తీసుకువస్తేనే అంటరానితనం అనేది నిర్మూలము అవుతుందని మనవిచేస్తు ఇంతటితో విరమిస్తున్నాను.

[At this stage Mr. Speaker resumed the Chair.]

SRI K. VENKATARATNAM :—అధ్యక్షా, ఈనాడు ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన supplementary demand ను నేను బలపరుస్తున్నాను ఈ demand లో బుడమేరు diversion canal, అనే విషయములను చేర్చినారు. Irrigation demand మీద ఈ విషయమునుగురించి నేను మాట్లాడినాను. ఆనాడు బుడమేటి వరదనివారణకు సమగ్రమైన పథకంఉన్నది. ఆ పథకమును అమలు జరుపకుండా diversion canal అనే ఒక దానినే అమలుజరిపితే, దానివల్ల ముంపునివారణ జరుగదు. దీనిని సక్రమమైన పద్ధతిలో అమలు జరపాలనియు మొట్టమొదట pass చేసినటువంటి బుడమేరు వరదనివారణపథకంలో ఉన్నటువంటి 3 భాగాలుకూడా అమలు జరుపవలెనని ఆనాడు ఉపప్రధాన మంత్రిగారు ప్రవేశపెట్టిన demand మీదమాట్లాడుతూ చెప్పినాను. ఆనాడు సంజీవరెడ్డిగారు చెప్పినటువంటి విషయములు ఇప్పుడు ఉదాహరణగా చెప్పడం అప్రస్తుతం కాదు అనుకుంటాను. 140 లక్షల రూపాయల ఖర్చుతో ఒక రిజర్వాయర్ ఉన్నది: ఆరిజర్వాయర్ లో 3 వేల ఎకరముల భూమి సాగు అవుతుంది కనుక దానికి ఇంత ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టడంమంచిది కాదని వారు సెలవిచ్చారు. అసలు ఇది irrigation కు సంబంధించిన రిజర్వాయర్ కాదని, flood కొరకు ఏర్పడిన రిజర్వాయర్ అని గట్టిగా చెప్పుచున్నాను. Return అనేది, 3 వేల ఎకరములు సాగు అనే దానికి సంబంధించిన విషయం కానేకాదని నేను మనవిచేయుచున్నాను. అది irrigation కు సంబంధించిన రిజర్వాయర్ కానప్పుడు 2 వేలు, 8 వేలు, 10 వేలు, ఎకరములు సాగు అవుతుందనే విషయము లెక్కలోనికి తీసుకోకూడదు. వరదలు వచ్చి అయిదు తాలూకాలలోని గ్రామాలను అనేక ఎకరముల పంటను నాశనంచేస్తున్న బుడమేరు ముంపు నివారణస్కీము 3 పథకములుగా అమలు జరుగవలసి ఉన్నది. ఆనాడు ఆ స్కీమును Flood Control Board వారు, pass చేసినారు. అటువంటి దానిని ఈనాడు diversion scheme canal గా ఒక్కదానికే అమలు జరుపుతున్నారు. న్యాయంగా దానికి

Sri K. Venkatarathnam] [26th March 1956

3 స్కీములు అమలు జరపవలెను. ఒకవేళ ఆ రిజర్వాయర్ అమలు జరిపేటప్పుడు ఏమైనా లోటుపాట్లుఉంటే, ఎవరికయినా నష్టంవచ్చేపరిస్థితి ఉంటే ఎక్కడకు వీలయితే అక్కడకు మార్చవలసినదిగా మనవిచేయుచున్నాను. కాని ఉపముఖ్య మంత్రిగారు చెప్పినట్లుగా ఇది irrigation scheme మాత్రంకాదని నేను ఘంటాపదంగా చెప్పగలను. ఆనాడే దీనిని Technical Advisers, Flood Control Board వారు, Centre లోనున్న Flood Control Board వారు ఆలోచించి Flood reservoir diversion canal, flood tanks అనే మూడింటినీ కలిపి pass చేసినారు. కాని ప్రత్యేకంగా irrigation కొరకు pass చేయలేదు. ఈనాడు కోసీనదికి బ్రహ్మాండమైన వరదలు వస్తూంటే దానికొరకు కొన్నికోట్ల రూపాయలు ఖర్చుపెడుతున్నారు. అటులనే గండక, బ్రహ్మపుత్ర, డిబ్రుగర్ మున్నగు నదులకుకూడ ఖర్చుపెడుతున్నారు. అదేవిధంగా రాష్ట్ర ప్రభుత్వమువారు ఇక్కడకు పంపించిన ఈస్కీమును వరద నివారణక్రింద sanction చేసినారు. దానిని ఈనాడు ఎవరో ఒక సెక్రటరీగారు ఇది flood reservoir కాదని చెప్పినంతమాత్రాన దానినే ఉపముఖ్యమంత్రిగారు సమర్థించి ఇది ప్రత్యేకంగా irrigation కు సంబంధించినదని, 3 వేల ఎకరములభూమి సాగు అవుతుందని చెప్పడం నిజంగా శోచనీయంగా ఉన్నదని చెబుతున్నాను. ఇప్పుడు ప్రభుత్వరికార్డులు తీసిచూడండి. ఏమిచేసిందీ స్పష్టంగా ఆ record లో చూడవచ్చును

Record తీసి చూచినట్లయితే ఆనాడు మంత్రిగారు ఏమి pass చేసి, కేంద్ర ప్రభుత్వంవారికి పంపించినారో తెలియగలదు. ఉపముఖ్యమంత్రిగారు ఈరోజున సభలోలేరు. వారుంటే బాగుండేది. ఈ బుడమేటి వరదవలన్ల లక్షలకొలది ఎకర ములలోని పంట సర్వనాశనమైపోతే ప్రభుత్వం శిస్తు remission ఇచ్చింది. ఆ విషయం ప్రభుత్వపు record లో ఉంటుంది. ఈవిధంగా 25 సంవత్సరములలో 8 దఫాలు బ్రహ్మాండమైన వరదలు వచ్చినవి. 1952 వ సం॥లో వరదలు వచ్చినపుడు లక్ష ఎకరములు భూమి సర్వనాశనమైపోయింది. అప్పుడు శిస్తు రెమిషన్ ఇచ్చినారు. 1933, 1939, 1940, 1944, 1945, 1947, 1949 సంవత్సరములలో శిస్తు రెమి షన్ ఇచ్చినారు ఈ బుడమేరు ముంపునివారణస్కీమును వెంటనే అమలుజరప వలెనని అచ్చటిరైతులు మొరపెట్టుకుంటుంటే అనేకమంది engineers investigation చేసి ఈ మూడింటిని ఒకేస్కీముక్రింద నిర్మించుటకు ఏర్పాటు చేసినారు. కోటిరూపాయపాలకు,

(1) బుడమేరు రిజర్వాయర్ స్కీము,

(2) కొల్లూరుదగ్గర 38 లక్షలకు ఒక diversion scheme,

(3) 28 లక్షల రూపాయలతో కరకట్టలు పోసి కొల్లేరులో కలపాలని నిర్ణయం చేశారు.

"ఈ మూడు స్కీములకు బదులు డైవర్షన్ కెనాలు ఒకటి తీసుకువస్తున్నాము, ఇదిచాలా బ్రహ్మాండంగా ఉంటుంది, మీరు దీనిని నమ్మండి" అని డిప్యూటీ ముఖ్యమంత్రిగారు ప్రజలకు చెప్పడం చాలా ఆశాభంగాన్ని కల్గిస్తున్నది ఈ మూడింటిని ఒకేసారి అమలుజరిపితే బాగుంటుంది కాని డైవర్షన్ కెనాలు వక్కటే తీసుకొని వచ్చినంతమాత్రాన ఏమీ ప్రయోజనంలేదని ప్రజలలో అభిప్రాయం ఉన్నది అందుచేత ఈనాడు మన ప్రధానమంత్రిగారు సప్లిమెంటరీ డిమాండు తెచ్చినందున ఈ విషయమును మరొకసారి జ్ఞాపకంచేయవలసి ఉంటుందనుకుంటాను అందుచేత ఈ 3 స్కీములను ప్రధానంగా అమలుజరపాలి ఏదో ఒక్కదానిని అమలుజరుపుటవలన ముంపునివారణ జరుగదు, ఏమీ ప్రయోజనం ఉండదని మనవి చెస్తున్నాను. డిప్యూటీ ముఖ్యమంత్రి గారు మాట్లాడుతూ "నేను కృష్ణాజిల్లాకు వ్యతిరేకినని కాకాని వెంకటరత్నం అంటున్నాడు. నేనేమి చేసినా వారిమేలుకొరకే చేసినాననీ" ఏకరువుపెట్టినారు. ఈనాడు కృష్ణాబారేజీ పెట్టారు అది మాకొరకే కాదని నేను దృఢంగా చెప్పగలను. గుంటూరు, గోదావరి జిల్లాలకుకూడా కాదు అంటున్నాను 11 లక్షల ఎకరములభూమిలోని పంట సర్వనాశనమై పోవుచున్నది. దేశములో కరువువచ్చేటట్లుంది కనుక, కృష్ణా ఆనకట్టపోతోంది కనుక, కేంద్రప్రభుత్వమువారు కట్టించాలని అనుకొన్నారు కనుక రాష్ట్రప్రభుత్వంకూడా సమ్మతించారు. sanction లేక పోయినప్పటికీకూడ వారు డబ్బు ఇచ్చినారు. దేశసౌభాగ్యమును దృష్టిలోపెట్టుకొని దేశంలో కరువురాకుండా చేయవలెనను ఉద్దేశ్యంతో చేసినారు. అదేవిధంగా నాగార్జునసాగర్ కూడ మాజిల్లా ఒక్కరికొరకే నిర్మించుట లేదు. బ్రహ్మాండమైనస్కీము 7, 8 జిల్లాలకు సంబంధియున్నది. అంతేగాని ఈ పనులన్నియు నేనేచేశానని నెత్తినపెట్టుకుని ఊరేగమంటే, ఊరేగుట నాపనికాదు. మంత్రిగా ఆయన చేయవలసిన డ్యూటీమాత్రమే చేశారు ఈ ముంపువలన లక్షల కొలది ఎకరములభూమి సర్వనాశనమైపోతోంది రైతులు నష్టపడుతున్నారు కనుక, ఇది 70 సం॥లనుంచి ఆందోళనచేస్తున్న విషయం కనుక, దానికి ఈ 3 స్కీములు అమలుజరిపి కేంద్రప్రభుత్వంనుండి డబ్బు తీసుకొనివచ్చి ఆపని చేయించాలని మేము కోరుతున్నాము. వీటివల్ల ప్రభుత్వానికి లాభం లేదనుకొన్నట్లయితే betterment tax వేస్తున్నారుగదా! అదిమేము చెల్లించుకుంటాము నేను ఇంతవరకు మా రైతులను అడగలేదు. జవాబుదారీ తీసుకొని చెబుతున్నాను ఈ betterment tax ఒక ఎకరమునకు 100 రూపాయలో, 150 రూపాయలో వేసినట్లయితే ప్రభుత్వానికి 1,50 లక్షల రూపాయలువస్తుంది.

ఎప్పుడో Chief engineer గా ఉన్న వెంకటాచారిగారు చెప్పినారని దీనిని అమలు చేయకపోవడం మంచిదికాదు. ఆయనకు జవాబుదారీలేదుకదా ! ఆనాటి పరిస్థితివేరు. ఈనాటి పరిస్థితివేరు. Composite state లో మద్రాసులో ఉన్నప్పుడు వ్రాస్తే వ్రాసిఉండవచ్చును. అది ఈనాటికి తగినవిషయంకాదు ఆయన వ్రాసినటువంటిదానిని తీసుకొనివచ్చి P. W. D. Secretary గారు చెపితే దానిని మంత్రిగారు అంగీకరించడం న్యాయంకాదని మనవిచేస్తున్నాను. నాకు నిజంగా P. W. D. Secretary గారిమీద కోపంలేదు. ఇటువంటి ప్రధానమైన విషయంలో P. W. D. Secretary గారు అడ్డుతగిలితే ఆ పని ఆగిపోతోంటే మంత్రులు చేయవలసినది ఏమిటి ? అని అడుగుతున్నాను. ఈ విషయంలో చాలా అన్యాయంజరిగింది. క్రిందినుంచి కేంద్రప్రభుత్వంవారివరకు అంగీకరించిన దానికి ఒక P. W. D Secretary అడ్డుతగిలితే అది ఆపివేసేటట్లయితే మన దేశంలో ఈ Technical people, Engineers ఎందుకు అంటున్నాను ? అయిన ఆ Secretary గారినే కూర్చోపెట్టి ఆయనచేతనే పరిపాలన చేయించవచ్చును. ఇప్పుడు బుడమేరు ముంపునివారణ, రిజర్వాయర్ విషయంలో అన్యాయం జరిగినది కనుక దీనిని పునరాలోచించవలసినదిగా ప్రధానమంత్రిగారికి మనవి చేయుచున్నాను. ఈ విషయములన్నింటినీ ప్రధాన మంత్రి గారు శ్రద్ధగా ఆలోచించి ఒకేపథకంక్రింద వున్న ఈ మూడు స్కీములను వెంటనే అమలు జరుపవలసినదిగా కోరుతూ విరమిస్తున్నాను.

SRI T. RAMACHANDRA REDDI :—అధ్యక్షా మహాశయా, మేము ప్రజలకుచేసేది ఏమిలేకపోగా ఈ Budget ను అంగీకరించవలసిన పరిస్థితి ఏర్పడింది. కనుక Supplementary budget 8 కోట్ల 25 లక్షల రూపాయలని నేను అంగీకరిస్తున్నాను. మంత్రులు వారియొక్క దృక్పథాన్ని ఒక్కప్రాంతానికే కేంద్రీకరించకుండా ఆంధ్రదేశం నలుమూలలా విశాలహృదయంతో, విశాలదృక్పథంతో చూస్తారని నేను ఆశిస్తున్నాను. క్షామప్రాంతానికి ప్రసిద్ధిగాంచిన రాయలసీమ ప్రదేశం, శ్రీకాకుళంజిల్లాను చాల నిర్లక్ష్యంతో చూస్తున్నారని మీ ద్వారా మంత్రిగారికి విన్నవించుకొంటున్నాను. రాయలసీమ క్షామానికి ప్రసిద్ధిగాంచినది, వేసవికాలంలో రాయలసీమ ప్రాంతంలోని అనేకగ్రామాలలో త్రాగడానికికూడా ఒక్కచుక్కనీరు లేకుండా ఉన్నదంటే ఆశ్చర్యకరమైన విషయం. ప్రజాపరిపాలన ఉంటేటటువంటి ఈ నవీనయుగంలో గ్రామాలలో త్రాగుటకైన నీటి సౌకర్యం కల్పించలేనిస్థితిలో మనం ఉన్నామంటే అది చాల శోచనీయమైన విషయం. దాని విషయమై అనేకధఫాలు అర్జీలుకూడా పెట్టాము. ఆ అర్జీలు ఏమైనాయో ఈనాటి

వరకు నాకు తెలియదు. ఈ విషయాన్ని ఎన్నిపర్యాయములు మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చినా ఏమిప్రయోజనం కనబడడంలేదు. ఈ విషయాన్ని మరల వారికి మీద్వారా విన్నవించుకొంటున్నాను. రాయలసీమలో అనంతపురంజిల్లాలో ప్రవహిస్తున్నటువంటి నదులలో ఎప్పుడుకూడా నీళ్లుఉండేవికావు. ఏ కొద్దిపాటి నీళ్లు వచ్చినాకూడా ఆ నీటిని మైసూరు ప్రభుత్వంవారు అడ్డుపెట్టి వారేవినియోగించుకుంటూ ఉంటారు. రాయలసీమలో ఇటువంటి సదుపాయాలులేని విషయం అనేక పర్యాయములు ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చాము. కాని ప్రభుత్వం ఈ విషయంలో ఏమిచర్యలు తీసుకొనేది ఈనాటివరకు మాకు తెలియకుండాఉన్నది. కొన్ని ప్రాంతాలలో బావులుకూడాలేవు. రెండు మాసాలక్రితమే నా నియోజకవర్గమంతా 4 వ దఫా పర్యటనచేసి వచ్చాను. కొన్నిగ్రామాలలో బావులలో 120 అడుగులవరకు నీళ్లులేకుండాఉన్నవంటే ఇంతకన్న ఆశ్చర్యకరమైన విషయము ఇంకెక్కడా ఉండదనే అనుకొంటాను. ఇటువంటి పరిస్థితులలోకూడా గ్రామాలలో ఏవిధమైన సౌకర్యాలులేకుండా మేముఉంటే ప్రభుత్వము వాటివిషయమై విచారించుకుండా, ఏమిచేస్తోందని మరొకసారి అడుగుతున్నాను. ఈ విషయమై ప్రభుత్వానికి, జిల్లాఅధికారులకు ఎన్నిదఫాలు చెప్పినాకూడా ఏమిచేయలేకపోవడం చాల శోచనీయంగాఉన్నది విద్యుచ్ఛక్తి supply చేయాలని సంవత్సరంనుంచి మంత్రిగారికి, Chief Engineer గారికి అనేకమైన అర్జీలు పంపుకొన్నాను. ఈనాటికికూడా Investigation మొదలైన చర్యలేమి వాళ్లు తీసుకోవడంలేదు. దీనినిబట్టి, వెనుకబడిన ప్రాంతాలకు ప్రభుత్వం ఏమీచేయదలచుకోలేదని మనం గుర్తుంచుకోవాలి. లేకపోతే లేనిపోని విమర్శనకు పాత్రులుఅవుతారనే విషయం మనం మరచిపోకూడదు. వీటిని నిర్మూలన చేయాలంటే వారి కష్టాలను పోగొట్టాలంటే తుంగభద్ర ఎగువకాలవ తప్ప వేరే శరణ్యంలేదు రాయలసీమ జిల్లాలో గత సంవత్సరం గవర్నరుగారు తమ ప్రసంగంలో ఈ తుంగభద్ర ఎగువ కాలవ విషయమై ఏవో కొద్ది మాటలు చెప్పి కాలయాపన చేశారు. ఈ సంవత్సరంకూడా మన ప్రధాన మంత్రిగారు తమ budget ఉపన్యాసంలో ఏవో కొన్ని విషయాలు చెప్పారు. కాని తుంగభద్ర ఎగువ కాలువ పట్టుబట్టి సాధిస్తారనే వాంఛ్లో నాకేమి నమ్మకంలేదు. తుంగభద్ర ఎగువ కాలవ మీరు పట్టుబట్టి సాధించలేకపోతే రాయలసీమ జిల్లాలు అధఃపతనమై పోతాయన్న సంగతి మీరు బాగా జ్ఞాపకం ఉంచుకోవాలని మీద్వారా ప్రభుత్వానికి విన్నవించుకుంటున్నాను.

జిల్లా పరిపాలన విషయం చూస్తే చాల శోచనీయంగా ఉన్నది. మంత్రులంకూడా 6, 8 మంది ఒక నెలలో ఆ జిల్లాలనుంచి పోతుంటారేగాని జిల్లాయొక్క

పరిపాలన ఏ రీతిగా సాగుతున్నదో నియోజక వర్గాలలోని శాసన సభ్యులను అడిగి తెలుసుకున్న పాపాన పోలేదు. మా నియోజక వర్గంనుంచి మేము పంపుకున్న దరఖాస్తులు జిల్లా అధికారులకు ఇస్తే ఆ దరఖాస్తులమీద ఏమి చర్య తీసుకుంటున్నారో ఈనాటికికూడా తెలియదు. ఈ విషయం గౌరవనీయులైన ప్రధాన మంత్రిగారికి, చంద్రమౌళిగారికి విన్నవించుకొన్నాను. కాని ఈ విషయమై చాల అశ్రద్ధ చేస్తున్నారని మాత్రం మరీ మరీ విన్నవించుకుంటున్నాను. ఈవిధంగా మీరు అశ్రద్ధ చేస్తే మా నియోజకవర్గంలోని ప్రజానీకానికి ఏమి జవాబు చెప్పాలో మాకు తెలియకుండా ఉన్నది.

గ్రామాలలో ఆస్పత్రుల విషయంచూస్తే చాల శోచనీయంగా ఉంటున్నది. ఎవరైన గర్భిణీ స్త్రీ ఆస్పత్రికి పోవాలంటే 20 మైళ్లు బండి కట్టుకొని ఆస్పత్రికి పోవలసి ఉన్నది. అంతేగాని దరిదాపులలో ఎటువంటి సౌకర్యము లేకుండా ఉన్నది. ఈ విషయాన్ని గూర్చి గత సంవత్సరం అర్థించినాను. ఈ సంవత్సరంకూడా అర్థిస్తున్నాను. కనీసం 10 గ్రామాలలో నైనా ఒక ఆస్పత్రిని ఏర్పాటు చేయాలని కోరుతున్నాను. ఆస్పత్రి ఏర్పాటు చేసేదానికి డబ్బు లేదనవచ్చు. డబ్బు ఎందుకు లేకుండా పోతున్నది. ఎన్నో విలాస వస్తువులకు డబ్బు వృథాగా ఖర్చు పెట్టబడుతున్నది. ప్రజారోగ్యానికికూడా కొంతవరకు ఖర్చు పెట్టాలి. దానికికూడా ఖర్చు పెట్టకపోతే ఇంక దేనికి మనం ఖర్చు పెట్టలేమని మనవిచేస్తూ ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులవారికి నా కృతజ్ఞత తెలుపుతూ విరమిస్తున్నాను.

SRI A. KALESWARA RAO :—అధ్యక్షు మహాశయా, ఒక విషయం మాత్రం రైతులలో ప్రజలలో ఆందోళన కలుగజేస్తున్నది. అది బుడమేరు విషయం. బుడుమేరు చాల చెడ్డఏరు. అది చేసేటటువంటి నష్టము చాలా ఎక్కువగా ఉన్నది. ఒకొక్కప్పుడు మనుష్యులనుకూడా కొట్టుకుపోతున్నది. ఆ నీటివల్ల ప్రతి సంవత్సరము సంభవించేటటువంటి వేలకువేల పంట నష్టాన్ని తగ్గించాలని చాలరోజులనుంచి ప్రయత్నం జరుగుతున్నది. చిట్టచివరకు పైన ఒక రిజర్వాయరు కట్టి కొన్నివేల ఎకరాలు సాగుచేయాలని క్రింద కట్టలు కట్టాలనే సూచన Government లో జరిగింది. ఆకస్మికంగా, నీళ్లను కృష్ణరేవుకు మరలించి diversion scheme కట్టినట్లయితే నీళ్లు చాల తగ్గిపోతాయి, క్రింద ఎటువంటి అపాయం ఉండదు, పైన రిజర్వాయరు కట్టి కొన్నివేల ఎకరాలు సాగుచేయవచ్చునని అనుకొన్నారు. ఈ బుడమేరును కొండపల్లి వేపునుంచి తీసుకువస్తే చేస్తే బాగుంటుందని Central Engineer గారు సలహాచెప్పారు. మధ్యలో diversion scheme అనేది ఒకటి

వచ్చినది. మొట్టమొదట రిజర్వాయరు క్రింద కొన్నివేల ఎకరాలు సాగుకు తీసుకువచ్చి తరువాత నీళ్లను కృష్ణలోకి మరలించడం తరువాత రెండు వైపుల కట్టలు కట్టి నీళ్లను అటుయిటు పోకుండా ఒకవిధంగా సాఫీచెయడం మొదలైనవన్నీ చేయదలచుకున్నారు అదంతా sanction అయింది. కాని రిజర్వాయరుక్రింద సాగయ్యేటటువంటి భూమి చాల తక్కువగా ఉన్నది. కోట్ల రూపాయలు ఖర్చుపెడితే 3 వేల ఎకరాలు సాగుఅవుతున్నది. దీనిని రిజర్వాయరుక్రింద చేసుకోవాలనుకొన్నప్పుడు diversion ఎప్పుడైతే వచ్చిందో flood control కూడా దానిక్రింద వచ్చింది. ముంపు నివారణకుగాను కట్టలుకడుతున్నాము. గనుక రిజర్వాయరు అనేది వ్యవసాయమునకు కావలసిన నీటి పారుదలకే-గాని ముంపునివారణకు కాదనే ఒక సమస్య బైలుదేరింది అందులో కొంత అర్థంఉన్నమాట నిజమే. ఇంకా కొంచెముపైన రిజర్వాయరు కట్టినట్లయితే ఇంతకంటె ఎక్కువ ఎకరాలు సాగుచేయడానికి వీలౌతుందేమోనని భావిస్తున్నాను. దీనివిషయమై మంత్రిగారు ఆలోచించి ఇంజనీర్ల నందరిని పిలిచి వారి సలహాలు తీసుకొని ఇంతకంటె ఎక్కువ భూమి సాగయ్యేటట్లుగా ఏది కట్టించినప్పటికి మాకేమి అభ్యంతరం ఉండదు. రైతులకు అభ్యంతరం ఉండదు బిల్లులో చెప్పిన రిజర్వాయరే కట్టాలనే టటువంటి అభిప్రాయం ఎవరికి లేదు.

కాబట్టి ఈ విషయములో ఇంజనీర్లందరిని సలహా అడిగి, అవి దేనిక్రిందనైనా కట్టనివ్వండి, ముంపు నివారణక్రిందగాని, లేకపోతే నీటిపారుదలక్రిందగాని, ఏదో ఒక విధంగా కొన్నివేల ఎకరాలు నీటిసౌకర్యాలు కలిగి, పల్లము సాగుఅయి, రైతులు సుఖసంపదలతో ఉండేటటువంటి మార్గాన్నిమాత్రము చేయవలసిందని నేనుప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత ప్రతివారు మాజిల్లాకు ఇది చేయలేదని, అది చేయలేదని ఈవిధంగా చెప్పడం అంత సబబుగాలేదు. ఇవన్నీ స్వల్పవిషయాలు. బ్రహ్మాండమైనటువంటి Krishna barrage కడుతున్నారు ఆంధ్రదేశాన్నే కాకుండా, విశాలాంధ్రనుకూడ కలిపేటటువంటి, సర్వరవాణాసౌకర్యాలు కలుగజేసేటటువంటి, పెద్దరోడ్లు వేస్తున్నారు. అందులో మేము, బెజవాడలో అంటే యావదాంధ్రదేశానికి మధ్యలో ఉన్నాముగనుక, అందరి సౌఖ్యాన్ని చూడవలసిన బాధ్యత మామీదవున్నది. అందులో త్వరలో నే హైదరాబాదుకూడ వస్తున్నదిగనుక చిన్న చిన్న విషయాలన్నీ చర్చించడం అనవసరమని మనవిచేస్తూ, ఈ విషయంలో ప్రభుత్వంవారు చక్కగా యోచించవలసిందని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

**MR. SPEAKER** :—I am very glad to announce that the Chief Minister of Orissa has come to the House (Applause).

SRI B. RATNASABHAPATHI :—అధ్యక్షా, ఈ supplementary demands పైన సుదీర్ఘమైన చర్చ జరిగింది. చాలామంది గౌరవ సభ్యులు మాట్లాడారు. ఇక నేను ఎక్కువకాలము తీసుకోకుండా నాలుగు మాటలు మాత్రము తెలియజేయవలెననుకొన్నాను. ఇందులో ముఖ్యంగా forest grant మొట్టమొదట చూపించబడినది. దీంట్లో ఎందువల్ల ఇంత ఖర్చు చేస్తున్నారా అనేదానిమీద సంశయము వస్తున్నది. పంచాయతీ, ఎస్టేటు forests గవర్నమెంటు వారు తీసుకొన్నారు. ఈ forests వల్ల ప్రభుత్వానికి ఎంత ఆదాయము వస్తున్నదనేది ఈ forests report లో గాని, మరెక్కడాగాని తెలియజేయబడలేదు. కాని, ఈ forests అన్నీ పరిపాలనచేయడానికిగా ఒక new service ను ఏర్పాటు చేయవలెనని, దానిక్రింద 81 వేల రూపాయలు మాత్రము ఖర్చు సూచించారు. ఈ forests కు సంబంధించినంతవరకు, పంచాయితీ forest గాని, estate forests గాని, ఇప్పటికే చాలామటుకు దుర్వినియోగము జరిగింది. జమీందార్లు, ఇనాందార్లు, శ్రోత్రియందార్లు ఉన్నప్పుడు, వారి ఇష్టానుసారం వీటిని ఉపయోగించుకొన్నారు. కాని మా ప్రాంతాలలో ఉన్నటువంటి ఎస్టేటులలోని, శ్రోత్రియాలలోని forests చూస్తే అక్కడ చెట్లులేకపోవడమే కాకుండా, చెట్లువేస్తే మొలుస్తాయా అనే సందేహంకూడా కలుగుతుంది. అటువంటప్పుడు ఇంత పెద్ద మొత్తం ఖర్చుపెట్టి ఒక new service ఎందువల్ల create చేయవలసి వచ్చిందో నాకు బోధపడడంలేదు. దీనియొక్క ఉపయోగమేమిటో నాకు తెలియకుండా ఉన్నది.

తరువాత ఈ forests పరిపాలనలో కూపులు సవాలు జరుగుతున్నాయి. ఈ కూపుల సవాలులో చాలాచోట్ల పేదవాళ్లకు, Co-operative Societies కు అనుకూలంగా ఉన్నటువంటి areas ను demarcate చేసి ఆ areas ను ఈ Societies కు ఇవ్వాలనికూడ నిర్ణయంచేయడం జరుగుతున్నది. కాని మా ప్రాంతాలలో, నెల్లూరుజిల్లానుంచి చాలా complaints వస్తున్నాయి. ఈ కూపులుగా నిర్ణయించినటువంటి areas ను కూడ సవాలుచేసి ఆ సొసైటీలకు ఇవ్వకుండా private auction కు ఇవ్వడం జరుగుతున్నది. ఈ complaint చాలామట్టుకు Chief Minister గారికి ఇదివరకు మేము తెలియజేశాము. ఎన్ని మార్లు తెలియజేసినాగాని ఆ సొసైటీలకు ఇవ్వకుండా private auction కు ఇవ్వడం జరుగుతున్నదంటే నాకు అర్థంకాకుండా ఉన్నది. ఆవిధంగా చేస్తే, ఈ Co-operative Societies స్థాపించడంలో వారి ఉద్దేశమేమిటో తెలియకుండా ఉన్నది. ఈ సొసైటీలవల్ల బీదవాళ్ళు, కూలీలు బాగుపడాలి, అనే ఉద్దేశమయితే, మళ్లీ ఆ కూపులను auction ఎందుకు చేస్తున్నారో బోధపడడంలేదు. మొన్న

మొన్ననే మా జిల్లాలో, ప్రొద్దుటూరుతాలూకాలో ఒక సొసైటీ ఏర్పడింది. ఆ సొసైటీ రిజిస్టరు అయినట్లుకూడా ఆ Forest Department వారికి తెలిపినా కూడా ఆ area వాళ్లకు కేటాయించకుండా auction చేయడం జరిగింది. వాళ్లు auction చేసేరోజుకు ముందుగానే, ఆసొసైటీ రిజిస్టరు అయినట్లు Registrar గారికి తెలియజేశారు. తెలియజేసినాగాని, ఈ సంవత్సరము ఆ సొసైటీకి ఇవ్వడానికి అవకాశములేదు, అది private auction కు ఇవ్వవలసిందేనని చెప్పుతూ auction చేశారు. అందువల్ల ఈ Co-operative Societies యొక్క అవసరమున్నదా, ఉంటే అవి సక్రమంగా నడిచేటట్లు చేయకపోవడంలో కారణాలు ఏమిటి అని ముఖ్యమంత్రిగారిని అడుగుతున్నాను. దాన్నిగురించి సమాధానము చెప్పవలసిందిగా కోరుతున్నాను

తరువాత general sales tax కు సంబంధించిన విషయము కూడా ఉన్నది దీంట్లో చాలా evasion జరుగుతున్న విషయము అందరికి తెలిసినదే. ఈ evasion జరుగకుండా ఎటువంటిపద్ధతులను అనుసరించవలెను ఆ నేరాన్ని విచారించి మంచిసలహాలిచ్చుటకుగాను ఒక కమిషను ఏర్పాటుచేశారు. ఆ కమీషను అన్ని విషయాలను విచారించి మంచిసలహాలు ఇవ్వగలుగుతారని ఆశిస్తున్నాను. ఈ విషయములో నాకు తెలిసినంతవరకు ఒక సలహా ఇవ్వదలచుకొన్నాను ఆంధ్రదేశములో Imperial Tobacco Company వారు సిగరెట్లు supply చేస్తున్నారు. వారు మొన్న మాకు కొన్నివిషయాలు తెలియజేశారు. దాన్ని బట్టిచూస్తే మన ఆంధ్ర రాష్ట్రములో ఇతర అన్ని రాష్ట్రాలకంటే కొన్ని సిగరెట్లు పైన ఎక్కువపన్ను వేస్తున్నారు. దీనివల్ల ఎక్కువ cigarettes consumption తగ్గింది, అదిమంచిదే అనుకొంటాను. కాని మన పక్కనవున్న రాష్ట్రాలలో ఇంతపన్ను వేయకపోవడం వల్ల అక్కడ అమ్ముడు అవుతున్నటువంటి cigarette మనరాష్ట్రంలోకి దొంగతనంగా తీసుకురావడం జరుగుతున్నవి. Gold flake, Capstain, Players, ఈ మూడురకాల సిగరెట్లపైన ఎక్కువపన్ను వేస్తున్నారు. అవి, 0—15—0, 0—14—0, 0—13—0 అణాలు లెక్కను మనరాష్ట్రములో అమ్ముడు పోతున్నాయి. కాని పక్కరాష్ట్రములలో 0—9—0 లెక్కను అమ్ముడుపోతున్నాయి. అయితే, అధికారపూర్వకంగా, వచ్చినటువంటి లెక్కల ప్రకారముగా50 వేల రూపాయలవరకు సిగరెట్లు దొంగతనంగా మనరాష్ట్రములోకి తీసుకొనివచ్చి అమ్ముడుచేస్తున్నారని వాళ్లుమాకు తెలియజేశారు.

వారు యిందులో ఇవి యింకా ఎక్కువగానే అమ్ముడు పోవడము జరుగుతున్నదన్నారు. మాకు వచ్చిన భోగట్టామబట్టి యాభైవేల రూపాయల్లదాకా

ప్రభుత్వానికి నష్టము రావడమే కాకుండా, మాకుగూడ నష్టము వస్తున్నదని ఇక్కడ ఉండే సిగరెట్లుకంపెనీ chief agent వల్లగూడ తెలుస్తున్నది. కాబట్టి యీ విషయములో ప్రభుత్వము ఎక్కువగా శ్రద్ధతీసుకుని యింకా ఎక్కువ విషయాలను సేకరించటానికి దర్యాప్తుచేయిస్తే, ఇంకా ఎన్నో విషయాలు బైటకు వస్తాయి. (Interruption) అలాంటివి కలకత్తానుంచి వస్తున్నవి. ఇక్కడ హైదరాబాదునుంచికూడ వస్తూఉన్నవి. ఈ సిగరెట్ ప్యాకెట్లు ఖరీదు అక్కడ చాలా తక్కువ. ఇక్కడ మన రాష్ట్రములో వేసే పన్నులవల్ల ఎక్కువ ఖరీదులో అమ్ముతున్నారు. అందువల్ల యీ విధముగా దొంగతనముగా తెచ్చి, అధికలాభాలకు యీ రాష్ట్రములో అమ్ముకుంటున్నారు. ప్రభుత్వము యీ విషయములో యింకా ఎక్కువ విషయాలు సేకరించాలని కుతూహలపడితే, Imperial Tobacco Company వారిని contact చేస్తే, అన్ని విషయాలు బైటపడుతాయి. ఈ విధమైన smuggling తగ్గించటానికి ప్రభుత్వము తగిన చర్యలు తీసుకోవలెనని అంటున్నాను.

తరువాత irrigation ను గురించి మిత్రులు చాలా మంది మాట్లాడారు. పెద్ద పెద్ద ప్రాజెక్టులమీదనే ప్రభుత్వము ఎక్కువగా శ్రద్ధవహిస్తున్నట్లు కనబడుతున్నది. పెద్ద పెద్ద ప్రాజెక్టులు ఎట్లా ఉన్నప్పటికీని, రాష్ట్రములో medium size projects ఎన్నో ఉన్నవి. Minor irrigation projects విషయముగూడ ప్రభుత్వము శ్రద్ధ వహించడములేదు. ఎంతసేపటికినీ, పెద్ద ప్రాజెక్టులమీదనే ప్రభుత్వము తన దృష్టిని కేంద్రీకృతము చేస్తున్నది. పెద్ద పెద్ద ప్రాజెక్టులు పూర్తికావటానికి, నీరు సరిగా సప్లైఅయి, దాని ఆయకట్టుక్రిందకు వచ్చేభూమి కుదురుపడి, పంటలు సక్రమంగాను, సవ్యక్రమముగాను పండేస్థితి రావాలంటే ఎన్నో సంవత్సరాలు పడుతుంది. అంతకన్న minor projects ను ముందు ప్రారంభిస్తే దానియొక్క ఫలితము త్వరలో చేకూరడానికి అవకాశము ఉంటుంది గదా! కాని ఏ ప్రాజెక్టులు ప్రభుత్వము తలపెట్టినను, ఒక దానికి, యింకొక దానికి overlapping కాకుండా చూడాలి. ఒక ప్రాజెక్టు నీరు దానిక్రింద ఉన్న భూమికి, పారుదల కావలసిఉన్నప్పుడు, ఆ నీరునే యింకొక ప్రాజెక్టుక్రింద భూమికి పారుదల అయ్యేటట్లు కాకుండా చూడాలని అంటున్నాను. ఉదాహరణకు, మనము నందికొండ ప్రాజెక్టు నిర్మించబోతున్నాము. దానికి సుమారు ఏ 130 కోట్లవరకో ఖర్చుచేయబోతున్నారు. దీనివల్ల గుంటూరు, కృష్ణా, నెల్లూరు జిల్లాలలోకి నీరు పారుదల సౌకర్యాలు ఏర్పాటు చేయబడుతున్నవి. ఈ ప్రాజెక్టు యిప్పట్లో తయారుకాదు, ఫలితము కొన్ని సంవత్సరాలకు గాని అందదుఅన్న

సంగతి అందరికీగూడ తెలిసిన విషయమే. కాని ఇది తయారయ్యేలోపుగా మరల నెల్లూరు జిల్లాలో సోమశిల ప్రాజెక్టును, అక్కడ నీటి సరఫరా కొరకు, నిర్మించాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నది. నందికొండ ప్రాజెక్టు ఏపది సంవత్సరాలకో గాని పూర్తికాదనే అనుమానముతో, అంతకంటె త్వరలో నీటివసర్లు ఏర్పరుచుకోవాలనే ఉద్దేశముతో సోమశిల ప్రాజెక్టు 17 కోట్లు ఖర్చుచేసి కట్టించాలని ప్రభుత్వము ఉద్దేశిస్తున్నది. నందికొండ వచ్చేటప్పుడు, ఇంకా అదనముగా 17 కోట్లు ఖర్చు సోమశిలకోసము చేయడము అనవసరమనే అంటున్నాను. సోమశిల ప్రాజెక్టునుగురించి కోస్లాకమిటీవారు ఏమి వ్రాశారో, ఆ రిపోర్టు ప్రభుత్వము ఎదుటనే ఉన్నది. వారు ఏమి వ్రాశారు? కృష్ణనీటిని తీసుకునివచ్చి, పెన్నలోవదిలి, ఆనీటిని పెన్ననీటిని చేర్చి, సోమశిలకు వదిలితేనే, అది feasible అవుతుంది గాని, లేకపోతే ఒక్క పెన్ననీటితో అది నిరర్థకమైన ప్రాజెక్టు అవుతుందని కోస్లాకమిటీవారు వ్రాశారు. ఆరిపోర్టు ప్రభుత్వము ఎదుటనే ఉన్నది. దానిని ప్రభుత్వము పరిశీలించారని నా నమ్మకము. నందికొండ రావడమువల్ల, యిక కృష్ణానది నీటిని పెన్నలోకి వదలడము కాదు. ఆ విషయముగూడ తెలిసినదే. అటువంటప్పుడు 17 కోట్లు ఖర్చుచేసి ఒక్క పెన్ననీటిలో సోమశిలప్రాజెక్టు నిర్మించితే ప్రయోజనమేమి? అందులో మనకు కావలసిననీరు ఉండదుగదా! ఇది అంతా waste అనే చెప్పవలసి వుంటుంది గదా! సోమశిల ప్రాజెక్టుక్రింద వున్న భూమిలో మొదటిసాగుకు నీరుఅంతా నందికొండనుంచే సప్లయి కాబోతుంది.

MR. SPEAKER :—Is it covered by this Demand?

SRI B. RATHNASABHAPATHI :—Yes, Sir, it comes under 'Irrigation'.

MR. SPEAKER :—General policy, I think, is not necessary for us to deal with. Very recently, we dealt with it in the Irrigation Demand. Now, let us confine ourselves to the extra Demands the Government are now making.

SRI B. RATHNASABHAPATHI :—కొత్త ప్రభుత్వము [illegible] స్కీములు తలపెట్టేటప్పుడు ఒకస్కీముకు యింకొకస్కీముకు overlap కాకుండా చేయమని కోరుతున్నాను.

తరువాత minor irrigation projects రాష్ట్రములో కట్టవలసినవి చాలా ఉన్నవి. ముఖ్యంగా backward areas లో చాలా ఉన్నవి. Develop కానటువంటివి, develop అయినవి అనే విచక్షణ లేకుండా, ఎంతసేపటికిన్నీ develop అయిన areas లోనేఇంకా develop చేయటానికి ప్రభుత్వము ఎక్కువగా ఖర్చుచేస్తున్నది కాబట్టి develop కానటువంటి ప్రదేశములలో అవసరమైన minor irrigation projects ను ముందు take up చేయమని కోరుతున్నాను

తరువాత Heads of States, District Administration క్రింద యింకా యితర demands క్రింద ప్రభుత్వము ఎక్కువగా ఖర్చు చూపించారు వీటిని గురించి నేను మాట్లాడవలెనని అనుకుంటే, నాకు వీటిని గురించి మాట్లాడవచ్చునో లేదో సందేహమువస్తున్నది. కారణము ఏమిటంటే, ఏదో గవర్నరుక్రింద అయ్యేఖర్చును గురించి సుందరయ్యగారు మాట్లాడితే, ఆ విషయములు మాట్లాడకూడదు అని ఆక్షేపణ చేశారు. వాస్తవానికి గవర్నరు పేరుతో చేసినఖర్చులు కొన్ని అనవసరమైనవి అవునా, కావా ? ఆ అనవసర ఖర్చులు ఎందుకు చేశారు అని అడిగితే, అది గవర్నరుకొరకు చేసినఖర్చు కాబట్టి, దాన్ని గురించి ప్రశ్నించటానికి వీలులేదు అని ముఖ్యమంత్రిగారు ఆక్షేపణచేశారు. ఇది సరే. ఇక మంత్రుల tours సంగతి ఏమిటి ? మంత్రులు official, unofficial అనే విచక్షణ లేకుండా విచ్చలవిడిగా tour చేస్తున్నారు. దీనికి T. A. ల క్రింద అనవసరముగా ఖర్చు అవుతున్నదంటే, దీనికిగూడ కొన్ని ఏవో అభ్యంతరాలు మంత్రిగారు తెలియజేశారు. నిజానికికొన్ని tours అనవసరమైనవే. ఈ సంగతి ప్రభుత్వము ఒప్పుకోకతప్పదు. అవసరమైన వాటికి మంత్రులువెళ్లితే, దీనికి ఎవరూ ఏవిధముగాను ఆక్షేపణచేయరు. కేవలము అనవసరమైనవి అంటే, కళా పరిషత్తులులాంటివాటిల్లో మంత్రులు participate చేసి, వాటిక్రింద ప్రభుత్వము యొక్క డబ్బు T. A. ల క్రింద ఖర్చుచేయడము అనవసరము అని అంటే, మన శీర్ల బ్రహ్మయ్యగారు లేచి, cinema stars మటుకు కళాకారులుకాదా అని, మంత్రులుమాత్రము కళాకారులుకాదా, అని అంటూ ఆవిధముగా మాట్లాడడము సబబుకాదని ఆక్షేపణ లేవదీశారు. Cinema stars కళాకారులని. మంత్రులు కాదని, సభ్యులుకాదని నేను చెప్పడములేదు. మంత్రులు ఎన్ని కళాపరిషత్తులలో నైనా participate చేయవచ్చు ఇంకా వారికి యిష్టమువుంటే, వారు వారి అనుయాయులుసభ్యులు అందరూకూడ సినీమాలలో వేషాలుకూడా వేయవచ్చు. దానికి ఎవరూ కాదనరు. మాకేమీ అభ్యంతరములేదు. కాని అలాంటి పరిషత్తులకు మంత్రులు attend అయినప్పుడు వారికి, వారివెంటవచ్చిన సిబ్బందికి అయ్యే

T. A. వగైరాల ఖర్చులు ప్రభుత్వము భరించడములేదా ? ఇది ప్రజలడబ్బు కాదా? ఇటువంటి unofficial business మీద మంత్రులు వెళ్లితే ఆ tours కు ప్రభుత్వముయొక్క సొమ్ము T. A. ల క్రింద ఖర్చుచేయడము ఎందుకు ? ఈ ఖర్చు ఆక్షేపణీయముకాదా ? కాబట్టి మంత్రులు యీవిషయము గమనిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత Public Service Commission వ్యవహారము ఒకటిఉన్నది. ఈ విషయము గురించికూడా మేము మాట్లాడవచ్చునో లేదో మాకు సందేహముగా ఉన్నది. మాట్లాడకూడదు అనిఅంటే మాట్లాడము. మొన్న సుందరయ్యగారు మాట్లాడుతున్నప్పుడు ఈ కమిషనువారిని గురించి మాట్లాడకూడదు అని ఆక్షేపణ ముఖ్యమంత్రిగారే లేవదీశారు. అయితే సర్వీసుకమిషనువారుచేసే appointments లో పక్షపాతములు, అభిమానములు లేకుండా చేస్తున్నారని ప్రభుత్వము యొక్క నమ్మకమా ? కొన్ని కొన్ని ప్రభుత్వానికి తెలిసికూడా, అది వాస్తవము కాదని ముఖ్యమంత్రిగారు అంటున్నారు. ఇది చాలా విచారకరమైన విషయము. ముఖ్యమంత్రిగారికి తెలియని విషయాలుఉంటే ఉండవచ్చు. ఉదాహరణ చెబుతున్నాను. గతసారి కొంతమంది candidates District Munsifs గా సర్వీసు కమిషనువారివల్లనే select కాబడ్డారు. రెండు మూడు సంవత్సరాలుకూడ పని చేశారు. ఇప్పుడు వాళ్లను retrench చేయడంవల్ల, వారు ఉద్యోగాలులేకుండా ఉన్నారు. ఈ సంవత్సరము మరల కొంతమందిని సర్వీసు కమిషనువారు సెలెక్టుచేసి, వారికి 1st rank, 2nd rank అని ranks యిచ్చి, ఉద్యోగాలు యిచ్చారు. అయితే యిదివరకు పనిచేస్తూ, oust అయినవారి విషయము ఏమిటి ? వారు రెండు మూడు సంవత్సరాల సర్వీసుకూడ put up చేశారుకదా ! వారికి మరల ఉద్యోగాలు ఎందుకు యివ్వలేదు ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ ఉద్యోగాలకొరకు సర్వీసుకమిషన్ వారు ముందు candidates ను select చేసి, అటు తరువాత ఆ లిస్టును హైకోర్టుకు పంపుతారు. తరువాత High Court వారు appointment యివ్వడం వగైరా చూచుకుంటారు. Service Commission వారిది candidates ను select చేయడమువరకే. Appointments, postings అన్నీ కూడ హైకోర్టువారివి. The whole list of selected candidates is sent to the High Court.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Then, are they justified in doing like that ?

THE HON. DR. B. GOPALA REDDI:—I don't know what it is. అటువంటివి ఏవైనా ఉంటే, అవి మా దృష్టికి తీసుకునివస్తే మాకు తెలుస్తుంది. కాని, లేకపోతే అక్కడ ఏమిజరుగుతున్నది నాకు తెలియదు. This is the first time I hear about it ఏమైనప్పటికినీ, ముందు select అయిన వారికి postings లేకుండా తరువాత అయిన వారికి postings యివ్వడము, ఎందువల్ల జరుగుతున్నదో, నాకు తెలియదు. అసలు అది వాస్తవము అవునో కాదో నాకు మాత్రము తెలియదు.

SRI B. RATNASABHAPATHI :—హైకోర్టువారు ఉద్యోగాలను యిచ్చేవారైతే, కావచ్చు కాని సర్వీసు కమిషనువారు ranks fix చేస్తున్నారు గదా! అందులో ఎవరికి ప్రాధాన్యత యివ్వడము, ఎవరికి యివ్వకపోవడము అనేది ఉన్నది. దానినిబట్టి హైకోర్టువారు ఉద్యోగాలు యిస్తున్నారు. ఇదివరకు మూడు సంవత్సరాలు పనిచేసిన తరువాత oust చేశారు. వారికి మరల posting ఎక్కడనూ యివ్వలేదే ఎందువల్ల ?

MR. SPEAKER :—They are holding the appointments temporarily. It is a temporary appointment made by the High Court.

SRI B. RATNASABHAPATHI :— Service Commission వారిచేత సెలెక్టుకాబడిన వార్లలో B.A.B.L. ప్యాసు అయినవారు ఉంటున్నారు. అయినప్పటికినీ ముఖ్య మంత్రిగారు ఎవర్తెవరికి యివ్వలేదో, వారి పేర్లను యివ్వమని అంటున్నారు. పేర్లను యివ్వటానికి సందేహిస్తున్నాను. ఎందుకంటే యిదివరకు యిదేమాదిరి Secretariat లో కొన్ని అన్యాయములు జరుగుతున్నవని ముఖ్య మంత్రిగారి దృష్టికి సుందరయ్యాగారు తెస్తే, ఈ విషయములు శాసన సభ్యుల ద్వారా శాసన సభ ఎదుటకు తేవడము ఎందుకు, అని ఆగ్రహముతో ఆ విధముగా represent చేసుకొన్న వారిని ఉద్యోగములో నుంచి తొలగిస్తామని అన్నారు. కాబట్టి ముఖ్య మంత్రిగారు postings యివ్వని వారి పేర్లు అడిగినను నేను యివ్వటము అనవసరము, మంచిది కాదు అని అనుకొంటున్నాను. నేను వారికి మేలు చేయబోయి, యిక్కడ ఉపన్యాసము చేస్తే, ముఖ్య మంత్రిగారు, శాసన సభ్యుల ద్వారా సభ నోటీసుకు తీసుకునివచ్చారని వాళ్లకు అసలు postings లేకుండా చేస్తారేమోనని సందేహపడుతున్నాను. కాబట్టి సర్వీసు కమిషనువారు చాలా supreme అనే భావము యింతటిలో ఉన్నదని ముఖ్య మంత్రిగారికి తెలియచేస్తున్నాను.

తరువాత District Administration విషయము ఉన్నది. District Administration ను గురించి మొన్న సుందరయ్యగారు చెప్పారు. District Administration లో కూడా మంత్రులు వంటివారు interfere అయి, ప్రభుత్వముయొక్క కార్య కలాపాలు సక్రమముగా నడవనీయకుండా అడ్డు తగులు తూంటే, యిది ఎంతటి న్యాయము అని అడుగుతున్నాను. మొన్న సుందరయ్యగారు కొన్ని విషయాలు చెప్పినప్పుడు ముఖ్య మంత్రిగారు చాలా ఆగ్రహపడ్డారు. దానిని గురించి ముఖ్య మంత్రిగారు ఆగ్రహపడవలసినంత అవసరములేదని అంటున్నాను. ముఖ్య మంత్రిగారికి తెలిసి కొన్ని, తెలియక కొన్ని జరుగుతున్నవి. తెలిసిన వాటి విషయములో చర్య తీసుకోటానికి సిద్ధముగా ఉన్నారా అని అడుగుతున్నాను. మంత్రులను అనుసరించుకొని ఉండడమువల్లనే administration లో అక్రమాలు చాలా జరుగుతున్నవి. సుందరయ్యగారు మొన్న ఒక instance తీసుకుని వచ్చి చెప్పారు. నెల్లూరు జిల్లాలో ఏ విధముగా interference జరిగిందిన్నీ, అందులో వారు ముఖ్య మంత్రిగారికి సంబంధించిన వారు. వారివల్లనే interference జరిగిందని చెప్పారు. ఇదే విధముగా ప్రతి జిల్లాలోనూకూడా జరుగుతున్నది ఆ నాడు బుచ్చిరెడ్డిపాలెములో జరిగిన incident కేవలము కమ్యూనిస్టులవల్ల జరిగిందని అభాండము వేయడము అక్రమము, అన్యాయము. ముఖ్య మంత్రిగారు మాదిరి నేను కూడ కమ్యూనిస్టులకు వ్యతిరేకినే కాని ఏదైనా సిద్ధాంతమునకు వ్యతిరేకముగా మాట్లాడడముఅంటే, అందుకు నేను ఒప్పుకోను. ముఖ్యమంత్రిగారు అభిప్రాయ పడుతున్నది నిజంగా వాస్తవము కాదు. నేను ఆ విషయము పూర్తిగా విచారించాను, అది కమ్యూనిస్టులవల్ల జరిగిందికాదని నేను గట్టిగా చెప్పగలను మంత్రులుగా ఉండి, మీరు మీ బంధువులు, స్నేహితులు administration లో interfere అయి చేసేపనులవల్ల, ఆ విధమైన incident జరిగిఉంటే ఉండవచ్చును కాని, కమ్యూనిస్టులవల్ల జరిగిందని అనుమానించడము వారిమీద అభాండము వేయు డము భావ్యముగాలేదు. అటువంటి అనుమానము ముఖ్యమంత్రిగారికిఉంటే, అట్టి అభిప్రాయమును తగ్గించుకోవలసిందిగా మనవిచేస్తున్నాను అటువంటి అన్యాయమైన అభాండాలు కమ్యూనిస్టులమీద వేయడము సబబుకాదు. ప్రభుత్వంలో యిన్ని అవకతవకలు ఉన్నందున, యీ Supplementary Demands ను నేను వ్యతి రేకించడమే కాకుండా, మేము తెలియజేసిన విషయాలను సక్రమంగా విచారించి, తగినచర్య తీసుకోవాలని కోరుతూ, యింతటితో విరమిస్తున్నాను.

**MR SPEAKER :—I take it that cut motions are not moved, as per our understanding yesterday. The Hon. Chief Minister will reply now and the Demands will be put to vote.**

THE HON. DR. B. GOPALA REDDI :—అధ్యక్షా, ఈసంవత్సరము యీ సభలో మనమందరము ఒక ప్రత్యేకమైన విధానాన్ని అనుసరించాము. ఈ Supplementary Demands విషయములో రెండుదినములుగా general discussion చేసుకుంటూవచ్చాము. అసలు మామూలుగా యీ Demands ను గురించి ఒకదినముమాత్రము చర్చించి, రెండవదినము Demands ను move చేయడము, దానిమీద cut motions వగైరాలు move చేయడము, యిటువంటి విధానము అవలంబించేవారముకాని యీనాడు అట్లు జరగలేదు. ఇదివరకు మనము అవలంబిస్తున్న విధానమే ఉత్తమమైనదిగా ఉండేమోననిపిస్తున్నది.

MR. SPEAKER :—There are no cut motions now.

THE HON. DR. B. GOPALA REDDI :—అయితే ఇదికూడ ఒక సదుపాయముగానే ఉన్నది. కాని మొత్తముమీదచూస్తే, యింతకుముందు ఉన్న పద్ధతే బాగున్నదని నా అభిప్రాయము అసలు main budget మీదకూడ general discussion 4 దినములు జరిగింది. Demands మీద 12 దినములు చర్చ జరిగింది. ఇంకా రెండుదినములు Demands మీద చర్చ జరగబోతున్నది. మరల Appropriation Bill మీద ఒకదినము చర్చ జరగబోతుంది.

అటుతరువాత Supplementary Demands మీద రెండు దినములు చర్చ జరిగింది. Planning మీద 3 దినములు చర్చజరుగుతున్నది. ఈ చర్చలలో ఒకదానికి, యింకొకదానికి తేడాలుయేమీ నాకు కన్పించడములేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఈ discussion లో శాసనసభ్యులు ఎంతశ్రద్ధగా పాల్గొంటున్నారో, ప్రభుత్వపరిపాలన ఎంత జాగ్రత్తగా నడిపించటానికి తోడ్పడుతున్నారో విశదమవుతున్నది.

THE HON. DR. B. GOPALA REDDI :—అది విశదము అవుతుందో లేదోగాని ఒకవిషయము మాత్రము విశదమవుతున్నది. అది తప్పుఅని నేను చెప్పడములేదు. కాని Supplementary Demands, Planning budget, general discussion మీద, అన్నింటి విషయములోనూ, ఒకేవిధమైన చర్చ జరుగుచున్నది. తేడాలతో జరగడములేదు దానికి నేను ఆక్షేపణచేయడములేదు. కాని మా జిల్లాలో అదిలేదు, మన రాష్ట్రములో ప్రజలకు యింకా ఎన్నో జరగవలసిఉన్నవి, వారు యింకా ఎన్నో ప్రభుత్వమునుంచి ఆకాంక్షిస్తున్నారు, ఇంకా యింతవరకు ప్రభుత్వము ఏమీ చేయలేకపోయిందేమి, అనేటటువంటి యితిహాస పూర్వకమైన చర్చలు మాత్రము కనబడుతున్నవి ఈనాడు రామచంద్రారెడ్డిగారు

రాయలసీమ విషయములో మాట్లాడారు. ఇంకా కొంతమంది హాస్పిటల్సును గురించి మాట్లాడారు. కొందరు రోడ్లనుగురించి మాట్లాడారు. ఇవి అన్నీ చూస్తుంటే, మనము యింతవరకు ప్రథమ పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుకున్నాము. ఇప్పుడు ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ప్రభుత్వము ప్రారంభించబోతున్నది. కాని మనము యింకా ఎన్ని యోజనాలమైళ్ల దూరము పోవలసిఉన్నదో, మన ప్రజలకందరికి సంతృప్తికరమైన పనులు చేయటానికి, సరియైన హాస్పిటల్సు పెట్టటానికి, సరియైన రోడ్లు వేయటానికి, నీటివసర్లు ఏర్పరచటానికి, యింకా ఎన్నాళ్లు పడుతుందో వాటినన్నింటిని ఏర్పాటుచేసుకోటానికి ఎన్ని వేలకోట్ల రూపాయలు కావలసి ఉంటుందో, అవిఅన్నీ మనము, ప్రజలు అందరూకూడ ఆలోచించవలసియుంటుంది.

అనేకమంది ఈనాడు irrigation విషయంలో చెప్పినారు. మా scheme లన్నిటికి ఎన్నాళ్ళ క్రిందటనో investigation ఐనది. అవన్నీ కాలేదే, అనే ఆతృతతో చెప్పినారు. రమణారెడ్డిగారు దర్శిలో 4, 5 సంవత్సరాలుగా చిన్న చెరువు ఒకటి repair చెయ్యమంటే ఆ కాగితం ఇక్కడికీ అక్కడికీ తిరుగుతోంది కాని పనేమీ జరగలేదని చెప్పినారు. ఇంకా మా స్కీములు జరగలేదని కొందరు చెబుతున్నారు. ఈ మాదిరిగా అనేకమైన నీటి పారుదల సౌకర్యాలను గురించి చెబుతున్నారు. Planning Commission వారిచ్చిన లెఖ్ఖ ప్రకారం 350 కోట్ల రూపాయిలుంటే గాని ఆంధ్ర దేశంలో ఉన్నటువంటి ఈ water potential అంతా సద్వినియోగం చేసుకోడానికి వీలులేదని వారు వ్రాశారు. 350 కోట్ల రూపాయిలు మనకున్నట్లయితే పెద్దపెద్ద స్కీములు, చిన్న స్కీములూ రాయలసీమ లోని అన్ని స్కీములూ, వంశధార project లాంటివన్నీ నిర్మించడానికి వీలవు తుంది. ఎప్పటికి మనం ఈ 350 కోట్ల రూపాయిలు సంపాదించగలం ? ఎన్ని పంచవర్ష ప్రణాళికలు కావలెనో అదికూడా మనం ఆలోచించుకోవలసి యుంటుంది. రాస్తాల విషయంకూడా నాకు తెలుసును. ముఖ్యంగా delta లలో ఉన్నటువంటి రాస్తాలు ఈనాడు చాలా దౌర్భాగ్య స్థితిలో ఉన్నవి. దాన్నిగురించి జిల్లా బోర్డు Special Officer ల మీద అభాండంవేస్తే ఏమీ ప్రయోజనం లేదు. ఈ Highways department ని అనీ ప్రయోజనంలేదు. వీటన్నింటికీ ముఖ్య కారణం ఆర్థిక అభావంతప్ప వేరే కారణంలేదు. ఆ బాధ్యత అంతా మేమే తీసుకుంటున్నాము. ఈనాడు రోడ్లు దౌర్భాగ్యస్థితిలో ఉన్నాయంటే దానికి కారణం వాటికి సరియైన ద్రవ్యం మనం ఇవ్వలేకుండా పోతున్నాము. ఇంక ఈనాడు ఆసుపత్రులలో మందులు లేకుండా పోతున్నాయంటే నిజమే, నాకు తెలుసును. [illegible] ధర్మాసుపత్రి [illegible] [illegible] ఆసుపత్రిలో, [illegible] [illegible]

చెప్పారు పాపం ఎంత కష్టమో చూడండి. ఒక వెనుకబడిన జిల్లాలో, వెనుకబడిన తాలూకాలో ఒక ఆసుపత్రి ఉండడం, దానిలో మందులు లేవంటే ఎన్ని మంచి మాటలు చెప్పినా ఎన్ని పైపూతలు చేసినప్పటికీ మందులు లేకుండా రోగాలు నివారణకావు. అవన్నీకూడా నాకు తెలుసును మన ఎలిమెంటరీ స్కూలు బిల్డింగులు ఎటువంటి దుస్థితిలో ఉన్నాయో అదికూడా నాకు తెలుసును. మంచి నీళ్లు లేనటువంటి ప్రదేశాలు రాయలసీమలో అనేకం ఉన్నాయి అవన్నీ కూడా వాస్తవమే. ఎవరూ కాదనడానికి వీలులేదు ఇవన్నీకూడా నైసర్గికంగా ఉన్నాయో, లేక ఇంతకాలం పరిపాలనలో జరిగిన వాటికన్నిటికీ మనం వారసులమైనామో చెప్పలేకుండా ఉన్నాను. ఈ దుస్థితికి, ఈ దౌర్భాగ్యానికీ, ఈఋణగ్రస్థతకు, ఈ అవిద్యకూ, ఈ అనారోగ్యానికీ మనం వారసులమైనాము ఇన్ని శతాబ్దాలనుంచి పరిపాలన జరిగిన తరువాతకూడా ఇటువంటి దౌర్భాగ్యస్థితి మన రాష్ట్రంలో ఉన్నదంటే, దానికి మనమందరంకూడా విచారించవలసినదే. ఈ రెండు దినాలనుంచీ ఇవన్నీ వింటూఉంటే, నాకు మన ఆర్థిక సౌభాగ్యాన్ని వృద్ధిచేసుకోవాలనే ఆతురత కల్గుచున్నది. మనంపన్నులువేస్తే రైతులమీద పడుతుంది, వ్యాపారస్థులమీద పడుతుంది, అని ఊరికే భయపడి ప్రయోజనంలేదు. మనకు కావలసిన ఆర్థిక స్తోమతు సమకూర్చుకుని కాస్తోకూస్తో ఈ అశోకర్యాలన్నిటినీ తొలగించడానికి పూనుకోవాలనే నిశ్చయం ఈ రెండు దినాల చర్చవల్ల నాహృదయంలో కల్గింది. ఈ రెండు దినాల నుంచి budget పైన జరిపిన general discussion లో మాదిరిగానే అనేక విషయాలను గురించి చెప్పినారు. చాలావఱకూ 100 కి 90 పాళ్లు ఉద్యోగస్థులు ఉపేక్షచేస్తున్నారనీ, వాళ్ళలో లంచగొండితనం పెరిగిపోతోందనీ చెప్పినారు. వీటన్నింటికీ కావలసిన ధనం మనం సమకూర్చుకోవాలి. మనం ఇంకా ఎంతో త్యాగం చెయ్యడానికి సిద్ధమై పన్నులు భరించడానికి సిద్ధంగా ఉంటే తప్ప ఇవన్నీ నివారణ అవడానికి వీలులేదు. ఇప్పుడు రామచంద్రారెడ్డిగారు కష్టాలన్నీ ఎక్కువ feeling తో చెప్పినారు. ఒకరిమీద అభాండాలు వెయ్యాలనికాదు. గవర్నమెంటుమీద నిందలుమోపే ఉద్దేశ్యంతోకూడా ఆయన చెప్పారనుకోవడంలేదు. "ప్రజలు మమ్మల్ని ప్రతినిధులుగా పంపించినారు. వారి కష్టాలు మేము చెప్పవలసిన బాధ్యత యున్నది. అవి తీర్చవలసిన బాధ్యత ప్రభుత్వంపై యున్నది" అని ఆయన చెప్పినప్పుడు నేనేమీ అనడానికి వీలులేదు. అవన్నీ ఎన్నాళ్ళనుంచో జరగకుండా ఉండిపోయినాయి. ఇప్పుడైనా మనం కొంత ప్రయత్నం చేసి వచ్చే 5 లేక 10 సంవత్సరాలలో ఏదో కొంత చేయడానికి ప్రయత్నం చేస్తామని చెప్పడంతప్ప, వెంటనే చేస్తామనిచెప్పడానికి వీలులేకుండా ఉన్నది.

ఇప్పుడు చూడండి. ఒకవంక శ్రీకాకుళంవారు మా జిల్లా వెనుకబడినజిల్లా, మాకేమీ అభివృద్ధిజరగలేద నేమాట వారు పదేపదే చెబుతున్నారు. అల్లూరి బాపినీడుగారు మాట్లాడుతూ West Godavari District లో ఈ 12 మాసాలలో ఏమి చేశారో చెప్పండి ? ఏమైనా నీటిపారుదల స్కీములు అమలుజరిపినారా, మాకు ఏమీ చేయలేదని వారు చెప్పినారు. ఎవరి నియోజకవర్గాలను గురించి వారు చెప్పినారు. ఎక్కడో నందికొండ కడుతున్నాము. ఎక్కడనో మాచిఖండు కట్టామని చెబితే చాలదు. మాకు ప్రత్యక్షంగా కనబడే విషయాలలో మీరు ఏమి చేసినారని ప్రతి వారూ పదేపదే అడుగుతున్నారు వీటన్నింటికీ సమాధానం ఏమిటంటే ఈ పంచ వర్ష ప్రణాళిక ఇంకా ఎక్కువ జయప్రదంగా సాగించి ఎక్కువ ధనసహాయం పొందే టట్లు మనం చేసుకుంటే తప్ప వట్టిమాటలతోగాని, ఆక్రోశంతోగాని, ప్రార్థనలవల్ల గాని జరిగేటటువంటి విషయాలుకావు మనమంతా కష్టపడి పనిచెయ్యాలి. Engineer లకు వారికి కావలసిన ధనం ఇచ్చి పనిచేయించుకున్నప్పుడు ఏమైనా జరుగుతుందికాని లేకపోతే ఏమీ జరగదు. Electricity కావాలని అనేకమంది కోరుతున్నారు. ఈ Electricity Department లో మనం చేయుచున్న పని సగర్వంగా చెప్పుకోతగియున్నది. పోయిన సంవత్సరం 7 కోట్ల రూపాయలు ఈ Electricity Department మీద ఖర్చయింది. ఈ సంవత్సరంకూడా 6 కోట్ల రూపాయిల చిల్లర ఖర్చుకాబోతూయున్నది. ఈ Electricity Department మీద Chief Engineer సోమయాజులుగారు ఎంత ఖర్చుపెడుతున్నారో అన్ని కష్టాలు మా ways and means position లో వస్తున్నాయి. వాళ్లు ఈ సంవత్సరంకూడా ఎన్నో తాఖీదులు పంపుతున్నారు. "నీ బడ్జటు ఎలాటుమెంటు నీవు exceed కాకూడదు" అని. ఐనా Electricity Department లో మళ్ళీ 20 లక్షల రూపాయిలవఱకూ exceed అవుతున్నారు. ఎక్కువ పని జరిగినకొలదీ ఎక్కువ గ్రామాలవారు సంతోషపడుతున్నారు. ఎక్కువ లాభంకూడా వస్తున్నది. ఇక్కడ మా Finance department వారు ways and means position ను చూచేసరికి ఈ Electricity Department వారు ఎన్ని తాఖీదు లిచ్చినప్పటికీ కూడా ఎందుకు వారు allotment exceed అవుతున్నారనే భయం ఒకటి వేస్తున్నది. ఎందుకంటే, మాకు ప్రతిదినం Government of India నుంచీ, Reserve Bank నుంచీ తాఖీదులు వస్తున్నాయి. 'మీ ways and means position ను బట్టి Reserve Bank దగ్గరనుంచి 80 లక్షలకన్న మీరు ఎక్కువ తీసుకొనుటకు వీలులేదు, ఆ contract మీరు ఉల్లంఘిస్తున్నారు, పోయినసంవత్సరం చాలా దినాలు మీరు Reserve Bank దగ్గరనుంచి over draft చాలాఅడిగారు, అది న్యాయం కాదని' చెప్పారు. Latest తాఖీదులో

Dr. B. Gopala Reddi] [26th March 1956

దేశ్‌ముఖ్ గారు "మీరు ఈమాదిరిగా ఈ over draft దీర్ఘకాలం ఉన్నట్లయితే మీయొక్క bills మేము honour చేయడానికి వీలులేకుండా పోతుందేమో" అనే టటువంటి threat కూడా ఇచ్చారు. Threat కాదది. వాస్తవంకూడా. మీ జీతాల cheque ను honour కాకుండా పోవచ్చు. మన Chief Engineers ఇచ్చిన bills honour కాకుండా పోవచ్చు. వారు ఎటువంటి పరిస్థితులలో ఆమాట చెప్పినారో ఆలోచించండి. మనమీద సానుభూతిలేకుండా మనకు కష్టం కలుగజెయ్యాలి, మనగొంతు పిసకాలి అనే ఉద్దేశ్యంతో వారు చెప్ప లేదు. మన State Government కు కావలసినటువంటి ఆర్థికస్తోమతును కల్గ జేసుకోవలసిన బాధ్యత మనమీద ఉన్నది. కేవలం ఏ దేశముఖ్ గారిమీదనో, ఏ రామారావుగారిమీదనో ఆధారపడితే ప్రయోజనంలేదు. మనస్థితి పునరాలోచన చేసుకోవలసిన అవసరం వస్తుంది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన ఈ $2\frac{1}{2}$ సంవత్సరాలలోనూ మనం దాదాపు 11 కోట్ల రూపాయిలు revenue deficit క్రింద ఏర్పడింది. ఇది వ్యాయం కాదు. ఇది కాకుండా capital expenditure క్రింద ఇంకా అనేక కోట్లరూపాయిలు మనం open marketలో సంపాదిస్తున్నాం. లేక Government of India వారి దగ్గర సంపాదిస్తున్నాం. ఈ $2\frac{1}{2}$ సంవత్సరాలకాలంలో మన యొక్క అప్పు దాదాపు 40 కోట్ల రూపాయిలకన్న ఎక్కువయిందని చెబుతున్నాను. దాదాపు 30 కోట్ల రూపాయిలు మనం మదరాసునుంచి విడిపోయినప్పుడు మనకు అప్పుంది. March 31 వ తేదీనాటికి 70 కోట్ల రూపాయిలు కాబోతూఉంది 40 కోట్ల రూపాయిలు అప్పుతెచ్చి ఈ $2\frac{1}{2}$ సంవత్సరాలలో మన కార్యక్రమాలు సాగించాం. ఇంత సాగించినప్పటికీ మహాసముద్రంలో ఇంగువ పోసినట్లుగా ఏమీ కనబడడంలేదు. నిజమే. ఆవిషయం నేనూ కాదనడంలేదు. ఎందుకంటే అంత దౌర్భాగ్యస్థితిలో, ఎక్కడనో పాతాళ లోకంలో ఉన్నటువంటి వాటిని పైకి తీసుకు రావాలంటే కొన్నివందల కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టాలి. ఈ 7 కోట్లు ఖర్చు పెట్టాం. 8 కోట్లు పెట్టాం అంటే ఇది ఎందుకూచాలదు. దీనికి Short-cuts ఏమీలేవు. మనం plan లు వేసుకుని దానికి కావలసిన ద్రవ్యం సంపాదించుకుని మనం పని చేసుకోవాలి. కేవలం కేంద్ర ప్రభుత్వంమీద ఆధారపడి కూడా ఏమి ప్రయోజనం లేదు. దానికి కావలసిన త్యాగం చేయడానికి మనం సంసిద్ధంగా ఉంటేనే, ప్రజల కోర్కెలన్నీ తీర్చగలుగుతాం కాని, ఇంకో మార్గం లేదు. ఈ విషయాలు మనం దీర్ఘంగా ఆలోచించుకోవాలి. మీరు ప్రజలయొక్క కష్టాలూ, వాటి కోర్కెలను గురించి చెబుతున్నారు జిల్లాలలో జరిగే వ్యవహారా లన్నీ చెబుతున్నారు. దానికి సమాధానంగా నేనుకూడా నా జవాబుదారీని repeat చేసుకోవలసివస్తోంది. పరిపాలనలో ఉండే అపోకర్యాలు మనం తీర్చుకోవాలి.

మనం ఎక్కువ ఆసుపత్రులు పెట్టించుకోవాలి. మందులు ఎక్కువగా supply చేస్తుకోవలెను ఎక్కువ school బిల్డింగులు కట్టుకుని, ఎక్కువమంది teachers ని వేసుకోడానికి మనం ప్రయత్నంచేయాలి. ఈ పనులన్నీ వట్టి మాటలతో ఆవేశంతో, ప్రార్థనలతో లేక నమాజ్ లతో జరిగేదికాదు. ధనంలేకుండా జరగదు. కష్టపడి పనిచెయ్యాలి. దీక్షవహించి దీనికి కావలసిన సదుపాయాలు మనం సేకరించుకోవలసి యుంటుంది. నేను బాపినీడుగారికి చెప్పినా, శ్రీకాకుళం స్నేహితులకు చెప్పినా, రాయలసీమ స్నేహితులకు చెప్పినా ఒక్కటే విషయం. ఈనాడు తాబేలు నడక తోనే మన పని జరుగుతూ ఉండవచ్చును. లేదని అనను. ఈ తాబేలు నడక మార్చి కుందేలువలె నడవడానికి ఏమి ప్రయత్నం చేయవలెనో అది మనం అన్వేషించాలి. ఆ ప్రయత్నమే ఈ నాడు జరుగుతోంది. మన ప్రజలు ఉత్సాహం ప్రదర్శిస్తున్నారు. త్యాగం చెయ్యడానికికూడా పూనుకుంటున్నారు. ఈ local development works లోనూ, ఇతర సమాజ కార్యక్రమాలలోనూ ప్రజల సహకారం అనుకున్న దానికన్న ఎక్కువగా లభిస్తోంది. ఇది చాలా సంతోషించవలసిన విషయం. వారందరకూ నా అభినందనలు. ఈ మాదిరిగా ప్రజల సహాయాన్ని అన్ని విధములా సంపాదించి సర్వతోముఖమైన అభివృద్ధి మనం సాధించగలిగినప్పుడే మనం కొంత చేయగలిగామని చెప్పుకోడానికి వీలవుతుంది గాని లేకపోతే budget లు, ఈ సప్లిమెంటరీ demands ఇవన్నీ వస్తూఉంటాయి Pass అవుతూ ఉంటాయి. నెమ్మదిగానే నడుస్తూ ఉంటుంది. వీటిని సత్వరంగా చేసుకోవాలంటే ప్రభుత్వాన్ని విమర్శించి ప్రయోజనంలేదు. అసలు మూలసూత్రాలను గమనించి ఆ మూలలోగానికి మనం మందు వేయవలసియుంటుంది

ఈ Supplementary Demands ను సంవత్సరం అంతంలో తీసుకురావడం శాసనసభకు న్యాయంకాదని అంటున్నారు. ఈ విషయం ప్రతి అసంబ్లీలోను వస్తునదే. మద్రాసు అసంబ్లీలో supplementary demands తీసుకువచ్చినప్పుడు కూడా ఇదే విమర్శవచ్చింది. రామకృష్ణరాజుగారు విపులంగా మాట్లాడారు. పోయిన సంవత్సరం డిశంబరులో budget తయారవుతుంది. ఆ నాటి పరిస్థితు లనుబట్టి ఆనాడు investigation జరిగినదానినిబట్టి కొంత budget allotment చేస్తారు. ఒకసారి budget allotment అయిన తరువాత ఏ విషయం గవర్నమెంటువారు ఆలోచించకూడదు; వచ్చే budget వరకు paralysis వచ్చి నట్లు వర్తించాలంటే ఏ ప్రభుత్వానికి సాధ్యంకాదు. డిశంబరు తరువాత ఏ విషయాలను ప్రభుత్వం ఆలోచించకూడదు; budget లో ఉన్నపనిచేస్తాము; లేకపోతే లేదు అని చెప్పి ఊరుకోవడమా ?

SRI R. B. RAMAKRISHNA RAJU :—May I explain, Sir, with your permission. It is not at all my wish that the Government should suffer from paralysis What I said was this. I showed a number of instances where the Government have brought in a number of new services from January to October 1955. Is it not possible for the Government to ask for supplementary grants in July last when we met ? Cannot they ask in August or November ? The Government have got full power to come forward with new services and nobody can deny it. But, can they not tell us before hand, 'these are the new services we have in hand and this is the amount we require '? That is all my complaint. It is not my idea that the Government should keep quiet with folded hands.

Then, the Hon. Chief Minister and Finance Minister is never tired of saying 'that we want money'. Everybody agrees that we want money. But the question is what we should do to get money. The Hon. Chief Minister says : "You give money and I will do a thing." But, what I say is. "You do something to catch the imagination of the people and to enable us to go and tell the people 'this is what our Government is doing for you ; we have brought so many lakhs of rupees for your roads, schools and colleges , so, you give money '." Therefore, which should come first is only my complaint. The Government are now taking Rs 15·0 crores for capital expenditure Can they not spare Re. 1·0 crore for roads, at Rs. 10 0 lakhs for each of the 11 districts? Let the Government do that and I promise that I will get all the money that they want.

THE HON. Dr. B. GOPALA REDDI :— Homeopathic medicine మాదిరిగ ఉన్నదే, మీరు చెప్పేది! కోటి రూపాయలు రోడ్లమీద ఖర్చుచేస్తే అన్నిరోగాలు నివారణ చేస్తామని రాజు గారు చెప్పడం చాలా సంతోషము యిన విషయం. అదిచేయడానికి కష్టంలేదు. కాని అంత సులభమయిన విషయంకాదు. Electricity మీద హెచ్చు ఖర్చు పెడుతున్నాము అంటే irrigation కన్న electricity మీద ఎక్కువ return వస్తుంది. అయితే priorities fix చేసుకో

పడం ఇబ్బంది అవుతోంది. పోయిన సంవత్సరం 7 కోట్లు ఖర్చుచేశాము అంటే సామాన్యమైన విషయంకాదు. Budget allotment 5 కోట్ల చిల్లరమాత్రమే ఉంటే 7 కోట్ల రూపాయిలు ఖర్చుచేసి 5 సంవత్సరాలలోఉన్న shortfall అంతా పూర్తి చేయడానికి department వారు ప్రయత్నం చేశారు. ఒక రకంగా సంతోషిస్తున్నాము. మరొక రకంగా కష్టంగాఉన్నది. రోడ్లు చాలా దౌర్భాగ్యమైన స్థితిలో ఉన్నాయని నాకు తెలుసును. రోడ్లమీద immediate return రాదు. సమాజానికి చేసే సేవఅయినప్పటికి దానికివచ్చే వడ్డీలులేవు కాబట్టి low priorities ఇస్తున్నాము. సాధ్యమయినంతవరకు జిల్లాబోర్డు రోడ్లను high ways రోడ్లుగా చేయడానికి ప్రయత్నం చేయవలసిందే. Supplementary demands సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో ఎందుకు తీసుకురాకూడదని అడిగారు. Supplementary demands రెండు రకాలుగా తెస్తున్నారు. సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో కేవలం new schemes క్రింద మాత్రమే తెస్తున్నారు. సంవత్సరం అంతంలో తీసుకువచ్చే demands లో ఏ స్కీములక్రింద excess expenditure అయినది, ఏ స్కీములక్రింద saving ఉంటున్నది తెలిసినతర్వాత తీసుకువస్తారు. Excess expenditure కు మాత్రం supplementary demands తీసుకువస్తున్నాము. సెప్టెంబరు, అక్టోబరులో తెచ్చేవి new saving schemes. మార్చిలో బడ్జెటుతోపాటు తెచ్చేవి excess expenditure కు సంబంధించిన స్కీములు. మార్చి ఆఖరుకుకాని అందాజ్ గా ఎంత saving ఉంటుందో, ఎంత excess expenditure ఉంటుందో తెలియదు. New service schemes గురించి అసెంబ్లీకి చెప్పకూడదా అన్నారు. 10, 12 స్కీములు వచ్చినతరువాత ఒక గుచ్ఛంగా, ఒక bunch గా తీసుకురావడం పరిపాటి. ప్రతిస్కీమును తీసుకువచ్చి దానికి ఒక demand, దానిపై general discussion, cutmotion ఇవన్నీ జరపడం సాధ్యంకాదు. అలా అయితే business of the house సాగించడానికి వీలుకూడా కాదేమో. ఎప్పుడు పడితే అప్పుడు అసెంబ్లి సమావేశాలు ఉండవు. 6 నెలలకు ఒకసారితీసుకురావడానికి ప్రయత్నం చేస్తున్నాము. నిన్న సుబ్రమణ్యంగారుకూడా మద్రాసు అసెంబ్లీలో ఇదే జవాబు చెప్పవలసివచ్చింది. దీనికన్న పెద్దమొత్తం అది. కేంద్రంలోకూడా ఇటువంటిదే వస్తోంది. 30, 40 కోట్లువరకు పోతుంది. మనం ఒక అసాధారణమైన పరిస్థితిలో వున్నాము. అసాధారణమయిన expenditure జరిగించవలసి యున్నది. రెండుకోట్లు excess expenditure జరుగుతున్నదిఅంటే 3కోట్ల చిల్లరమాత్రమేకోరుతున్నాము ఇదిమంజూరుచేయాలని కోరుతున్నాము.ఇది అసెంబ్లీని న్యూనతపరచడంకాదు. ముందే అంగీకారం ఎందుకు తీసుకోలేదు; ఇది post mortem examination మాదిరి ఉన్నది అంటే సరికాదు ఈ విషయములో గౌరవసభ్యుల సానుభూతి పూర్వక

మైన ఆమోదాన్ని నేను కోరుతున్నాను. Forest Department మొదట వున్నదికాబట్టి అందరికన్ను దానిమీద పడింది. ఇందులో ఉండే ఇబ్బందులు నాకు తెలుసును. ఎల్లమందారెడ్డిగారు చెప్పారు. కనిగిరిలో Conservator మొదలయిన వారితో conference పెట్టి taken over estates లో పరిస్థితిని విచారించాలని అనుకుంటున్నాము. Time లేక జరగడంలేదు. ఇంత ఖర్చు జరుగుతోంది అంటే కేవలం క్రొత్త ఉద్యోగులు, క్రొత్త Conservator అవసరమా అని కొందరు చెప్పారు. కొన్ని చోట్ల contractors కాకుండా departmental గా exploit చేస్తే లాభం ఉంటుందనే ఉద్దేశంతో ఆమాదిరి చేస్తున్నాము. Contract కు ఇచ్చినదానికన్న ఎక్కువ ఆదాయం వస్తుంది. కొన్నిచోట్ల experiment చేస్తున్నాము. Old manuals revise చేయడానికి కొంత అవుతోంది Working plans లేనిదే Forest Department పని చేయడానికిలేదు. ఈ సంవత్సరం ఎన్నివందల ఎకరాల్లో నాటాలనే విషయం ఒకరు పని చేస్తుంటేనే కాని మామూలు Regional Conservators చేయలేరని, ఒకరని ప్రత్యేకం ఇందుకుగాను appoint చేశాము Working plans కు ఇచ్చిన priority చాలా ఉన్నది. వారు చేసేపని వల్లనే 20, 30 సంవత్సరాలలో అడవులు సమృద్ధి కావలసియున్నది. ఇది దుర్వినియోగమైన ఖర్చు కాదు. ఈ ఖర్చుకూడా న్యాయమైన ఖర్చు తప్ప మరొకటిలేదు రమణయ్యనాయుడుగారు separation of the judiciary from the executive గురించి చెప్పారు. చేయాలని మాకు కూడా ఉన్నది. ఎనిమిది జిల్లాలలో చేసిన తరువాత మూడు జిల్లాలలో చేయరాదనడం సరిఅయినదికాదు. East Godavari లో అమలు చేద్దామని లెఖ్ఖలు work out చేస్తే లక్ష 50 వేలు రూపాయిలు అదనంగా ఖర్చు అవుతోంది. West Godavari లో పెట్టారు. కృష్ణా, గుంటూరులు వున్నాయి. Reform మంచిదికావచ్చు. మొదటినుంచి కాంగ్రెసు చెబుతూవచ్చినదే. అయితే ఇప్పుడు ఉండే కరువులో అధిక మాసము మాదిరిగా నెత్తిన పెట్టుకోడమా, కొంచెం వాయిదా వేసుకోవడమా అన్నదే ప్రశ్న. మూల సూత్రాన్ని అందరూ అంగీకరించారు. ఖర్చు ఎక్కువ అవుతోంది. కాబట్టి వాయిదా వేసుకోవలసి వచ్చింది.

Proper Budgetting చేస్తూ ఉంటే ఈ Supplementary Demands రావు అని వెంకటసుబ్బయ్యగారు చెప్పినారు. దానికి ఇదివరకు నేను సమాధానము చెప్పినాను. Proper గా బడ్జటును తయారుచేయడానికి ప్రయత్నముచేస్తూ ఉంటారు గాని అనుకోనటువంటి విషయాలు వస్తూఉంటవి. కొన్నికొన్ని డిపార్టుమెంటులకు సంబంధించి బడ్జటు ఆఖరువరకు మేము ఏమీ తీసుకోనవసరములేదు అని అప్పని

చెయ్యడానికి వీలులేదు అని చెప్పకుండా ఎప్పుడెప్పుడు వస్తే అప్పుడు మంజూరు చెయ్యడానికి ప్రయత్నములు జరిగినంతా ఉన్నవి. అందువల్ల ఎంత properగా చేసినా supplementary demands, new sanctions; ఇవి అన్నీ కూడా అనివార్యం అవుతవి. అందువల్ల మేము ఏమో ప్రత్యేకముగా చేసినామనికాకుండా మీరు ఉదారణంగా చూస్తారని నేను ఆశిస్తున్నాను.

ప్రగడ కోటయ్యగారు ఏదేదో చెప్పినారు. West Africa లో ఒక చేనేత వస్త్రముల depot పెట్టాలని చెప్పేరు. ఇవి అన్నీ చెయ్యవలసినది న్యాయమే గాని ఇవన్నీ కేంద్రప్రభుత్వం చెయ్యవలెను; మేము recommendation చేస్తాము. దానికేమీ ఆక్షేపణలేదు, అభ్యంతరంలేదు. కేంద్రప్రభుత్వంవారు ఎగుమతి, దిగుమతి విధానంలో ఎక్కువబాధ్యతతో పనిచేస్తున్నారు. చేనేతపరిశ్రమ, handloom weavers, విషయములో ఎక్కువ శ్రద్ధతీసుకుంటున్నారు. అందువల్ల ఇవన్నీ వారు సంతృప్తికరముగా చూస్తారు.

SRI S. NARAYANAPPA:—On a point of information, Sir చేనేతపరిశ్రమకు ఏమేమి చేస్తారో, ఆ విధానము ఏమిటో, స్పష్టముగా నిర్దిష్టముగా చెపితే బాగుంటుంది. చేనేతవారిని గురించి ఏఏ సదుపాయములు చేస్తారు అని అడుగుచున్నాను.

THE HON. Dr. B. GOPALA REDDI :—Budget జరిగిన చర్చ సందర్భములో వివరములను చెప్పినాను. గడచిన 1½ సంవత్సరాలలో ఆంధ్ర ప్రభుత్వం చేనేతవారికి ఏమిచేసిందో కేంద్రప్రభుత్వం ఎంత సహాయము చేసిందో, నారాయణప్పగారు కావలెను అంటె విపులముగా ప్రత్యేకముగా ఒక pamphlet అచ్చువేయించడానికి ప్రయత్నముచేస్తాము ఈ ప్రభుత్వము చెయ్యలేదు అన్నది వాస్తవముకాదు. ఈ ప్రభుత్వము సానుభూతిపూర్వకముగా మూడులక్షల మగ్గాలకు ఎంతో సహాయముచేసింది. గాని కొన్ని కొన్ని విషయాలల్లో మనకు అధికారములేనిచోట మనము అధికారము వహించడానికి వీలులేదు. అందువల్ల కొంత ఇబ్బంది కలుగుతుంది. ఈ ప్రభుత్వానికి సానుభూతిలోగాని, కృషిలోగాని ఎలాంటి అభావం లేదని, నేను మీకు చెపుతున్నాను.

ఇక మన వెంకటరత్నంగారు, కాశీశ్వరరావుగారు ఈ బుడమేరు విషయము చెప్పినారు. మళ్ళీ ఈ విషయము మేము పరిశీలించి ఏదిన్యాయముగాఉంటే అది చెయ్యడానికి పూనుకుంటాము. ఏదో జరిగిపోయింది అని ఆవేశపడవలసిన పనిలేదు. ఇంజనీర్లను పిలిపించి వరద నివారణకు ఏమిచెయ్యవలెనో, ఆ బుడమేరును ఎట్లా మళ్ళించి చేసికొనవలెనో ఆలోచిస్తాము. దీనివల్ల ఎవరికి అన్యాయము లేకుండా

చేస్తాము. ఈ విషయమై 70 సంవత్సరములనుండి అందోళన జరుగుతూ ఉన్నది అని చెప్పినారు. Diversion scheme చాలదు, Reservoir scheme కావలెనని కాశీశ్వరరావుగారు వెంకటరత్నంగారు చెప్పినారు. వారు ఏమీ అందోళన పడనవసరములేదు ఎవరికీ ఏమీ ఉద్దేశాలులేవు, అని హామీ ఇస్తున్నాను.

సుందరయ్యగారు ఇక్కడలేరు, ఆయన తరఫున వారి డిప్యూటీ లీడరు వెంకటేశ్వర్లుగారు సాక్షాత్కరించి ఉన్నారు. శ్రీ సుందరయ్యగారు ఉంటే విపులముగా చెప్పేవాడిని ఇంకెవ్వడైనా చెబుతావని నా ఉద్దేశము.

రత్నసభాపతిగారు ఒక విషయం చెప్పారు. జిల్లాల పరిపాలనలో మిత్రుల పేర్లుపెట్టి interfere అగుచున్నారని అన్నారు. ఏమి దర్యాప్తుచేసినారో ఎక్కడ నుంచి దర్యాప్తుచేసినారో, ఎవరిదగ్గరనుంచి సమాచారము పొందినారో అది నాకు తెలియదు. బహుశః వారి పార్టీ వారినుండి పొందినారేమో నాకు తెలియదు. బెజవాడ పాపిరెడ్డిగారు ఏమిచెప్పినారో నాకు తెలియదు.

SRI B. RATNASABHAPATHI :—మా పార్టీవారు కాదు. మీ పార్టీ వారే తెలియచేసినారు.

THE HON. Dr B GOPALA REDDI :—ఇది చాలా సంతోషమైన విషయము. మా పార్టీవారిదగ్గరకు information తీసుకొనివస్తున్నారు. సర్వతోముఖవిచారణరత్న సభాపతిగారు చేసినందుకు చాలా అభివందనలు కూడా. కాగిత విషయములో కేవలము D. S. P లు, Collector లు, Deputy Collector లు ఎవరో చెపితే చేస్తున్నారనడం న్యాయంకాదు. మంత్రిపేరుచేపితే Collector, D. S. P.లు చేస్తారనడం న్యాయంకాదు. Healthy habit కాదు. ఏదైనా ఒక విషయం జరిగినపుడు కుప్పలుతగలపెడితే పోలీసువారు వెళ్ళి దర్యాప్తుచెయ్యడం అవసరంలేదా? మర్డరు, రైటింగు, జరిగినా, దర్యాప్తుచేసి అనేకమందిదగ్గర సమాచారాలు పొందడానికి ప్రయత్నముచేస్తారు. కడపడికి వారి జడ్జిమెంటు ప్రకారముగా నిందితులు ఎవరైతే వారిమీద కేసులు పెడతారు. కుప్పలు మీరే తగలపెట్టుకొని మీరే Complaint చేసినారేమోనని సుందరయ్యగారు అన్నారు. ఆయన ఇక్కడలేరు. ఎవరో interfere అవుతున్నారు, ఎవరో ఏదో కేసులు పెడుతున్నారు, ఏదో పార్టీ మీద కేసులుపెడుతున్నారు అని పదే పదే చెప్పడం న్యాయంకాదు. సుందరయ్యగారు మూడు నాలుగు మాటలు చెప్పినారు. Concrete కేసులుచెప్పలేదు, ఫలానా కేసులని చెప్పలేదు ఫలానావారు అన్యాయం చెయ్య

డానికి కారణభూతులైనారని చెప్పలేదు. ఏదో vague గా గోపాలరెడ్డిగారికి తెలుసునో తెలియదో నాకు తెలియదు, తెలియకపోయి ఉండవచ్చును, కాని వారి బంధువులు ఏమిచేస్తున్నారు. ఏ కేసులో ఏమిచేసి, ఎవరికి అపకారం చెయ్యడానికి ప్రయత్నంచేసేరీతి అనేది ఇంతవరకు ఒక్కసారైనా concrete గా చెప్పలేదు. vague గా చెప్పిలేనిపోని అపవాదులు వెయ్యడం అంతగా healthy mentality కాదని చెబుతున్నాను. గవర్నరుగారిని గురించి, జెడ్జీలనుగురించి సుందరయ్యగారు చెప్పినారు. ఇది న్యాయముకాదు. పబ్లికు సర్వీసు కమిషనుగురించి రత్నసభాపతిగారు చెప్పారు. వారు చేసినదంతా అన్యాయము అక్రమము, మెరిటు ప్రకారముగాలేదు. ఆ మాదిరిగా మన గవర్నమెంటు, సర్వీసు కమిషను, హైకోర్టు కించపరచి చెప్పితేకూడా లాభములేదు. ఈ నాడు గవర్నరు constitutional head గా ఉన్నారు ఆయన కోసము రెండు కార్లు కావలసినపని లేదా? మీరు చెప్పినది చంద్రాలాలు మాధవలాలు త్రివేదిగురించికాదు. హోదా ఉన్నప్పుడు గవర్నరుగారికి కారు కావలెనా లేదా? Saloon కావలెనా పనిలేదా? వారిమీద వ్యక్తిగత ఆరోపణకాదు. Head of the state అనేభావము ఉన్నప్పుడు ఇదంతా కొంతం అవసరం. మద్రాసులో 1947 కు ముందు ఎంత bodyguard, ఎంత cavalry ఉండిందో నాకు తెలియదు. కాలక్రమం ప్రకారం ఈ expenses తగ్గించడానికి ప్రయత్నం చేస్తున్నారు second hand car ఆయనకు ఇచ్చారు అది తీసుకొని కొత్తకారు ఇచ్చినారు. గవర్నరుగారు, హైకోర్టు, Public Services commission గురించి పదే పదే చెప్పడం మంచిదికాదు. Instruction పైనుంచి సిమ్లానుండి, ఢిల్లీనుండీ వస్తవి. ఏదైనా కావలెనంటే సుందరయ్యగారు, వెంకటేశ్వర్లుగారు రావచ్చును. Finance department వారిని Accountant General ను రప్పించి వారికి ఏదైనా సమాధానము చెప్పగలము. ఏదో కుంభకోణం జరుగుతున్నదని చెప్పడం న్యాయముకాదు. నాకు చాలా సంతోషం, ఈ తడవ నాలుగు అవకాశాలలో జిల్లాలలో ఉన్నటువంటి కష్టాలు చెప్పినారు Planning విషయంలో నిన్న మొన్న చూచినాం; నిన్న 4½ గంటలు కూర్చున్నాం. మొన్న 3 గంటలు కూర్చున్నాం. ఈ దినం 3 గంటలు కూర్చుంటాం ఈ సందర్భంలో మాకున్నటువంటి [illegible] అనేటటువంటి మాట చెబుతున్నారు, ఓపిన్లు మన [illegible] [illegible] nut shell లో తెలియడానికి వీలవుతుంది. కాబట్టి [illegible] డానికి పెద్ద ప్రయత్నం చేసుకోవాలి. ఈ మహా ప్రయత్నంలో మనం [illegible] సాగుతున్నాం. కొంచెం తాబేలు మాదిరిగా సాగుతున్నాం. [illegible]

క్రమేణా యీ తాజేలును కుండేలు చేసుకుని ముందుకు పోవలసిన అవసరంకూడా ఉన్నది. ఈ నాడు Cut-motions లేవని చెప్పినారు, చాలా సంతోషం. ఒకదినం జరగవలసిన general discussion రెండు దినాలు జరిగింది. జిల్లాలలోని విషయాలన్నీ కొంత విపులంగా తెలియడానికి అవకాశం వచ్చింది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Madras కు మనకూవున్న assets and liabilities వివరాలు తెలియజేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—Division of assets and liabilities విషయంలో తుంగభద్ర project కు సంబంధించి కొంత తగాయిదా ఉన్నది. అది ayacut ను బట్టి ఉంటుంది కొంతవరకు తుంగభద్ర expenditure మనం పెట్టుకుంటున్నాం అనుకొండి రేపు ప్రొద్దున్న ayacut stabilization అయిపోయిన తరువాత ఎన్ని ఎకరాలు మనకున్నది ఎన్ని ఎకరాలు వాళ్లకున్నది లెక్కలు తేలితేనేగాని, apportion చేయడానికి వీలులేదు. అందువల్ల కొంత delay అవుతున్నది. కొదమ విషయాలన్నీకూడా సాధ్యమైనంతవరకు అయిపోతున్నాయి. 1, 2 matters ఉంటే ఉండవచ్చు. కాని యీ తుంగభద్ర ప్రాజక్టుకు సంబంధించినదే పెద్ద మొత్తం కాబట్టి apportion కాలేదు. అందువల్ల యింత ఖచ్చితంగా మనకింత రావాలి, Mysore కు యింత పోవాలి, Madras కు యింతపోవాలి అని చెప్పడానికి వీలులేకుండా ఉన్నది. కాబట్టి అది సాధ్యమైనంత వరకు చేస్తాం.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Provisionalగానైనా యివ్వడానికి వీలవుతుందా ?

THE HON. DR. B GOPALA REDDI :—నాకు తెలిసినంతవరకు నేను చెబుతున్నానుకదా, 30 కోట్ల రూపాయలు మనకు విభాగంఅయిననాటికి అప్పు ఉన్నదని యీనాడు యించుమించు 70 కోట్లరూపాయలవుతుంది. ఈ 2½ సంవత్సరాలలో 40 కోట్ల రూపాయలు పెరిగింది. కాబట్టి యింకా ఈ విషయాలన్నీ ఎవరూ చెప్పనంతగా యీతడవ యిదివరకు లేనంతమంది యీ supplementary demand మీద మాట్లాడినారు. దీనిపైనుగానికి ఎక్కువ మాట్లాడినారు. వారివారి జిల్లాల విషయాలు చెప్పినారు. అవన్నీకూడా విచారించడానికి ప్రయత్నంచేస్తాం. కాని దీనికి నేను మొదటచెప్పినట్లుగా short cuts లేవు. దీనికి రాజమార్గం మీదనే పోవాలి. ఆ రాజమార్గంమీద పోవడానికి కావలసిన సదుపాయాలు సేకరించుకుంటూపోవాలి. ఈ విషయాలు చెప్పినటువంటి గౌరవసభ్యులందరికీకూడా హృదయపూర్వక ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా, సభ్యులు అనేకమంది services విషయాలగురించి తెలియజేశారు. ముఖ్యంగా కొంత మంది subordinates కు జరుగుతున్నటువంటి అన్యాయాలగురించి చెప్పారు promotions యివ్వడంలో 43 వ స్థానంలో వున్నవారికి promotion యిచ్చి అనేకమందికి అవస్థలలో పెట్టిన ఘటనలుకూడా ఉన్నాయి. అవన్నీ విచారణచేసి యీ అన్యాయాలు తొలగించడానికి మంత్రిగారు పూనుకుంటారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఆయనకు బోలెడంత పనుంది P.W.D లో. ఈపని ఎట్లాచేస్తాడు. ఈ విషయంలో అట్టే Government ఉద్యోగస్థులు దగ్గరనుంచి సమాచారం తెచ్చుకోకుండా గౌరవసభ్యులకు తెలిసిన ఫోగట్టా ఏమయినా ఉంటే ఆలోచిస్తాం. అంతేకాని కేవలం వాళ్లను encourage చేయవద్దు మీదగ్గరకు రావడానికి అనేక విషయంతప్పు, దానిగురించి చర్చించకూడదని గాని వ్రాయకూడదనిగాని చెప్పడంలేదు. ఒకసారి రావచ్చునని చెప్పామంటే మీ life impossible అయిపోతుంది. ప్రతి teacher ను మీదగ్గరకు రానిస్తే మీ drawing room furniture చాలవు. అనేక యిబ్బందులున్నాయి. మీకు ఒక version మాత్రమే వస్తుంది.

SRI. R. B. RAMAKRISHNA RAJU:—మీకు ఒక version తెలుస్తుంది. మీకు individual instances వ్రాయమంటే వ్రాస్తాం. వారిమీద మీరేమన్నా చర్యతీసుకోకుండా ఉండేటట్టయితే individual instances వ్రాస్తాం. నిజమో అబద్ధమో విచారించండి.

THE HON. DR. B. GOPALA REDDI :—మీరు Individual cases వ్రాయండి, విచారిస్తాం. కాని వాళ్లుమాత్రం మీదగ్గరకు రాకూడదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—చర్యతీసుకుంటే మామీద తీసుకోండి వారిమీద కాదు.

THE HON. DR. B. GOPALA REDDI :—మీమీద మేమేమి చర్యతీసుకుంటాం ? ఏదయినా తీసుకుంటే I. G. of Police తీసుకోవాలి. దీంట్లో కొన్ని దురభిప్రాయాలుకూడా ఉన్నాయి. ఎప్పుడైనా కావాలంటే మనం దానిగురించి చర్చించుకోవచ్చు. Promotions విషయంలో ఎవరోమాత్ర అన్యాయం జరిగిపోయిందని చెబుతారు. అన్యాయం అయిపోయిందని, అక్రమం అయిపోతున్నదని మీరనుకుంటున్నారు మీకున్నటువంటి దురభిప్రాయం తీర్చడం కూడా Government యొక్క విధాయకం కాబట్టి ఆ విషయంలో తప్పకుండా ఏదయినా చర్యచేసుకోవచ్చు. లేకుంటే individual cases తెలిపితే తప్ప కుండా చూస్తాం. ఈ విషయంలో దురభిప్రాయాలు పడక్కరలేదనిపిస్తున్నది.

SRI S. VEMAYYA :—Confidential personnel files maintain చేయడం లో Board Standing Orders లో ఏమున్నదంటే, adverse remarks నతప్పకుండా communicate చేసి acknowledgment obtain చేయాలని ఉన్నది. కాని ఒక అధికారికూడా అలా చేయడంలేదు. ఆవిధంగా చేసేటట్లుగా ఉత్తరువులు జారీచేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—2, 3 రకాలయినటువంటి confidentials files ఉన్నాయి. నిజంగా serious గా పోతున్నప్పుడు communicate చేసి explanation తీసుకొని దానిని confidential file లో ఉంచుతారు. మామూలుగా "He is not up to the mark" ఇటువంటివి వాళ్లకు communicate కావు. ఎవరో ఒక collector వ్రాస్తే దురభిప్రాయం పడినాడనుకోంటాము. నలుగురైదుగురు వరుసగా "He is lazy" అని వ్రాస్తే ఆ నలుగురైదుగురు దురభిప్రాయపడినారని కాని గొంతుకోయడానికి వ్రాశారని కాని అనుకోడం న్యాయంకాదు. ఒకనాడు ఒక collector వ్రాస్తే వ్రాయవచ్చు. ఈనాడు మరొక collector "నేను చూచినంతవరకు smart గా ఉన్నారని" వ్రాస్తుంటారు. ఎక్కడయినా ఎప్పుడయినా ఒక officer చెప్పిందే ఎప్పుడూ చూడడు. 5. 6 మంది, over a period of 10 years 5 years, వ్రాసినా చూస్తారు. అంతేగాని గుడ్డెద్దు చేలో పడ్డట్టు confidential sheets చూచి చేస్తారనుకోడం న్యాయంకాదు. Confidential sheets ఉండడం చాలా అవసరం. 20 years hence ఒక officer చిన్నతనంలో 20 ఏండ్లక్రితం ఎట్లా వున్నాడు. వాని reputation ఎలాంటిది ? అని 25 సంవత్సరాలయి నతరువాత చూడడానికి వీలుంటుంది. ఒక officer, uniformly good officer గా ఉంటే promotion చేయడం తేలికగా ఉంటుంది. ఒక deputy collector ఏ bad mark లేకుండా ఉన్నాడనుకోండి. అప్పుడతనికి ఒక accelerated promotion రావచ్చు, అనేకమంది కొంత అనుమానాలుపడి doubtful character అని వ్రాస్తుంటే కాబోలు అని సందేహపడవలసి వస్తుంది. ఇది కొంతవరకు history of the services. Superior officers అభిప్రాయాలు దాంట్లో ఉంటాయి. serious matter ఉంటే communicate చేస్తారు. లేకపోతే communicate చేయరు. వేమయ్యగారు యీ confidential sheets ఉంటే పిలుగ్గొడ్డు అనుకుంటున్నారు. అలా అనుకోవలసిన అవసరంలేదు.

## A. EXPENDITURE ON REVENUE ACCOUNT.

### DEMAND IV—FORESTS.

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

> " That the Government be granted a further sum not exceeding Rs. 3,38,500 under Demand IV—Forests. "

MR. SPEAKER :—The question is :

> " That the Government be granted a further sum not exceeding Rs. 3,38,500 under demand IV—Forests. "

The motion was carried and the grant was made.

### DEMAND VII—GENERAL SALES TAX AND OTHER TAXES AND DUTIES.

The HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

> " That the Government be granted a further sum not exceeding Rs. 7,10,100 under Demand VII—General Sales Tax and Other Taxes and Duties."

MR. SPEAKER :—The question is :

> " That the Government be granted a further sum not exceeding Rs. 7,10,100 under Demand VII—General Sales Tax and Other Taxes and Duties. "

The motion was carried and the grant was made.

### DEMAND VIII—IRRIGATION.

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

> " That the Government be granted a further sum not exceeding Rs. 100 under Demand VIII—Irrigation. "

MR. SPEAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 100 under Demand VIII—Irrigation."

The motion was carried and the grant was made

## DEMAND X—STATE LEGISLATURE.

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move .

"That the Government be granted a further sum not exceeding Rs. 12,41,200 under Demand X—State Legislature."

MR. SPEAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 12,41,200 under Demand X—State Legislature."

The motion was carried and the grant was made.

## DEMAND XI—DISTRICT ADMINISTRATION AND MISCELLANEOUS.

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 200 under Demand XI—District Administration and Miscellaneous."

MR. SPEAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 200 under Demand XI—District Administration and Miscellaneous."

The motion was carried and the grant was made.

## DEMAND XII—ADMINISRATION OF JUSTICE.

THE HON. DR. B GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs 3,72,800 under Demand XII—Administration of Justice."

MR SPEAKER .—The question is

" That the Government be granted a further sum not exceeding Rs 3,72,800 under Demand XII—Administration of Justice "

The motion was carried and the grant was made

DEMAND XIII—JAILS.

THE HON. DR B GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move .

"That the Government be granted a further sum not exceeding Rs 90,30,800 under Demand XIII—Jails".

MR SPEAKER —The question is

"That the Government be granted a further sum not exceeding Rs 90,30,800 under Demand XIII—Jails "

The motion was carried and the grant was made.

DEMAND XIV—POLICE.

THE HON DR. B GOPALA REDDI —Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs 22,00,000 under Demand XIV—Police."

MR. SPEAKER —The question is

"That the Government be Granted a further sum not exceeding Rs. 22,00,000 under Demand XIV—Police."

The motion was carried and the grant was made.

DEMAND XV—EDUCATION.

THE HON. DR. B. GOPALA REDDI . -Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 2,24,300 under Demand XV—Education."

MR SPEAKER —The question is

"That the Government be granted a further sum not exceeding Rs. 2,24,300 under Demand XV—Education."

The motion was carried and the grant was made

DEMAND XVI- MEDICAL

THE HON. DR. B GOPALA REDDI .—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs 14,100 under Demand XVI—Medical."

MR. SPEAKER —The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 14,100 under Demand XVI—Medical"

The motion was carried and the grant was made

DEMAND XX—CO OPERATION.

THE HON. DR. B GOPALA REDDI —Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 7,57,800 under Demand XX—Co-operation"

MR. SPEAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 7,57,800 under Demand XX—Co-opertion."

The motion was carried and the grant was made.

DEMAND XXII—WELFARE OF SCHEDULED TRIBES, CASTES AND OTHER BACKWARD CLASSES.

THE HON. DR. B. GOPALA REDDI —Sir, on the recommendation of the Governor, I move .

"That the Government be granted a further sum not exceeding Rs. 2,61,600 under Demand No. XXII-Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes."

MR. SPFAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 2,61,600 under Demand No.XXII-Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes."

The motion was carried and the grant was made.

DEMAND XXIII—LABOUR INCLUDING FACTORIES.

THE HON DR B. GOPALA REDDI .—Sir, on the recommendation of the Governor, I move .

" That the Government be granted a further sum not exceeding Rs 44,800 under Demand XXIII—Labour Including Factories ."

MR. SPEAKER ·—The question is :

" That the Government be granted a further sum not exceeding Rs. 44,800 under Demand XXIII—Labour Including Factories "

Toe motion was carried and the grant was made.

DEMAND XXIV—CIVIL WORKS—WORKS.

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move .

" That the Government be granted a further sum not exceeding Rs. 25,000 under Demand XXIV—Civil Works—Works "

MR: SPEAKER :—The question is :

" That the Government be granted a further sum not exceeding Rs. 25,000 under Demand XXIV—Civil Works—Works. "

The motion was carried and the grant was made.

DEMAND XXV—CIVIL WORKS—ESTABLISHMENT AND TOOLS AND PLANT.

THE HON DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

" That the Government be granted a further sum not exceeding Rs. 52,800 under Demand XXV—Civil Works—Establishment and Tools and Plant. "

MR. SPEAKER :—The question is

"That the Government be granted a further sum not exceeding Rs. 52,800 under Demand XXV—Civil Works—Establishment and Tools and Plant."

The motion was carried and the grant was made

## DEMAND XXVI—CIVIL WORKS—GRANTS-IN-AID.

THE HON DR B. GOPALA REDDI —Sir, on the recommendation of the Governor, I move

"That the Government be granted a further sum not exceeding Rs 9,55,000 under Demand XXVI—Civil Works—Grants-in-aid"

MR. SPEAKER .—The question is .

"That the Government be granted a further sum no exceeding Rs. 9,55,000 under Demand XXVI—Civil Works—Grants-in-aid."

The motion was carried and the grant was made.

## DEMAND XXVII—ELECTRICITY

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on th recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum no exceeding Rs 100 under Demand XXVII-Electricity."

MR SPEAKER :—The question is :

"That the Government be granted a further sum no exceeding Rs. 100 under Demand XXVII-Electricity."

The motion was carried and the grant was made.

## DEMAND XXVIII—FAMINE.

THE HON. DR B. GOPALA REDDI :—Sir, on th recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum no exceeding Rs 4,00,000 under Demand XXVIII-Famine"

MR SPEAKER.—The question is

"That the Government be granted a further sum not exceeding Rs 4,00,000 under Demand XXVIII—Famine."

The motion was carried and the grant was made.

DEMAND XXIX—PENSIONS.

THE HON DR B GOPALA REDDI.—Sir, on the recommendation of the Governor, I move.

"That the Government be granted a further sum not exceeding Rs. 8 88,000 under Demand XXIX—Pensions".

MR. SPEAKER.—The question is.

"That the Government be granted a further sum not exceeding Rs. 8,88,000 under Demand XXIX—Pensions."

The motion was carried and the grant was made.

DEMAND XXXI—MISCELLANEOUS.

THE HON. DR B. GOPALA REDDI.—Sir, on the recommendation of the Governor, I move

"That the Government be granted a further sum not exceeding Rs 15,13,800 under Demand XXXI—Miscellaneous."

MR. SPEAKER ;—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 15,13,800 under Demand XXXI—Miscellaneous."

The motion was carried and the grant was made.

DEMAND XXXII—COMMUNITY DEVELOPMENT PROJECTS, NATIONAL EXTENSION SERVICE AND LOCAL DEVELOPMENT WORKS.

THE HON. DR B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 1,08,19,100 under Demand XXXII—Community Development Projects, National Extension Service and Local Development works"

MR. SPEAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs 1,08,19,100 under Demand XXXII — Community Development Projects, National Extension Service and Local Development works"

The motion was carried and the grant was made.

B OTHER EXPENDITURE

DEMAND XXXIV—CAPITAL OUTLAY ON IRRIGATION.

THE HON. DR. B GOPALA REDDI .—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs 1,39,92,200 under Demand XXXIV—Capital outlay on Irrigation."

MR. SPEAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 1,39,92,200 under Demand XXXIV—Capital outlay on Irrigation."

The motion was carried and the grant was made.

DEMAND XXXVI—CAPITAL OUTLAY OF SCHEMES OF AGRICULTURAL IMPROVEMENTS AND RESEARCH.

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 15,00,000 under Demand XXXVI—Capital outlay on Schemes Agricultural Improvements and Research."

26th March 1956]

MR. SPEAKER .—The question is .

"That the Government be granted a further sum not exceeding Rs. 15,00,000 under Demand XXXVI—Capital Outlay on Schemes of Agricultural Improvements and Research."

The motion was carried and the grant was made.

## DEMAND XXXVII-A—CAPITAL OUTLAY ON MULTIPURPOSE RIVER SCHEMES

THE HON. DR. B. GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move .

"That the Government be granted a further sum not exceeding Rs 74,00,000 under Demand XXXVII-A—Capital outlay on Multipurpose River Schemes."

MR. SPEAKER .—The question is .

"That the Government be granted a further sum not exceeding Rs. 74,00,000 under Demand XXXVII-A - Capital outlay on Multipurpose River Schemes."

The motion was carried and the grant was made.

## DEMAND XXXVIII-CAPITAL OUTLAY ON CIVIL WORKS.

THE HON DR. B. GOPALA REDDI .—Sir, on the recommendation of the Governor, I move :

" That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand XXXVIII—Capital Outlay on Civil Works "

MR. SPEAKER —The question is :

" That the Government be granted a further sum not exceeding Rs. 300 under Demand XXXVIII—Capital outlay on Civil Works. "

The motion was carried and the grant was made.

## DEMAND XXXIX—CAPITAL OUTLAY ON ELECTRICITY SCHEMES.

THE HON DR B GOPALA REDDI :—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 2,100 under Demand XXXIX—Capital outlay on Electricity Schemes"

MR. SPEAKER —The question is .

"That the Government be granted a further sum not exceeding Rs 2,100 under Demand XXXIX—Capital outlay on Electricity Schemes."

The motion was carried and the grant was made.

## DEMAND XLI—CAPITAL OUTLAY ON STATE SCHEMES OF GOVERNMENT TRADING.

THE HON DR. B. GOPALA REDDI —Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 3,30,43,100 under Demand XLI—Capital Outlay on State Schemes of Government Trading.

MR. SPEAKER —The question is .

"That the Government be granted a further sum not exceeding Rs. 3,30,43,100 under Demand XLI—Capital Outlay on State Schemes of Government Trading."

The motion was carried and the Grant was made.

## DEMAND XLII—LOANS AND ADVANCES BY THE STATE GOVERNMENT,

THE HON. DR. B. GOPALA REDDI .—Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 48,40,300 under Demand XLII—Loans and Advances by the State Government."

MR. SPEAKER :—The question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 48,40,300 under Demand XLII—Loans and Advances by the State Government."

The motion was carried and the grant was made.

MR SPEAKER :—The House will now adjourn and meet again at 5 p.m today for continuing the debate on the Second Five Year Plan.

The House then adjourned.

## III. GOVERNMENT MOTION.

### Draft outline of the Second Five Year Plan—(cont.)

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఆర్థికంగా deficit financing అనేది యుద్ధ సమయములో ప్రారంభిస్తారు. లేకపోతే అభివృద్ధి కార్యక్రమాలకు ప్రారంభిస్తారు. Deficit financing స్వత సిద్ధంగా ప్రమాదము అయినదనిగాని మహత్తరమైనదనిగాని అనడానికి వీలు లేదు. దీని నే ఆచరణలో ఆవిధంగానే వుంటుంది. Deficit financing జరుగుతున్నప్పుడు అభివృద్ధి కార్యక్రమమునకు ప్రభుత్వము కొంత డబ్బు వినియోగిస్తుంది. కొంత మంది వ్యక్తులు పెట్టుబడి పెడుతూ ఉంటారు. వ్యక్తులు పెట్టుబడి పెట్టినప్పుడు లాభం ఎక్కువ వచ్చినప్పుడు, అది ప్రజలకు ఏమీ ప్రయోజనము ఉండదు. ప్రభుత్వానికి వచ్చేటటువంటి ప్రయోజనం సర్వీసెస్ మూలంగా ఇతర కార్యక్రమములకు ఉపయోగపడుతుంది. ధరలు చాలా తీవ్రంగా పెరుగుతున్నాయి. నోట్ల ముమ్మరముకూడా జాస్తే అవుతున్నది. ఆ సమయములో జరగవలసిన పని, స్వతసిద్ధమైనటువంటి అధికారులు ఎవరుఅయితే దానిని నిర్వహిస్తారో, అది చాలా ప్రమాదము క్రింద పరిణమిస్తుందని మనం అందరమూ గుర్తించాలి. Deficit financing లో డబ్బు ఎట్లా సర్దుకోవడము అనేదానికి కొన్ని ఉదాహరణలుకూడా చెబుతాను. మొట్టమొదట మనము అందరమూకూడా కార్యక్రమములో పాల్గొనవలసిన అవసరము ఉన్నది. జాతీయ ఉద్యమాలను, రాజకీయ ఉద్యమాలను త్యాగ దృష్టితో స్వార్థములేకుండా చేయాలి. ఈనాడు దేశమును నిర్మించుకున్నప్పుడు, నిరాడంబరముతోటి, నిజాయితీతోటి, స్వార్థరహితమైనటువంటి ఆలోచనతోటి, చివర ఉన్నటువంటి సామాన్య మానవుడినికూడా, ఉన్నత స్థాయికి తీసుకువచ్చే స్థితి మనకు ఏనాడు వస్తుందో, అంతవరకు మనము చేస్తాము అని చెప్పి, అధికారులు, మంత్రులు, ప్రభుత్వము, ప్రజానీకము అందరూ కలిసినప్పుడే ఉత్సాహము వస్తుంది.

జాతీయ ఉద్యమ కార్యక్రమములలోకి ప్రజలు చాలా ఉత్సాహంగా పాల్గొన వలసిన అవసరాన్ని మనవిచేస్తాను. కార్యక్రమము ఏమి జరిగిందని నా కోరిక కాదు. దినం అంతాకూడా వాళ్లు ప్లానింగు సైకాలజీతో ఇది మనం నిర్మిస్తున్నాము అని అనుకున్నట్లయితే స్వరాజ్యం అనుకున్న రోజున రాలేదు. సోషలిజము అనుకున్న రోజున రాలేదు. దానిని నిర్మించినటువంటి విధానములో మనోతత్వము చాలా ప్రధానముగా ఉన్నది కనుక, ప్లానింగులో జరుగుతున్న పనికి, ప్లానింగు మహా తత్వానికి, ప్రచారముకూడా చాలా తక్కువగా జరుగుతున్నదని నేను మనవిచేస్తున్నాను. దానికొఱకు నేను తప్పకుండా ప్రయత్నం చేస్తున్నాను. ఉన్న శాసనసభ్యులందరూకూడా ఈ deficit financing సాధించడంలో కరవు వచ్చే పరిస్థితులు ఉన్నాకూడా ప్రయత్నం చేయాలి.

చైనాలో deficit financing తోటి వ్యవహారము చేశారు. చాంగైషేక్ గ్రూపు స్వార్థము కోసము ఎప్పుడయితే డబ్బును మాటగట్టిందో అప్పుడు బాగా దెబ్బ తిన్నారు. ఎప్పుడు అయితే ప్రజల అభివృద్ధికోసము కృషి చేశారో అప్పుడు ఉన్నతస్థాయిలోకి వెళ్లారు ఆరోజు దేశములో ఏ సిద్ధాంతము కోసము, జనం అంతా సర్వత్యాగాలతోటి ముందుకు వచ్చారో, ఆవిధంగా ఇక్కడ ఉన్న శాసనసభ్యులు, రాజకీయ పార్టీలు ప్రజానికము అంతాకూడా పోటీపడి, ఎవరు ఎక్కువ పనిచేశారు ఎంతవరకు ప్లానింగు మహోన్నతత్వమును కలిగించారు అనేది తీసుకువచ్చి నిరుద్యోగ సమస్యను తగ్గించుకోవాలి. లేనిచో దేశం చాలా ప్రమాద స్థితిలోకివచ్చి నిరుద్యోగ సమస్య ఏర్పడడం జరుగుతుంది. గాంధిగారు ఎట్లాగు అయితే ప్రజా సేవకోసం ఇవ్వండి అని అడిగాడో, అట్లానే ప్రజానీకమును ఉన్నత స్థాయిలోకి తీసుకొనిపోతే సామాన్య ప్రజలకు, ప్రభుత్వానికికూడా ఉపయోగపడుతుంది కనుక అటువంటి మనోతత్వాన్ని తీసుకురావలసిన అవసరము ఉన్నదని చెబుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri S. BRAHMAYYA .—మాననీయ అధ్యక్షా, 200 సంవత్సరములు బానిసత్వముక్రింద కృంగి కృశించిన భారతదేశము స్వాతంత్ర్యమును సిద్ధింపచేసుకోవడానికి 8½ సంవత్సరములు అనేక కష్టనష్టాలను ఎదుర్కొని, ఈ ఔన్నత్యకరమైన పంథాలో ఈ ప్రణాళికను తయారుచేసుకొన్నది. అనుటలో ఎట్టి అతిశయోక్తిలేదు. ప్రథమ పంచవర్ష ప్రణాళికలోపొందిన విజయాలకంటె, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఇంకా సర్వతోముఖంగా దేశాన్ని ముందుకు తీసుకు వచ్చుటయే దృష్టిలో పెట్టుకొని ఈ ముసాయిదాను తయారుచేసినట్లు స్పష్టమగుచున్నది. ఈ ముసాయిదాను తయారుచేస్తూ దానిని కేంద్రప్రభుత్వంలోఉన్న రాజ్యసభ

సభ్యులకు లోక్‌సభ సభ్యులకు, ప్రతిరాష్ట్రశాసనసభ్యులకుకూడా కూలంకష్టంగా చర్చించడానికి అవకాశము కల్పించారు. అయితే గొప్పమేధావుల మద్దతుతో కూర్చొని తయారుచేసినటువంటి ఈ ముసాయిదాపై, సామాన్యమైనటువంటి సభ్యులయొక్క అభిప్రాయములుకూడా ఇవ్వమనడంలో ఏమి అర్థం ఉంటుందో నాకుతోచడములేదు. ఈ ప్రణాళిక చర్చకు అవకాశము ఇచ్చిఏదైనా సవరణలు చేయదగినవిగా ఉన్నప్పుడు వాటి స్వరూపాన్ని ఏర్పరుస్తారని ఈ ముసాయిదాలో చెప్పబడింది. అది పురస్కరించుకునే కొంతవరకు సభ్యులు తమ అభిప్రాయములను చెప్పడానికి అవకాశము తీసుకుంటున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాలకు 4,300 కోట్ల రూపాయిలు అయింది. అందులో విద్యనిమిత్తము 320 కోట్ల రూపాయిలు కేటాయించారు. ఈ విద్యవిషయములో నేను ముఖ్యంగా ఒకటి చెప్పదలుచుకున్నాను. 1951 సంవత్సర జనాభానుబట్టిచూస్తే 100 కి 16 గురు మాత్రమే చదువుకున్నారని, అందులో 10 సంవత్సరముల లోపువారిని మినహాయిస్తే, 100 కి 20 మంది చదువుకున్నవారు ఉన్నారని లెక్కలు తెలుపుతున్నవి. ప్రథమ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేసరికి 100 కి 40 మంది చదువుకున్నవారు ఉండాలని, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేసరికి 100 కి 60 మంది చదువుకున్నవారు ఉండాలని చెబుతున్నారు. ముఖ్యముగా ఏ ప్రదేశముఅయినాసరే విద్యతో తులతూగుతున్నప్పుడు, విజ్ఞానముతో తులతూగుతున్నప్పుడు ఆ దేశముయొక్క ఔన్నత్యము స్పష్టము అగుచున్న విషయమును మనం అందరము గుర్తించుకోవాలి. కేంద్రప్రభుత్వములో ఉన్న విద్యాశాఖమంత్రి జాతీయ స్కీములో విద్యకు ఎక్కువగా కేటాయించాలని మాట్లాడారు. కనీసం 4,800 కోట్లరూపాయిలనుంచి విద్యకొఱకు 500 కోట్లు రూపాయిలు అయినా కేటాయించాలన్నారు. ప్రస్తుత పరిస్థితులనుబట్టి విద్యనిమిత్తము 320 కోట్లరూపాయిలు చూపించారు. ఐతే ఈ సాంఘికసంక్షేమ కార్యక్రమములను దృష్టిలో ఉంచుకొని మనకు ఎంత కేటాయించినప్పటికికూడా ఏఏవిధంగా ఈ విద్యను వ్యాప్తిచేయడానికి వీలున్నదో మనం ఆలోచించవలయునని నేను మనవిచేస్తున్నాను. నిర్బంధప్రాథమిక విద్యావిధానము వీలయినంతవరకు దేశముఅంతా వ్యాపింపచేయడము అవసరము. దానికి ఇంతగా వ్యవధి ఇవ్వవలసినపనిలేదు. నిరక్షరాశ్యతను నిర్మూలిస్తే నిరుద్యోగసమస్య కూడా పరిష్కారము అవుతుంది.

ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగ సమస్యను తొలగించుటకు సాధనములు చూపబడినవి. నదీజలములను సద్వినియోగించేసి అధికవిద్యుచ్ఛక్త్యుత్పత్తిని కలుగచేసుకొని తద్వారా దేశంలో ఉన్నటువంటి దుస్థితులను తొలగించుటకు మార్గములుకూడా ఈ ప్రణాళికలో ఉన్నవి. దేశంలోని ప్రజలందరకు ఆరోగ్య

Sri S. Brahmayya] [26th March 1956

వైద్య విద్య గృహ సౌకర్యములను కలుగజేయుటకు ఈ ప్రణాళిక ఉద్దేశింపబడినది ఇటువంటి పరిస్థితులలో సాంఘిక సంక్షేమ కార్యకలాపాలలో విద్య నభ్యసించుటకు లింగ, మత, కుల విచక్షత ఉండకూడదని, అన్ని శాఖల వారికికూడ విద్యగరపవలెనని ఈ ప్రణాళికలో ఉన్నది ఇప్పుడు విద్యార్థి వేతనములు కొంత మందికి మాత్రమే లభిస్తున్నాయి.

అట్లు కాకుండా ఆర్థికంగా వెనుకబడిన ప్రతి కుటుంబీకునియొక్క బిడ్డలకు ఉచిత విద్యా సౌకర్యములు కలుగచేయవలెనని నేను మనవి చేయుచున్నాను. వెనుక బడిన జాతులకు, హరిజనులకు ఏ విధంగా కల్గిస్తున్నారో అదే విధంగా అందరికీకూడ ఉచిత విద్యా సౌకర్యములు కలుగజేయవలెనని నేను కోరుచున్నాను. ఇప్పుడు మధ్య ప్రదేశ్‌లో S.S L.C. వరకూ కూడ ఉచిత విద్యా విధానాన్ని అమలులో పెట్టబోతున్నారు. ఈ సంవత్సరం నుంచి మన రాష్ట్రంలోకూడ 8 వ ఫారంవరకు ఉచిత విద్యా విధానమును అమలు పరచబోతున్నామని ప్రధాన మంత్రిగారు చెప్పినారు. ఈ రోజున వార్త పత్రికలో పడినది. ఇది చాలా సంతోషించ వలసిన విషయం. ఇంతే కాకుండా వచ్చే సంవత్సరంనుంచైనా మన రాష్ట్రంలో కూడ S.S.L.C. వరకూ కూడా ఉచిత విద్యా విధానమును అమలులో పెట్టాలని మనవి చేస్తున్నాను.

ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో సంఘీయుత విద్య, లలిత కళలను, నాటక ఎకాడమి అనేది స్థాపించి, తద్వారా కళాకారులందరకు ప్రోత్సాహ మివ్వవలెనని ఉన్నది. కేంద్ర ప్రభుత్వంవారు ఏర్పరచినట్టి దానిని దృష్టిలో పెట్టుకొని మన ప్రభుత్వంకూడ వీలయినంత త్వరలో అఖిలాంధ్ర పరిషత్తు స్థాపించి, సంగీత నాటక ఎకాడమి స్థాపించి, లలిత కళలను ఉద్దేశించడమే కాకుండా కళాకారులకు కూడ తగినంత ప్రోత్సాహము, ఉత్సాహము కలుగచేయాలని కోరుచున్నాను. వికలాంగులు, అనాథలు, పతితలు మున్నగువారియొక్క సంక్షేమమును గురించి ఆలోచిస్తామని చెప్పారు. ఈ భిక్షుక సమస్యను గురించి కేంద్ర ప్రభుత్వంవారు ఎందుకు ఎక్కువ శ్రద్ధ తీసుకొనుట లేదో కాని ఇది ఒక ప్రధానమైన సమస్య. ఈ భిక్షుక సమస్యను పరిష్కరించుటకు రాష్ట్రంలో 1, 2 చోట్లనైనాసరే ముందు అమలుపరచి అది బాగుగా నెరవేరినట్లయితే ప్రజాశ్రేయస్సు దృష్ట్యా ఈ సంక్షేమ సంఘములను అమలు పెట్టవలసిన అవసరం ఉన్నదని మనవిచేస్తున్నాను.

తరువాత irrigation ను గురించి ఒక్క విషయం చెప్పబోతున్నాను. దీనిని గురించి మనం ప్రతి సంవత్సరము కోటాను కోట్ల డబ్బు ఖర్చు పెట్టుచున్నాము. దీనిని గురించి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 6% (శాతము) కేటాయించినారు. ఇంతే కాకుండా పల్లెలలో మురుగు నీటి పారుదల సౌకర్యములు కలుగజేయవలెనని

మనవిచేస్తున్నాను. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనం" అన్నారు. ఆరోగ్యమే ప్రధానమైనటువంటిది. ప్రతి మనిషికి కూడ ఏ ధర్మమును సాధించుటకయినా ఆరోగ్యమే ముఖ్యమైనటువంటి సాధనమని చెప్పబడి ఉన్నది. అందుచేత వ్యాయామ కళాశాలను ఎక్కువగా ప్రోత్సహించవలెనని మంత్రిగారిని కోరుచున్నాను. ఇది దేశవ్యాప్తంగా జరగవలసిన విషయం. అయినప్పటికీ సూచనలు చేయుటకు మన ముసాయిదాలో అవకాశం కల్పించబడింది కనుక ఈ సూచనలను కేంద్ర ప్రభుత్వం వారికి తెలియజేయవలసినదిగా కోరుచున్నాను. పండిత మదనమోహనమాలవ్యా వంటి గొప్పవారు బెనారస్ హిందూ యూనివర్శిటిలో ఏవిధంగా ఈ అవకాశము కలుగజేశారో ఆ విషయమును దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. ప్రతి భారతీయుని కూడా వీర్యవంతునిగా చేయుటకు వ్యాయామ కళాశాలలు ఉండుట చాలా అవసరమని నా అభిప్రాయం. వ్యాయామము చేయుటవలన వికలాంగులుగా కాకుండా, శరీర సౌష్టవం కలిగినటువంటి వీరులుగా తయారుచేయుటకు అవకాశం ఉంటుందని మనవిచేస్తున్నాను. ఈ మైనర్ ఇరిగేషన్‌ను గురించి మరియొక్క విషయమును ప్రభుత్వం వారి దృష్టికి తీసుకుని వస్తున్నాను. క్రిందటి సంవత్సరం బడ్జెట్‌లో మైనరు ఇరిగేషనుకుగాను కోట్లకొలది ధనమును కేటాయించారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మైనర్ ఇర్రిగేషన్‌కు కావలసిన ధనమును కేటాయించలేదని నా అభిప్రాయం.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రరాష్ట్రమునకు 1,82 లక్షలరూపాయలు మాత్రమే ఖర్చుచేయుటకు అవకాశమున్నట్లు స్పష్టమవుతున్నది. అదిచాలదు. కట్టవలసిన చిన్నచిన ప్రాజెక్టులు చాలా ఉన్నాయి. కొద్ది ధనంతో వేలకొలది ఎకరములను సాగుకుతీసుకొనివచ్చి అధికాహారోత్పత్తిని కలుగచేయుటకు అవకాశముంటుంది మైనర్ ఇర్రిగేషన్ గురించి ఎక్కువశ్రద్ధ తీసుకోవలసినదని మనవిచేస్తున్నాను. సభ్యులందరూ చెప్పినదే పదేపదే చెప్పడం సాంప్రదాయంకాదు. కాని చిన్నచిన్న ప్రాజెక్టులను మరో ఉద్దేశ్యంతో వెనక్కునెట్టకుండా వీటిని కట్టించవలసిన అవసరం ఎంతైనాఉన్నదని ప్రభుత్వంవారికి మనవిచేయుచున్నాను. అట్లు చేసినట్లయితే కొద్దిలక్షల రూపాయలతో వేలకొలది ఎకరముల భూమిని సాగులోనికి తీసుకొనివచ్చుటకు అవకాశంఉంటుంది. దీనితో దేశం సర్వతోముఖంగా అభివృద్ధి జెందుటకు అవకాశంవుంటుందని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

*SRI B. V. SUBBA REDDI :—Mr Speaker Sir, from the debates I have been following these days, I find that some of the Hon. Members of the Congress Party have been speaking

Sri B. V. Subba Reddi] [26th March 1956

as though they are non-Congressmen and some of the non-Congress people speaking as though they are Congress people Sir, I am not a Congressman myself and to day I am going to speak like a non-Congressman

Sir, the atmosphere outside is very hot, the atmosphere inside is very hot and I am having a little temperature myself. Sir, if I am going to give you something hot, I would request you to keep yourselves calm and cool and take it in the spirit in which it is meant.

Sir, at the outset, I owe an apology to you Sir and the Hon Members of this House for speaking in English, for some of the Hon Members might not be able to follow me. But Sir, I have been trained up and educated in English and unfortunately, I am not able to express so effectively and freely as I can do it in English, to which language I am a bit accustomed.

Sir, to-day, I am going to tell the House what the man in the street feels, thinks and says about the Government and the Second Five Year programme. I know Sir, that what I am going to speak is going to fall flat on people who want to be intentionally blind and deaf to realities and who have developed a certain kind of immunity to all kinds of attacks which are levelled against them.

Sir, this Second Five Year programme after pruning and pruning has come down to 118 crores, and, I hope, there would not be any further pruning. Sir, from this amount what is actually going to be spent is only 50 per cent on constructive works, because 25 per cent has got to be set apart towards mamools of the officers and profits of the contractors. 25 per cent has to be set apart for transport charges etc. So what is exactly going to be spent is going to be somewhere about 50 crores. Sir, considering the infant stage of Andhra and the backwardness of Rayalaseema in all spheres, I feel that this amount is practically negligible. Sir, in the composite State, step-motherly treatment was given to Andhra. While a little attention was paid to the Circar Districts, practically the districts of Rayalaseema were

utterly neglected Sir, to-day, if we compare the advancement of the Madras State, industrially, economically and educationally, I am sorry to observe that we stand nowhere. If we go to any town in the south, we find that it is very much advanced industrially as well as economically What is the condition of Andhra State? Sir, it is certainly deplorable and I should think that this is a diseased limb in the body politic of the country and it is high time that the Central Government realises and comes to the rescue of Andhra

Sir, the progress in the First Five Year programme is next to nothing, considering the vastness of the State and the population and what is sought to be done in the Second Programme is merely a show and a mockery Sir, Rayalaseema, because it is a backward area was a mill-stone round the neck of Andhra and with the advent of Visalandhra, Telangana is going to be a second mill-stone round the neck of Andhra. With these two mill-stones around our neck, Sir, we will have to drag on. But I believe Sir, that the Government like the barber's chair which can adjust itself to the pin-buttocks, to the fat-buttocks and the round-buttocks will certainly adjust itself to the changing conditions and circumstances of the times. Sir, for the successful implementation of the Second Five Year programme, there is a great responsibility on the people, and I feel, that there is a greater responsibility on the Government and its officers who have to execute this plan.

Sir, what is the kind of leadership that we have got today. We want leadership which will be able to inspire confidence, trust, belief in the minds of people and make them come forward in large numbers to make this Second Five Year Programme a success. Sir, it is the misfortune of Andhra in having too many leaders without following. There is no towering personality with intellectual brilliance, courage, imagination, prudence, foresight and fore-thought who can lead the people. Sir, scientists and psychologists say—and I have no reason why I should disbelieve—that the most handsome people in the world have got some feminine touches

about them in their features and in their movements. Sir, Milton in the 17th century was considered to be a very handsome personality. Napolean was considered to be a very fine personality, and Vivekananda of our own country was considered to be a very beautiful person. Sir, Milton was the greatest poet next to Shakespeare in English literature. What kind of leadership do we require for the successful implementation of the Five year Programme? Sir, Napoleon was the greatest soldier-statesman which the world has known and Vivekananda was the greatest Hindu religious philosopher and teacher who has revitalised Hindu religion and made the westerners open their eyes towards the greatness of Hindu religion. Sir, what is the greatness that we are able to discover in our leader who is to-day able to control the destinies of the Andhra State? Sir, I purposely do not give the names I am throwing out the cap and let him to whom it fits wear it. Sir, what is the greatness about him? The greatness about him is his culture, love and romance and is fond of honey-mooning all his life. Excuse me Sir, I am going to be a bit harsh. Sir, a gentleman who would not hesitate to bury 100 fathoms deep all those from whom he has received support and help so that they might not raise their heads and then walk over their graves dramatically and perpendicularly. Sir, he is living in a fairy land surrounded by sycophants and satellites who are out for fishes and loaves and who are making hay while the sun shines. Sir, by his bewitching qualities, he could attract not only men but even Goddess of power. But like all men, even Goddess of power has realised her mistake and very soon She is going to file a suit for divorce. Sir, his reception is cold, his treatment is not pleasing and his farewell is anything but satisfactory. Sir, while the gentleman is honey-mooning in a fairy-land, others are deeply immersed in power politics and group politics. Brisk canvassing for coming leadership of Visalandhara has already begun. Sir, some of you have been accusing the Communist friends of murders, arson and loot. Sir, I want you to remember the innumerable political murders you people

have committed, and I want you to repent, for that is the only way of atoning for all your political sins

Sir, of course, we are very glad and I should think very fortunate in having as our Planning Minister, as I said on a previous occasion while this Second Five Year Programme was under discussion, a man with a very sharp and keen intellect, a man who has cool head and warm heart throbbing under a rough exterior and who has been unjustly maligned and sinned against rather than sinning Sir, I hope that God will be gracious enough to spare him for many more years that the country might use his brains for the improvement of the country. Sir, I have been a bit harsh. Kindly take the spirit and intention behind it for, the idea behind being to correct all those who are going astray I do not mean to say that by pointing out your defects, you are devoid of all virtues Sir, I appeal to you to rise yourselves from the mire of private interest to contemplation of virtue and put your hand to removal of all evils which are sticking on to your Government and the party to which you belong.

Thank you, Sir.

SRI P. VENKATASUBBAYYA :—అధ్యక్షా మహాశయా, మొదటి పంచవర్ష ప్రణాళిక రచన అయినతరువాత దానిని implement చేసుకొన్న తరువాత మనం చాల విజయవంతంగా ముందుకు సాగినామనే అనుకోవలసిఉన్నది. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆహారకొరతవల్ల చాలబాధపడుతూ ఉండే వాళ్లము. అందువల్ల మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయానికి ఎక్కువ ప్రాముఖ్యతఇచ్చి అధికఆహారాన్ని మనం సాధించుకోగలిగాము. ఈనాడు మిగులు దేశంగా మనం పరిగణింపబడుతూ ఉన్నామంటే దానికి కారణం మనం చేసినటువంటి కృషి ఫలితమేనని మనం భావించవలసిఉన్నది. రెండో పంచవర్ష ప్రణాళిక రచన ప్రారంభమై 1½ సంవత్సరమయినా ఈనాడు అది ఒకరూపమునుపొంది చర్చనీయాంశంగా ఏర్పడిఉన్నది. దేశపురోగమనమును ముందుకు తీసుకుపోవడానికి గాను ఇందులో ఎక్కువగా పరిశ్రమాభివృద్ధికి నిరుద్యోగసమస్యను పరిష్కరించడానికి Plan వేసుకొనిఉన్నారు. ఇవి రెండు చాల ప్రాముఖ్యత వహించిఉన్నవి. కేంద్రప్రభుత్వంవారు 4800 కోట్లరూపాయలను ఏ విధంగా వివిధ కార్యక్రమాలకు పంచినారో Plan లో చూచినట్లయితే విదితమౌతుంది. కేంద్రప్రభుత్వంవారు 4800 కోట్లరూపాయలలో కోటిపాయువల పథకాలకు 5% పంచితే రాష్ట్రప్రభుత్వం

Sri P. Venkatasubbayya] [26th March 1956

నీటిపారుదల scheme లకు 275% ఉపయోగిస్తున్నది. విద్యుచ్ఛక్తి పథకాలకు 15% మనం ఉపయోగిస్తే కేంద్రప్రభుత్వం 4800 కోట్లరూపాయలలో 9% మాత్రమే కేటాయింపు చేసుకొన్నారు. పరిశ్రమలకు రాష్ట్రప్రభుత్వం 8% ఉపయోగిస్తే కేంద్రప్రభుత్వమువారు 19% కేటాయించినారు. రవాణా సౌకర్యాలకుగాను రాష్ట్రప్రభుత్వం 5% కేటాయిస్తే కేంద్రప్రభుత్వం 29% కేటాయించినది. దీనినిబట్టి చూసినట్లయితే కేంద్రప్రభుత్వముయొక్క ముఖ్యఉద్దేశ్యాన్ని రాష్ట్రప్రభుత్వం అమలుపెట్టడంలేదని అనుకోవడానికి ఆస్కారం ఏర్పడుతోంది. వ్యవసాయికంగానే మనదేశం అభివృద్ధిచెందే పక్షంలో ఉత్పత్తి ఎక్కువ అవుతుంది. కేంద్రప్రభుత్వం రవాణా సౌకర్యాలకు 29% కేటాయిస్తే రాష్ట్రప్రభుత్వం 5% మాత్రమే కేటాయిస్తున్నది. దీనినిబట్టిచూస్తే పారిశ్రామికంగా ఎక్కువ అభివృద్ధి చెందడానికిబదులు వ్యవసాయికంగా అభివృద్ధిచెందడానికే అవకాశం ఏర్పడుతున్నట్లు కన్పిస్తోంది. అందువల్ల ముఖ్యమైనటువంటి మూలసూత్రానికి భంగకరంగా ఈ కార్యక్రమాన్ని నిర్ణయించినట్లు తెలుస్తున్నది. 4800 కోట్లరూపాయలలో States కు కేటాయించిన 2214 కోట్ల రూపాయలుపోగా మిగిలిన 250 కోట్ల రూపాయలను Finance Corporation ద్వారాను ఇంకా ఇతర Corporation ద్వారాను private రంగానికి సహాయముచేస్తున్నది. పారిశ్రామికాభివృద్ధిని సాధించుకోవడానికిగాను కేంద్రప్రభుత్వం private రంగమని, public రంగమని రెండు విధాలుగా ఏర్పాటుచేసినది. Public రంగమున్నప్పుడు పెద్దపెద్ద కీలక పరిశ్రమలు, ఉక్కు ఇనుము మొదలైనవాటి పెద్ద పెద్ద యంత్రాలను తయారుచేసేటటువంటి యంత్రకర్మాగారాలను వీటన్నిటిని కేంద్రప్రభుత్వం తన చేతిలో ఉంచుకొని అభివృద్ధిచేయడానికి సంకల్పించింది Private రంగంలోఉంటే పరిశ్రమలన్నింటికి కూడా కేంద్రప్రభుత్వం కొన్ని సంస్థలద్వారా సహాయం చేయ సంకల్పించినట్లు ఈ ప్రణాళికద్వారా మనకు తెలుస్తున్నది. ప్రజారంగంలో ఎక్కువగా పరిశ్రమలు అభివృద్ధిచేసి వెనుకబడిన ప్రాంతాలు కూడా సమానముగా అభివృద్ధిచేసేందుకుగాను ఎక్కువగా private రంగంలో ఉన్నటువంటి పరిశ్రమలకు తోడ్పడాలనేటటువంటి సంకల్పము నెహ్రూగారికి కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. అయితే భారతదేశమంతటిలోను ఆంధ్ర దేశం చాలా వెనుకబడి వున్నదని మనకు తెలిసినదే ఆ విధంగా వెనుకబడి ఉన్నప్పుడు కోట్లకొలది రూపాయలు పెట్టుబడి పెట్టగలిగిన పెట్టుబడిదారులు మన దేశంలో ఎంతమంది ఉన్నారనే ప్రశ్న మనం వేసుకొని చూచుకొంటే ఏ కొద్దిమందో ఉంటారు. అందువల్ల ఎక్కువగా పెట్టుబడి పెట్టి ప్రజారంగంలో ఎక్కువగా పరిశ్రమలను అభివృద్ధి చేసుకొనే అవకాశాలు సన్నగిల్లి పోతున్నాయి. మన దేశములో Textile Mills ను స్థాపించాలని అను

కొన్నాము. ఆంధ్రదేశంలో ఖనిజసంపద ఎక్కువగా ఉన్నదన్న విషయం యావత్ప్రపంచానికీ తెలుసు. రాయలసీమ ప్రాంతంలో iron ore దొరుకుతుంది. asbestos barytes mica మొదలైన ప్రముఖమైన ముడిపదార్థాలన్నికూడా ఆంధ్ర దేశంలోనే సంపూర్ణంగా లభిస్తున్నాయి. వీటిని అభివృద్ధిచేయడానికి గాను ప్రభుత్వము ఎటువంటి పథకాలను తయారుచేసినట్లు లేదు. Textile Mill, Fertilisers Factory నొకదానిని విజయవాడలో పెట్టాలని మొదట సంకల్పించి నట్లు తరువాత మద్రాసు రాష్ట్రంలోని నెయివేలి ఆనేటటువంటి ప్రాంతానికి కేటాయింపు చేసినట్లు తెలుస్తున్నది. దీనినిబట్టి భారత ప్రభుత్వం వెనుకబడి నటువంటి ఆంధ్ర దేశాన్ని ఏ విధంగా తోడ్పడానికి సంకల్పించినదో మనకు బోధ పడుతూనే ఉన్నది. భారతప్రభుత్వం ఆంధ్ర దేశంలోని పెద్ద పెద్ద పరిశ్రమలను అభివృద్ధి చెయ్యాలంటే వీటిని కేవలం private రంగానికి అప్పజెప్పినందువల్ల ప్రయోజనంలేదని నేను భావిస్తున్నాను. కేంద్ర ప్రభుత్వం ముందుకురాకుండా ఆంధ్ర ప్రభుత్వంకూడా ముందుకు రాకుండాపోయి ఇది అంతా పెట్టుబడిదారులు, ప్రజలే భరించాలి, share capital అంతా ప్రజలే వసూలు చేయాలి, అంటే అది సాధ్యం కాకుండా పోవచ్చు. పరిశ్రమలు అభివృద్ధిని చేసుకోకుండా, వ్యవసాయానికే ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చినందువల్ల మనం అనుకున్నంత పురోభివృద్ధిని సాధించ డానికి అవకాశంలేకుండా పోతున్నదని నేను భావిస్తున్నాను. Share capital ప్రజలనే వసూలుచేసుకొని ప్రజలనే సంస్థలు స్థాపించమకోండి అంటే వారు పరిశ్రమలను స్థాపించపోయేదిలేదు. అవి అభివృద్ధి చెందేదిలేదు. కాబట్టి ఈ విధంగా జరిగితేమనం అభివృద్ధి చెందలేవన్నమాటను మీరు ధృడంగా తెలుసుకోవాలని మనవి చేస్తున్నాను. చిత్తూరులో sugar fatcory పెట్టాలని సంకల్పిస్తే అక్కడ share capital అనుకొన్న రీతిగా వసూలు కాలేదు. Cement Factory పెట్టాలని share capital ను సోమయ్య పంతులుగారు వసూలు చేయ ప్రారంభిస్తే required share capital ఈ నాటివరకు లభ్యంకాలేదు. ఈ నిదర్శనాలనుబట్టి చూస్తే ఆంధ్ర దేశంలో పెట్టుబడి పెట్టి పరిశ్రమలను స్థాపించడానికి యోగ్యత గలిగిన పెట్టుబడిదారులు లేరనే విషయం స్పష్టంగా ఋజావు అవుతున్నది. ఇటువంటప్పుడు భారత ప్రభుత్వంగాని, ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వంగాని యావత్తు పెట్టుబడి ప్రభుత్వమే పెట్టుకొనే ఏర్పాటుచేస్తేనేగాని పరిశ్రమలు అభివృద్ధి చెందలేవు.

THE HON SRI K. VENKATA RAO :—ఈ విధంగా ఎన్ని మాట్లు stress చేసినా జవాబురాదు. M.L.A. లు ఏ విధంగా తోడ్పడతారని మేమడిగితే, Government ఇవ్వాలి, ఇండియా ఇవ్వాలి, England ఇవ్వాలి అని ఎన్ని మాటు చెప్పుతారు ? అలా చెప్పినందువల్ల ప్రయోజనమేమిలేదు. ఏ జిల్లా

కాలిల్లా 15 లక్షలు మొదలుకొని 17 లక్షలదాకా capital వసూలుచేస్తే Government సగభాగం capital ఇస్తుంది. కడపవెళ్లి చిత్తూరువెళ్లి member లందరికి చెప్పినా ఒక్కరు బాధ్యత వహించకుండా, ఇదేదో, ఎవరో చేతితో తీసివేయాలని మాట్లాడడం ఘనమైన విషయం కాదు.

SRI P. VENKATASUBBAYYA :—జనసామాన్యం అంతా పేదలుగా ఉన్నప్పుడు ప్రజలదగ్గర కావలసినంత ద్రవ్యము లేనప్పుడు ప్రజలు ఎక్కువ సహాయం చేయాలంటే శ్రమ రూపంగా చేయగలరు గాని ధనరూపేణా చేయలేకుండా ఉన్నారు. మంత్రిగారు దీనిని గమనించి కేంద్ర ప్రభుత్వం నుంచి ఎక్కువ డబ్బు కోరేందుకు ప్రయత్నం చేయవలసిందని ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI P. HANUMANTHA REDDI :—అధ్యక్షా, ఇక్కడ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను ప్రవేశపెట్టారు. దీనికి అయిదు పదిజేసి (అనగా చేతులుజోడించి) అభినందించవలసినట్లుగా ఇది సర్వాంగసుందరముగా రూపొందించబడినదని చెప్పటలో అతిశయోక్తి ఏమిలేదు. అయితే, ఈ సందర్భంలో ఒక విషయము చెప్పదలచుకొన్నాను.

"పుత్రోత్సాహము తండ్రికి పుత్రుడు
జనియించనంత పొడమదు
మరి ఆ పుత్రునిగని ఇల పొగడగ
పుత్రోత్సాహంబు నాడు పొడముర సుమతీ"

అన్నట్లుగా ఈ ముసాయిదాప్రణాళికను రూపొందించినంత మాత్రముచేతనే మన ఆశయము నెరవేరదు. కొడుకు పుట్టినంతమాత్రముచేతనే వానిని చూచి సంతోషపడడం కాదు. వాడు బుద్ధిమంతుడై జగత్కల్యాణానికి తోడ్పడితే, దాన్ని ప్రపంచము చూచి పొగడితే, అప్పుడు "నిన్ను నందకేల మిన్నకుండు బుధుడు కొడుకుండైనా" అని చంద్రునిలాగా పైకిపోయి కూర్చొంటాడు. అలాగునే ఏ ప్రణాళికైనా విజయవంతముకావాలంటే, దానికి మొట్టమొదట ఒక ప్రణాళిక అవసరము. కాని అది యెట్లు ఉండాలి అనేవిషయములో పూర్వము, రెండువేల సంవత్సరములనుంచి కౌటిల్యుడు మొదలైనటువంటి పెద్దపెద్ద ఆర్థిక శాస్త్రవేత్తలు, divine architectors (అంటె ఈశ్వరీయ శిల్పశాస్త్రజ్ఞులు) చాలా పథకాలువేసి ఎన్నెన్నో మార్గాలు చూపించియున్నారు. ఆ మార్గాలలోనే మనకు అందుబాటులో ఉంటేవాటిని మనకు తెలిసినంతవరకు అమలుజరుపుకొని దేశసౌభాగ్యానికి పాటుపడుతున్నాము. దీనికి అనేక దానాలు, సమయదానాలు, శ్రమదానాలు, భూదానాలు ఎన్నెన్నో ఇవ్వాలని పెట్టారు.

MR. SPEAKER :—వాగ్దానము.

SRI P. HANUMANTHA REDDI :—వాగ్దానం ఇస్తే దానితో అనేక పథకాలు ఫలవంతం అయినట్లే అని ఆశిస్తున్నాను. అయితే నిన్న

లక్ష్మణదాసుగారు ఒకమాట చెప్పినట్లు జ్ఞాపకం ఉన్నది. స్త్రీలు తమ శరీరముమీద ఉండే ఆభరణములన్నీ తిరుపతి వెంకటేశ్వర్లుకు ముడుపు ఇచ్చినట్లు దీనికి కూడ ఇచ్చినట్లయితే దేశసౌభాగ్యంకొరకు దోహదం ఇచ్చినట్లవుతుందని చెప్పారు. అది చాలా మంచిదే. అటువంటితల్లులు ఎవరైనా ముందుకువచ్చి ఆవిధంగా ఇచ్చినట్లయితే, దేశకళ్యాణానికి చాలా తోడ్పడినవారు అవుతారు. ఈ ప్రణాళికకు కావలసిన డబ్బు ఎట్లా సేకరించడం, దీనిని ఎట్లా ప్రోగుచేయవలసియున్నదనే విషయం గురించి, మిత్రులు చాలామంది సలహాలు ఇచ్చి ఉన్నారు. కనుక అప్పుచేయకుండా ఉండే ప్రభుత్వంగాని, అప్పుచేసి కొడుకులను సుఖపెట్టి చదివించేటటువంటి అబ్బగాని, ఈ ఇద్దరు కుటుంబానికి, దేశానికి ప్రబల విరోధులని ఒకమాట చెప్పారు. దేశ్‌ముఖ్ గారు ఒకప్పుడు శ్లోకరూపకంగా చెప్పారు. పార్లమెంటులో కనుక ఆవిధంగానే ఎన్నివిధాలనో డబ్బు వసూలు చేయడానికి, ఇవ్వడానికి, తీసుకోడానికికూడ అర్హత ఉన్నది ప్రభుత్వానికి గృహస్థుడు ఆవిధంగా చేయడానికి వీలులేదు. ప్రభుత్వానికిమాత్రమే ఇవ్వడానికి, తీసుకోడానికి రెంటికి అర్హతఉన్నది. ప్రజలకు సౌకర్యాలు చేకూర్చడానికిని, socialist సమాజ వ్యవస్థను స్థాపించడానికి, ఈ నిరుద్యోగ, నిరస, నిర్వ్యాపార దారిద్ర్యములమీద దాడివెడలాలంటే, నిజంగా డబ్బు ప్రధానంగా కావాలి. ఆవిధంగా వాటి మీద దాడివెడలాలంటె దానికి నిజమైన ఆయుధాలేమిటి, పరికరాలేమిటి? ఇవన్నీ ఈ ప్రణాళికలో అక్కడక్కడ రూపొందించి పెట్టారు. అలుగులు, అంబులు, బాణాలు, ధనస్సులు ఇవన్నికూడ ఈ ప్రణాళికలో ఉన్నాయి. అయితే వాటిని ప్రయోగించడం ఏలాగో తెలుసుకోవలసియుంటుంది, అంబుతీసుకొని రాళ్లుపెట్టికొట్టితే అది ఫలవంతం కాకపోవచ్చు. కాబట్టి ఏ ధనస్సుకు, ఏ బాణాన్ని అతికించి ప్రయోగించాలి అనేదాంట్లోనే ఉంది నేర్పరితనమంతా. కనుక ఆవిధంగానే దీంట్లోగూడావచ్చే రాబడి చూచుకొని చేయవలసియుంటుంది. రాబడివిధానాన్ని నేను చెప్పడానికి తగినంత శక్తిసామర్థ్యాలుగాని, చదువుగాని, అనుభవముగాని మాకులేదు. కాబట్టి ఇదివరకు పెద్దవాళ్లు చెప్పినటువంటి విధానాన్ని అనుసరించుకొనే మేము ఏదో కొద్దిసలహాలు చెప్పాము. ఆ విధంగా అప్పు చేసిఅయినాగాని దేశకళ్యాణానికి దారితీసేకార్యాలు చేయవలెనని చెప్పుచున్నాను.

తరువాత విద్యా, వైద్యవిధానాలను గురించి చాలామంది సభ్యులుచెప్పారు. ప్రస్తుతము జరుగుతున్నది ఏ స్కూలుకుపోయి ఏ చదువు నేర్చుకొని పరీక్ష పాస్ అయితే వెంటనే ఉద్యోగం దొరుకుతుంది, అనేది కనిపెట్టి కొన్నికొన్ని courseలకు ఎక్కువప్రాధాన్యం ఇస్తున్నారు ఇప్పుడు విద్యావిధానంకూడ బాగుండ లేదు కూలీలు, మేస్త్రీలు, Engineers అనేటటువంటి మూడు తెగలవాళ్లు

Sri P. Hanumantha Reddi] [26th March 1956

తయారవుతున్నారు. కూలీలంటే ఉపాధ్యాయులు, maistries అంటే సాధారణంగా ఆ విద్యాశాఖాధికారులు, ఇంజనీర్లు అంటే పథకాలులేట syllabus తయారుచేసేవాళ్లు. ఆవిధంగా వాళ్లు syllabus తయారుచేస్తే, ఆ ప్రకారంగా పాఠాలు చెప్పవలసిందని చెప్పి ఆ విధంగా చేస్తున్నారా లేదా అని చూచేపని విద్యాశాఖాధికారులది. ఇక ఉపాధ్యాయులు, ఇచ్చిన పుస్తకాలలో పాఠాలు చెప్పవలసియుంటుందికాబట్టి, ఇటుకరాళ్లు చేరవేసే కూలీలమాదిరి అయిపోతున్నారు. కాబట్టి ఈ నాడు దేశంలో భావిని సుసంపన్నం చేసేటటువంటి, దేశ దారిద్ర్య నిర్మూలనం చేసేటటువంటి పెద్దపెద్ద పథకాలను నిర్మించేందుకు కావలసిన technicians ను తయారుచేసేటటువంటి విద్యలు చాలా అరుదుగాను, లోపంగాను ఉన్నాయని చెప్పాలి ఈ Engineers లో రెండురకాలుంటారు. అందులో divine architecture అంటే ఈశ్వర్యశిల్ప శాస్త్రజ్ఞులు అనేవాళ్లు, ఒకప్పుడు వారు చేసేటటువంటి పని సాగకపోయినప్పటికిని, దానితో నిరుత్సాహపడకుండా బుద్ధికి పదునుపెట్టి, ఇంకా ముందుకుపోయి లోక కల్యాణానికి ఆశించి వారు ఏమేమి చేయవలెనో అవన్నీ దీక్షతోపూని నెరవేర్చేటటువంటివారు. కనుక అటువంటి వారిని తయారుచేయడం ఈ దేశానికి ఎంతేని అవసరమనుకొంటాను.

తరువాత ప్రజారోగ్యం విషయంలో, 40 వేల జనాభాకు ఒక్కొక్క డాక్టరు అని, ప్రభుత్వమే చెప్పుతున్నది. అయితే ఎందుకు ఈ డాక్టర్లు గ్రామాలకు రాకపోతున్నారు అనేది ఆలోచిస్తే, గ్రామాలు డాక్టర్లను ఆకర్షించేవిగా లేవు గనుక, వారు రాలేకపోతున్నారని చెప్పవలసి యుంటుంది. గ్రామాలలో అనేకచోట్ల రోడ్లు, రవాణాసౌకర్యాలు లేకుండా ఉన్నాయి. అంతేగాక, మలేరియా, నారికురుపులు, గనివరం, మొదలైనటువంటి వ్యాధులకు నిలయమైనటువంటి ప్రదేశాలుకూడా చాలా వున్నాయి. కనుక అటువంటి ప్రదేశాలకు పోవాలంటే వాళ్లు జంకి ఏదో కడుపుజరిగితే చాలులే పేటలో ఒకబోర్డు వేసుకుందామనే స్థితిలో నిలచిపోతున్నారు. కనుక గ్రామాలలో వాళ్లకు అటువంటిసౌకర్యాలు కలుగజేసి గ్రామాలుకూడ ఆకర్షణీయంగా ఉండేటట్లు ఈప్రణాళిక నిర్వహణలో చేయవలెనని మనవిచేస్తున్నాను. డాక్టర్లను తయారుచేసే విషయంలో ఆయుర్వేదంలో L.I.M., వాళ్లను, G.C.I.M. వాళ్లను, ఇంకా homeopathy డాక్టర్లను, వీళ్లందరిని ఇంకా ఎక్కువగా తయారుచేసి అక్కడక్కడ గ్రామాలలోవేస్తే బాగుంటుంది. అయితే ప్రకృతి వైద్యమునకు ప్రస్తుతము స్థానమిచ్చి ప్రతిపల్లెలలోను నిర్మించడానికి ప్రపంచమంత advance గాలేదనుకుంటాను. అది ఇప్పుడు ఎక్కడా సఫలీకృతము కావడంగాని, జరగడంగాని లేదేమో అనుకొంటాను. వారు ప్రకృతివైద్యమని అంటున్నారుగాని ఎనిమా తప్పకుండా తీసుకోవలెనని చెప్పుతున్నారు. ఆదేమి

ప్రకృతివైద్యమో నాకేమి అర్థంకావడం లేదు. అది అర్థంచేసుకొనే మహాపురుషులు ఎవరైనా వుంటే చెప్పవచ్చు.

ఒక వైపున ప్రకృతి వైద్యము అంటారు కాని, మరొక వైపున ఎనీమా కానను తప్పకుండా ఉపయోగించాలని అంటూ ఉంటారు. అదేమి ప్రకృతి వైద్యమో నాకేమి అర్థము కావడములేదుకాని, అది తెలిసిన మహాపేయులే దాని అర్థము చెప్పాలంటున్నాను. అది ఎటువంటి ప్రకృతి వైద్యము అయినను, ఏ వైద్యమునకు మనము అలవాటుపడితే, అదే వైద్యము అని అంటున్నాను. ఈ ఎనీమా కానులను ఉపయోగించడము ఎట్లా ఉన్నదంటే, హైదరాబాదులో హుక్కా త్రాగేవాళ్లు ఎక్కడికి పడితే అక్కడికి యీ హుక్కా గొట్టమును చంకలో పెట్టుకుని తీసుకొనిపోతూ ఉంటారు. అదేమాదిరిగా యీ ఎనీమా కానులనుగూడ వెంటబెట్టుకొనిపోయి ఉపయోగించుతూ ఉంటారు కాబట్టి ప్రతిమానవుడు కూడ ఆరోగ్యమును కాపాడుకోవలసిన పరిస్థితి ఉంటుంది ప్రభుత్వముకూడ ప్రజారోగ్యము విషయములో కొంచెము శ్రద్ధ తీసుకోవలసి ఉంటుందంటున్నాను.

ఇక వ్యవసాయమును గురించి మాట్లాడేటప్పుడు నేను కొన్ని విషయములు మాట్లాడ దలచుకున్నాను. నేను కర్షకుడిని. ఈ సందర్భములో నాకు ఒక పద్యము జ్ఞాపకము వస్తున్నది అదేమిటంటే,

హలముచే భూనినంతనే అలరు సృష్టి
జాలము దున్నిన మాత్రాన పొదలు చిరుము
హలము పొలమును వీడిన కలుగులయము
నీవె లోకంబు, లోకంబు నీవె కలుగ॥

అని సృష్టి, సృష్టిస్థితిలయ కర్తలనుకూడ కర్షకులనే అనుకుంటున్నాను. పద్యమునీరసమైనదేగాని, దీని భావము బాగుందనే ఉద్దేశ్యముతో సభ్యులు నన్ను చదవమని అంటే, నేను యీ పద్యమును చదివినాను.

హలము ఒక చేత, కలము నొకచేత, రెండింటిని అన్యోన్యముగా పట్టగలిగే నేర్పుకూడ రైతాంగములో రావాలి. అట్లా కాకుండా ఎట్లాగైనా కష్టపడి నాలుగు ముక్కలు చదువుకొని, దొరలవేషంబు వేసి డాబు సరిగ నిక్కి, అయ్యవార్ల పంచలముందర కాచుకుని, ఉద్యోగాల కొరకు దేవులాడే వృత్తి మంచిదికాదు. "పృథ్వీకృషి విహార జరపగలిగినవాడే దేశ భాగ్యంబు అమును."

Sri P. Hanumantha Reddi] [26th March 1956

అన్నారు. ఇది యెన్నో పెద్దలు చెప్పినమాట. కాబట్టి యిటువంటి కృషిని ప్రాధాన్య స్థితికి తీసుకుని రావాలంటే ఆ కృషి చేసేవారిమీద చూపించే నిరుత్సాహము, చిన్నచూపులు పోవాలి. రైతుఅంటే, యీ రోజులలో ఒక పల్లెటూరి వాడి మాదిరిగాను, నీచముగాను చూడడము అలవాటు అయిపోయింది. అతను ఎంత పెద్దవాడు, ఎంత తెలిసినవాడైనప్పటికినీ అతనిని ఎంతో నిరసనతో చూడడము జరుగుతున్నది. ఇటువంటి విధానము అడుగంటినప్పుడే, బి.ఎ., పరీక్ష ప్యాసు అయినవాడుకూడ వ్యవసాయము చేయటానికి జంకకుండా తన పని తాను చేసుకోటానికి సంసిద్ధుడౌతాడు. తరువాత వాణిజ్యశాఖ ఒకటే కాకుండా, సర్వ విధములా శాఖోపశాఖలై ప్రతివాడికిగూడ అమరేది వ్యవసాయమే. రైతు వ్యవసాయానికి అధ్యక్షుడు అయి ఉంటాడు. దానికి దోహదమిచ్చేవి పశువులు. దీనికి సంబంధించిన విషయాలు చెప్పాలంటే, చాల ఉన్నవి. ఇప్పుడు టైము చాలా తక్కువగా ఉన్నది. కాబట్టి, యీ విషయాన్ని యింతటితో విడిచిపెట్టి యీ ప్రణాళికకు సంబంధించిన విషయాన్ని గురించి మాట్లాడుతాను.

మన రాష్ట్రములో చిన్న చిన్న irrigation పనులు చేయవలసినవి ఎన్నో ఉన్నవి. ఈ minor irrigation విషయమై ప్రభుత్వం ఎక్కువగా శ్రద్ధ చూపుతున్నట్లు కన్పించదు. ఈ minor irrigation పనులు ముఖ్యంగా పల్లె ప్రాంతాలలో ఎక్కువగా ఉపయోగపడుతవి. అట్టివాటిని తలపెట్టకుండా, పెద్దపెద్ద ప్రాజెక్టులను ప్రభుత్వము తలపెట్టింది. రాష్ట్రములో ముఖ్యంగా మెట్ట ప్రాంతాలలో నీటి పారుదల కోరే ప్రదేశాలు, అయిదు ఎకరాలు, పది ఎకరాలు, యీ మాదిరిగా యాభై, నూరు ఎకరాలదాకా, ఉండేవి ఎన్నో ఉన్నవి. వీటికి ముఖ్యంగా నీరు అవసరము ఎంతో ఉన్నది. ఇటువంటి ప్రదేశాలు ఉన్నచోట్లకు నీరు పారుదల కావటానికి అక్కడ కుంటలు, చెరువులు ఉంటవి. వీటికి minor irrigation పనులు చేయించడము ముఖ్యావశ్యకము. కొన్ని చోట్లలో పెట్టుబడిదారులు ఉంటారు. భూఖామందులు ఉంటారు. కాని అక్కడ పొలము ఉండదు, నీటి వనరులు ఉన్నచోటనైనా, ఆ వనరులను బాగు చేయించాలి. ఎవరైనా స్వంతముగా సాగుచేస్తామంటే, వారికి భూమినివిడిచే విధానము ప్రభుత్వము అవలంభిస్తే బాగుంటుందని చెబుతూ, యింతటితో విరమిస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక చాలా పెద్దప్రయత్నం దీనియొక్క మంచి చెడ్డలను గురించి చెప్పడము కూడా ఒక సాహసమేకావచ్చు. కాని దీనిరచనఅంతా ఒక పెద్ద ఎత్తులో చేయబడిందనుకోవచ్చు. ఎందుకంటే క్రింద ఉన్నవారు ఆ రచనలను గురించి కొంత సమగ్రంగా పరిశీలించటానికి వారికి అవకాశాలులేకుండా పోయినవేమో

అనుకుంటాను. మనకు చాలా కాలముగా కాంగ్రెసు పెద్దలు మనము స్వరాజ్యము సాధించుకున్న రోజున మనముకోరేది తెల్లవాళ్ల రాజ్యముపోయి తరువాతవచ్చేది నల్లవాళ్ల రాజ్యముకాదు. ఇది ఒక స్వర్గరాజ్యముగాను, రామ రాజ్యముగాను ఉంటుందని చెప్పారు. మహాత్మాగాంధిగారు పాకిస్తాను విభజన కాకముందు, మన భారతదేశపు జనాభా అంతాచేరి నలభైకోట్లు ఉంటుందని అనుకుని, యీ నలభైకోట్లజనాభాలో ఏ విధమైన ఆరాటాలు, పోరాటాలు, మన స్పర్థలు లేకుండా అందరము ప్రశాంతపరిస్థితులలో జీవించటానికి అనువైన మార్గాన్ని రూపొందించగలిగినదే, మనకు స్వరాజ్యముఅని చెప్పారు నిజంగా మనము అందుకోసమే ప్రయత్నముచేస్తున్నామా అని కొంత సందేహము వస్తున్నది. ఇప్పుడు యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకోసము 4,800 కోట్ల రూపాయలు మనము ఖర్చుచేయబోతున్నాము. కాని యిందులో గ్రామసీమలకొరకు, గ్రామాలలోని వృత్తులకొరకు ఖర్చుచేయబోయేది, యీ ప్రణాళికలో చూపించబడ్డది రెండువందల కోట్ల రూపాయలు. ఈనాడు మనదేశములో మనలనందరినీ ఎదుర్కొనే ప్రధాన సమస్య, నిరుద్యోగసమస్య. ఈ సమస్యను పరిష్కరించటానికి భారీపరిశ్రమలు చాలా వరకు సహాయపడుతాయి అని చెప్పేవాదన ఒకటిఉన్నది. కాని యీ రకమైన వాదనను నేను అంగీకరించను. ఎందుకంటే, మనము 80 సంవత్సరాలకు 8 వేల కోట్ల రూపాయలఖర్చుతోకూడిన బ్రహ్మాండమైన పరిశ్రమలు యీ దేశములో కొంత వరకైనా ఏర్పాటుచేసుకుని ఉన్నాము. అలాగున బలపడిపోయిన భారీపరిశ్రమలలోనివి బట్టలయంత్రాలు, నూలుయంత్రాలు ఇవి చాలాపెద్ద పరిశ్రమలు. ఈ భారీ పరిశ్రమలు అన్నీకలిసి, యిందులో సిమెంటుఫ్యాక్టరీగాని, పంచదార ఫ్యాక్టరీగాని, ఉక్కుఫ్యాక్టరీగాని, యింకా యితర భారీపరిశ్రమలుగాని, అన్నీచేరి నప్పటికినీ, దాదాపు 30 లక్షల మందికి మించి అదనముగా వృత్తిని కలుగజేయుటానికి అవకాశములులేవు. కాని యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికద్వారా మరల 690 కోట్లరూపాయలు భారీపరిశ్రమలకొరకు వెచ్చించబోతున్నాము. కాని యీ విధముగా ఖర్చుచేయనవసరములేదు అని నేను చెప్పడములేదుకాని, యింతసొమ్ము వెచ్చించినంతమాత్రాన, దేశములో నిరుద్యోగులు కోట్లకొలది ఉంటున్నప్పుడు, వీరందరికి ఉద్యోగము కలిపించటమనేది సాధ్యముకాదని దీనివల్ల స్పష్టముగా కనబడుతున్నది. మొన్నటిరోజున శ్రీ సుందరయ్యగారు బట్టల పరిశ్రమలను గురించి మాట్లాడుతూ, మన ఆంధ్రదేశము నూలు విషయములో చాలా కొరతగా ఉన్నదని చెప్పారు. మన ఆంధ్రదేశము ప్రత్యేకముగాఉన్న దేశముకాదు. మన ఆంధ్ర రాష్ట్రము భారతదేశములో ఒక అంతర్భాగము, మాత్రమేనని మనకందరికీ తెలుసు. ఈనాడు భారతదేశములో మొత్తముమీద ఎన్ని నూలుమిల్లులు ఉన్నవి? మరి

కదుళ్లు ఎన్ని ఉన్నవి ? మనకు యీనాడు ఒక్కొక్కరికి సగటున ఎంత అవసరము ఉంటుంది ? ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అనంతరము మనము ఆశించినట్లుగా మన జాతీయ సంపద పెరిగి, జీవనపరిమాణము పెరిగితే, ఒక్కొక్కరికి 18 గజములబట్ట కావలసి ఉంటుందన్నారు. అప్పటికి జనాభా నలభైకోట్లు ఉండగలరని అన్నారు ఈ లెక్కల ప్రకారము చూచినప్పటికీగూడ 720 కోట్ల గజాలబట్ట అవసరమవుతుంది. విదేశాల ఎగుమతులకొరకు మరొక నూరుకోట్ల గజములబట్ట అయినా అవసరమవుతుందన్నారు. అప్పటికిచూచినాగూడా, దేశములో 820 కోట్ల గజములబట్ట కావలసిఉంటుంది. కాని యీనాడు మనదేశములో 1 కోటి 19 లక్షల మరకదుళ్లు స్థాపించబడియున్నవి. ఇప్పుడుజరిగే విధానము ప్రకారము మూడు shifts మీద కాకుండా, రెండు shifts మీద పనిచేస్తే, ఒక్కొక్క కదురు రోజు ఒకటింటికి 3/4 వంతు పౌనునూలును సులువుగా తీస్తుంది. ఆ లెక్క ప్రకారముతీస్తేగూడ దాదాపు 225 కోట్ల పౌనుల నూలును మన దేశములో తయారు కావటానికి అవకాశము ఉన్నది. అందువల్ల, ప్రతివిషయమును గురించికూడ ఏదో చెప్పాలి అనే ధోరణిలో చెప్పడను కాకుండా, మనము చెప్పదగిన మాటలతోటి, ముందు యీ నిరుద్యోగ పరిష్కరించ బడుతుందా, లేదా అనేది ఆలోచించి, చెప్పవలసిఉంటుంది. ఈ రోజున cottage industries కు సంబంధించినంతవరకు, ఒకభాగము నేను చదివాను. ఈ విషయములో ప్రభుత్వము చాలా తికమక పడుతున్నది. అసలు సందేహపడుతున్నది. దేశములో యీనాడు ఉన్న నిరుద్యోగుల సంఖ్యను తగ్గించటానికి గ్రామపరిశ్రమలను అభివృద్ధి చేయడమేనని స్పష్టముగా చెప్పారు. అదే మా లక్ష్యం అన్నారుకూడా. కాని cottage industries కు సంబంధించిన భాగము నేను చదివినప్పుడు, అప్పుడప్పుడు యీ సమస్యలు ఏర్పడినప్పుడు వాటిని దృష్టిలో పెట్టుకుని మనము ప్రయత్నము చేసుకుందాము అని ప్రభుత్వము చెప్పడమేగాని, యీ సమస్యలను పరిష్కరించటంలో ఏ విధమైన నిర్ణయానికిగూడా రాలేకపోయింది.

చేనేతపరిశ్రమవంటి ప్రధాన పరిశ్రమ దేశంలో ఒకప్రక్కనుండగా, రెండవ ప్రక్క బట్టలయంత్రంపరిశ్రమ వున్నది. దేశంలోయున్న ఈ రెండుపరిశ్రమలను సమన్వయంచేసి ఒకదానికి ఒకటి పోటీలేకుండాచేసి, ఈ రెండవ పరిశ్రమలమీదా ఆధారపడివటువంటి ప్రజలందరూ సుఖంగా జీవనం జేయడానికి అనువైనటువంటి మార్గాన్ని రూపొందించడానికి ఈ Planning Commission ప్రయత్నం చేసిందా అంటే, ప్రయత్నంచేయకపోగా ఆ సమస్యంతా చాలా సందేహస్థితిలో పెట్టారు. ఆసమస్య వచ్చినప్పుడు పరిష్కరిస్తాం అన్నారు. ఇప్పుడు సమస్యరాలేదా అని నేనడుగుతున్నాను. ఈరోజున Planning Commission ముందున్న చాలా

కష్టమైనసమస్య అదే. దేశంలోయున్న కుటీరపరిశ్రమల విషయంలో వారు చేయ దలచిందేమి ? మనం వృత్తులు కల్పించాలంటున్నాం. ఏ వృత్తులూ కల్పించవలసిన అవసరంలేదు. మనదేశం మొత్తంమీద అందరం సుఖంగా బ్రతకడానికి అనువైన వృత్తులన్నీ కల్పించబడ్డాయి. గ్రామంలో వున్న ఏకులాలవారిని చూచినా ఏదో ఒక వృత్తి మీద ఆధారపడి బ్రతికేటటువంటి వారే తప్ప సోమరితనంగా వుండే వారు ఒక్కరూ కూడా కనిపించరు ఈ 165 సంవత్సరాల విదేశీయ ఏలుబడిలో పాశ్చాత్య నాగరికతా వ్యామోహం రావడం, కొత్తకొత్త పరిశ్రమలు రావడం, ఈ వృత్తులన్నీ నాశనంకావడం, దేశంలో ఉన్న ఆర్థికవిధానం అంతా కూడా తారు మారుకావడం సంభవించింది. ఈ పరిస్థితులలో మార్పుతీసుకురావడానికి ప్రభుత్వం పటిష్ఠంగా ప్రయత్నించేస్తోందా అంటే ప్రభుత్వానికి స్పష్టమైనటువంటి విధానం ఉన్నట్లుగా నాకు కనిపించడంలేదు. కుటీరపరిశ్రమలను, గ్రామీణ ఆర్థికవిధానాన్ని పునరుద్ధరించే విషయమై ప్రభుత్వమేమీ ఆలోచించినట్లుమాత్రం నాకు కనిపించడంలేదు. గ్రామాలలో కులాలు అనుకునేటటువంటిభావం నాశనంకావాలి. ఈ ప్రణాళికలో ఎంతోడబ్బు ఖర్చుపెట్టబోతున్నాం. అసలు మనుష్యులలో మార్పు తీసుకురావడానికి ప్రయత్నించెయ్యాలి. అది జరగనంతవరకూ ఈ ప్రణాళిక ప్రయోజనం ఏమీ ఉండదు. ఇంతకంటే బ్రహ్మాండమైన ప్రణాళికలు రచించినప్పటికీ దేశంలో శాంతికాని సుఖంగాని ఉంటుందనుకోవడం చాలా పొరపాటు. ప్రతి ఒక్కరి మనస్సులో మనమందరం సోదరమానవులం, అనే భావం వచ్చినప్పుడే మనం మార్పు తీసుకువచ్చినట్లవుతుంది. మనమందరం వేరువేరువృత్తులమీద ఆధారపడి ఉన్నప్పటికిన్నీ పరస్పర సహకారంతో బ్రతకడానికీ ఒకరివృత్తిని ఒకరుపోషించి గౌరవించడానికి మనం సంసిద్ధం కానంతకాలం, మనం ఎంతటి బ్రహ్మాండమైన ప్రణాళికలువేసి, ఎంతబ్రహ్మాండమైన పరిశ్రమలు నెలకొల్పినా దేశం బాగుపడుతుంది అని అనుకోవడానికి అవకాశంలేదు. దేశంలోయున్న జనాభాలో 100 కి 90 మంది గ్రామాలలోనే ఉన్నారు. కొంతమంది రైతులకు భూసంస్కరణలు అవసరం లేదంటున్నారు. దేశం మొత్తంమీద పరిస్థితులనుగురించి చెప్పలేముకాని, ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూ భూసంస్కరణలు అమలుపరచాలనే వాదంతో నేను ఏకీభవిస్తున్నాను. అమలుపరచినప్పటికీకూడా మనకు ఎక్కువ ప్రయోజనం ఉంటుందన్న విశ్వాసం నాకులేదు. ఎందువల్లనంటే ఎంతటి భూసంస్కరణ మనంఅమలుపరచినప్పటికీ సీలింగులుపెట్టినప్పటికీ మానసికంగా ప్రజలలోమార్పువస్తేతప్ప ఎక్కువప్రయోజనం ఉండదు. పంపకానికి భూమి ఏదైనా వస్తుందా అంటే మాసర్కారుజిల్లాకు సంబంధించినంతవరకూ అందరూకూడా అప్పుడే ఏర్పాట్లు చేసుకున్నారు. ఎవరికైనా అదనంగా భూమిఉంటే దాన్ని చుట్టపక్కాల మధ్యకాని, అన్నదమ్ముల మధ్యకాని లేకపోతే అక్కచెల్లెళ్లు మధ్యకాని పంపకంచేశారు. మనం భూసంస్కరణలతో

పాటు ఇతరవిషయాలనుగురించి ఆలోచిస్తున్నామా? పెద్ద పెద్ద భవనాలున్నవారిని గురించి ఆలోచిస్తున్నామా? ఎక్కువగా డబ్బున్నవారిని గూర్చి ఆలోచిస్తున్నామా? పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నవారినిగూర్చి ఆలోచిస్తున్నామా? దేశకల్యాణం కోసం వారు ఏమిచేస్తున్నారు. వారిమీద ఏ విధమైన విధినిషేధాలు పెడుతున్నాం. మూడువేల రూపాయల ఆదాయంమీద income tax వెయ్యడానికి పూనుకుంటూయున్నప్పుడు అంతకంటే అదనంగా ఆదాయం వచ్చేవారి విషయమై ఏమి చేస్తున్నారు. ప్రభుత్వంయొక్క డబ్బు ఖర్చుతో చదువుకుని పెద్ద పెద్ద ఉద్యోగాలలో ఉండి వేలకొలదీ జీతాలు తీసుకుంటూ యున్నప్పుడు దేశకల్యాణం కోసం నిరుద్యోగులభృతికోసం, వారి జీతాలలోనుంచి ఏ 5% అయినా, ఈ national development fund కోసం ఇవ్వకూడదా? అని నేను ప్రశ్నిస్తున్నాను. ఇదే ధోరణిలో డబ్బున్నవారి విషయంలోనూ, ఉద్యోగాలు చేస్తున్నవారి విషయంలోనూ, పెద్ద పెద్ద భవనాలుండి, భూములు లేవని చెప్పుకునేటటువంటి వారి విషయంలోకూడా మనం ఆలోచించాలి. ఈ విధంగా అన్నివైపులనించీ ధనసేకరణ మార్గాలు చూడడమే కాకుండా, మానవునికి నిత్యజీవితంలో అవసరవస్తువులన్నీ కూడా గ్రామాలలోనే తయారయేటటువంటి మార్గాలు అనుసరించాలి. దేశం మొత్తంమీద ఇంకా నిరుద్యోగం ఏర్పడేటటువంటి పరిస్థితులు కనిపిస్తున్నాయి. మనం పిల్లల్ని చదివించడానికి ప్రయత్నించినా, తీరాచదువుకుని పాఠశాలలు వెలువడి బైటకువచ్చేసరికి నాకు ఏదైనా lower division గుమాస్తా వస్తుందా, upper division గుమాస్తా వస్తుందా, లేక sanitary inspector ఉద్యోగం దొరుకుతుందా అని దేవురించడంతప్ప, నా వృత్తిని నేను వృద్ధిచేసుకుని, ఆ వృత్తిలోనే మర్యాదగా బ్రతుకుటకు ప్రయత్నం చేస్తాననే ధోరణి చదువుకున్నటువంటి వారిలో పూర్తిగా లేకపోవడంవల్లనే దారిద్ర్యంతో క్రుంగిపోతున్నారు. మన విద్యావిధానంలో మార్పు తప్పకుండా తీసుకురావాలి, ఈ వృత్తులు నాశనం కాకుండా ఉండే విధానం తీసుకు రావాలి. చదివిన వారందరూకూడా ఉద్యోగం కోసం ఎగబ్రాకకుండా, తమతమ వృత్తులను అలవర్చుకుని, అవలంబించేటటువంటి విధానాన్ని చూచి ఆ వృత్తులకు రక్షణ ఇవ్వడానికి ప్రభుత్వం పూనుకున్నప్పుడే దేశకల్యాణం అని చెప్పండి, లేదా బాపూజీ ఆశించినటువంటి స్వర్గరాజ్యం అని చెప్పండి, అటువంటి రాజ్యం అప్పుడే ఈదేశంలో అవతరిస్తుంది తప్ప, వాటిని నిర్లక్ష్యంచేసి మనం ఇంకా ముందుకు పోయినప్పటికీ కూడా చాలా అనర్థాలను తప్పనిసరిగా ఎదుర్కోవలసి వస్తుందని మనవి చేస్తున్నాను.

26th March 1956]

SRI R. B. RAMAKRISHNA RAJU :—మహాశయా ! నేను కాంగ్రెస్‌కు అనుకూలుడనుగా కాని, వ్యతిరేకిగా కాని మాట్లాడడంలేదు. ఇందులో ఉన్న మంచిచెడ్డలను, ఇవి ప్రజలకు ఎంతవరకూ ఉపయోగకరం అనే విషయాలను గూర్చి నాకు తోచినంతవరకూ వివరించవలచుకున్నాను. ఈ plan విషయమై మొట్టమొదట State level లో ఒక కమిటీ వేశారు. ఆ కమిటీవారు 250 కోట్ల రూపాయిలకు ఈ plan తయారుచేశారు. ఆటుపిమ్మట ఏమైనదో మనికేమీ తెలియదు. ఇది తగ్గిపోతూ ఉన్నది. ఈ plan details అన్నీ ఎప్పుడు work చేస్తారు, ఎవరు work చేస్తారు అనేవిషయంలో నేను కొంత వివరించదలచాను. మాకు Revised State Plan అని ఏదో ఒక పుస్తకం ఇచ్చారు. ప్రతి heading క్రిందా కొన్నికొన్ని విషయాలు చేయాలనుకున్నారు. అది 116 కోట్లు కానివ్వండి, 200 కోట్లు కానివ్వండి. ఎన్నికోట్లయినా కానివ్వండి. ఈ ప్రణాళికక్రింద చేసే టటువంటి పనులు సెక్రటేరియట్ లెవెల్‌లో, లేక మినిస్టీరియల్ level లో ప్రతిజిల్లాకు అన్వయించే details అన్నీకూడా, ఇక్కడనే work చేస్తారా లేక ఆయాజిల్లాలకు సంబంధించినంతవరకూ జిల్లాలో ఉండే Planing Committeeల కు తెలియజేసి ఏఏజిల్లాలకు ఎంతెంత డబ్బు ఖర్చుచేయడానికి సాధ్యమో, దేనిక్రింద ఎంతెంత ఖర్చుచేయడానికి సాధ్యమో వారి అభిప్రాయంకూడా తెలుసుకుని, ఆయాజిల్లాలకు కావలసిన అవసరాలనుబట్టి వారు దాన్ని తీర్మానం చేశారా అనే విషయం మంత్రిగారు సెలవివ్వవలసిందని కోరుతున్నాను. ఇది చాలా ఆశతో ఆరంభమైనది. ప్రతిగ్రామంవారూ ఆ గ్రామానికున్న లోపాలన్నీ, వారికోరికలన్నీ తీరుతాయి అనే ఉద్దేశ్యంతో బ్రహ్మాండమైనటువంటి ప్రణాళిక గ్రామంనుంచి తయారైవచ్చింది. గ్రామస్థులకు తెలియకుండా అక్కడ కొన్ని, ఇక్కడ కొన్ని చేస్తామంటే మా constituency లలో ఉండే ప్రజలకు మేము నచ్చచెప్పడం చాలా కష్టంగా ఉంటుంది. Plan 116 చిల్లరనుంచి 118 కోట్ల చిల్లరకు పెరిగింది. ఈ జాస్తీ అయిన మొత్తం సుమారు 3 కోట్లు జిల్లాలవారీగా పంచిపెట్టి అక్కడ వారి సౌకర్యాలకు వినియోగపరచుకో వచ్చునని ఆ జిల్లాలోఉండే Planning Committee వారికి స్వేచ్ఛఇచ్చి ఆప్రకారం చేస్తే కొంతవరకైనా గ్రామములలో ఉండే ఆందోళన తగ్గవచ్చునని అభిప్రాయపడుతున్నాను. మంత్రిగారు ఈ విషయం ఆలోచిస్తారని ఆశిస్తున్నాను.

State planning committee ఒక మీటింగుతో పని పూర్తి అవుతుందా లేక మరికొన్ని మీటింగులు వేస్తారా ? అట్లా వేయవలెనని నేను కోరుతున్నాను. ప్లాన్‌లో ఇంత డబ్బు అని తీర్మానమయినది. ప్రణాళిక తయారు అయినది. చాలా కష్టపడి ప్రణాళిక తయారుచేసినారు. ప్రణాళిక తయారుచేసినవారి

సూచించిన వివరాలు చాలా కష్టపడి తయారుచేసినారు. దానికి ఆక్షేపణ లేదు. వారిని అభినందించవలసిందే. ఈ వివరాలు అమలుజరిపినపుడు ఏ జిల్లాలకు ఏమిచేయవలసిందనే విషయాలను ప్లానింగుకమిషను మెంబర్లు కలిసి వారికి చెప్పి తుదినిర్ణయం చేస్తే బాగుంటుందని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. అన్నింటికన్న రోడ్లు ముఖ్యమని వ్రాశారు. Village roads కు గాను ఎంత మొత్తం కేటాయించబడింది అనేవిషయం స్పష్టంగా ఒక heading క్రింద చెప్పడానికి సాధ్యంకాకుండా ఉన్నది 2,3 headings క్రింద రావచ్చు నామనవి ఏమిటంటే గ్రామాదులు అభివృద్ధికావాలంటే అన్నింటికన్న గ్రామం అందుబాటులో ఉండడం ముఖ్యం. నా వ్యక్తిగతమయిన అభిప్రాయంప్రకారం గ్రామాలు అభివృద్ధికావాలంటే రాకపోకలసౌకర్యం మొదట ఏర్పడాలి. ఇటువంటి దానికి కొంత మొత్తం కేటాయించి నేను మనవిచేసినట్లు districtsలో planning committee వారికి ప్రతి జిల్లాకు కొంత మొత్తం కేటాయించి మీ జిల్లాలో ముఖ్యమయిన జాగాలు ఎక్కడ ఉన్నాయో అక్కడ మీరు Village roads వేసుకోండి అని చెబితే బాగుంటుంది అని నా మొదటి సలహా.

"A comprehensive scheme of road development has been drawn up balanced as between different categories of roads. Want of proper communications hampers the marketing of agricultural produce and the obtaining of fair return and hinders the growth of the general economy This will be corrected by the provision of key roads in the villages serving as feeders to the main arteries of communication."

ఇది ఏజిల్లాలో ఎంతెంత ఎక్కడెక్కడ ఖర్చుచేస్తారు అనే విషయం ఇందులో వివరంగా తెలియలేదు. దీనికిగాను ఈ పని జిల్లాలవారీగా ఇచ్చివేస్తే తృప్తికరంగా జరుగవచ్చునని మనవి చేస్తున్నాను. ఇక minor irrigation విషయం. ఇది రెండు విధాల ఉన్నది. మొదటిది ప్రస్తుతం ఉన్నటువంటి irrigation చెరువులుగాని కుంటలుగాని బావులుగాని మరమ్మతు చేయడం ఒకటి. రెండవది, లేనిచోట ఎక్కడెక్కడ వాగులున్నవో అక్కడ కట్టలు కట్టవచ్చును, చెరువులు వేయవచ్చును. ఈ రెండింటికి ఇందులో స్పష్టంగా దానికి ఇంత, దీనికి ఇంత అని కేటాయించెట్లా నాకు కనిపించలేదు. Minor irrigation scheme లు taken over estates లో చాలా హీన స్థితిలో ఉన్నాయి. వీటిని గురించి నేను పదేపదే ప్లానింగు శాఖామంత్రిగారికి చెబుతున్నాను. వీటి విషయంలో పూర్తి శ్రద్ధ వహించవలసిందే. వీటికి సాధ్యమైనంతవరకు ప్రత్యేకమయిన డబ్బు కేటాయించి మరమ్మ

తులు చేయవలసిందిగా చెబుతున్నాను. బ్రహ్మాండమయిన ప్రాజెక్టులు మాకులేవు; మాకు రావు; మేము అడగము పెద్దవిచేస్తే మేము వద్దు అనము. అక్కడ 100 కోట్లుచేస్తే మాకు 2 కోట్లు ఇవ్వండి. చిన్న వంకలు, వాగులకు ఎక్కడెక్కడ కట్టలు కట్టవచ్చునో ఎన్ని గ్రామాలు లభించగలవనే ఉద్దేశంతో investigation కు తగిన సిబ్బందిని తయారుచేసి 5 సంవత్సరాలు లోపుగా చిన్న పనులు చేయించాలని మనవి చేస్తున్నాను. National rural water supply అని ఒకటి పెద్దది పెట్టారు. 100 గ్రామాల్లో ప్రవేశపెట్టుతామని వ్రాసి ఉన్నారు. ఎక్కడ ఏర్పాటు చేస్తారనే సంగతి ఇందులో మాకు వివరంగా తెలియలేదు 3 చోట్ల పెట్టాము; నాలుగు చోట్ల పెడతామని వ్రాశారు. 3 చోట్లు అంటే 300 గ్రామాలు; 4 చోట్లు అంటే 400 గ్రామాలు. మొత్తం 700 గ్రామాలయినవి. మిగతా గ్రామాలు ఎన్నో ఉన్నాయి. ఈ స్కీము ఇంతటితో నిలిచిపోతుంది. ఇది ఏ విధంగా ఉపయోగకారిగా ఉన్నదనే విషయంలో మంత్రిగారు సెలవు ఇవ్వాలని ప్రార్థిస్తున్నాను ఇది లాభకారిగా ఉంటే జాస్తిగా చేయాలని చెబుతున్నాను. Industries విషయములో కొంచెం చెప్పదలుచుకున్నాను. పెద్ద industries అట్లా ఉండగా, గ్రామాల్లో ఏదైనా industry నుంచి తయారైతే గ్రామంలోనే ఖర్చు అయేట్లా ఉండాలి. భారీ పరిశ్రమలకు భారీ ఉపయోగాలు ఉండవచ్చును గ్రామాదులు వృద్ధి కావాలంటే—గ్రామాలకు ఉపయోగించే కుమ్మరి, కమ్మర, చాకలి - ఈ విధమైనవారు అనేక మంది ఉన్నారు. వారి వృత్తులను వారు చేస్తున్నారు. ఏ విధంగా వాటిని వృద్ధి చేయవచ్చునో అనేటటువంటి ఉద్దేశం గవర్నమెంటువారికి కలుగవలసిందే. గ్రామాలలో మట్టి పాత్రల పరిశ్రమ చాలా ముఖ్యమే. గ్రామాలలో అన్ని పనులు మట్టి పాత్రలతో జరుగుతాయి. మనం ఉపయోగించడానికి లజ్జపడతాము. కాని పింగాణి పాత్ర అయితే ఎంత ప్రియమయినా ఇచ్చి వాడుకుంటాము. ఇది చూడడానికి అందంగా ఉన్నది; అదిలేదు. మట్టి పాత్రల పరిశ్రమలో రంగులు స్వల్పంగా మిశ్రమం చేసి ఆకర్షణీయంగా చేసి, గ్రామాలకు పెద్దవాళ్లువస్తే పింగాణి పాత్రలు తెచ్చి cup సాసర్లు పెట్టకుండా చేసి, గ్రామీణము సులభంగా బాగుపడే మార్గం ఉన్నదేమో అన్వేషించాలని కోరుతున్నాను ఈ విషయమై రాజమండ్రిలో ఏదో పరిశ్రమ ఏర్పాటు చేసినాము అని చెప్పి ఉన్నారు. మట్టివి machinery తయారుచేస్తుంది, దానిని కుమ్మరివాడు తీసుకువెళ్లి పాత్రలు తయారు చేయవచ్చును అని చెప్పారు. రాజమండ్రిలో ఉండవచ్చును; రాజమండ్రి చుట్టుప్రక్కల పనికిరావచ్చును. ఇతర గ్రామాలకు తీసుకురావచ్చునా? ఎంతకాలం వాడుకోవచ్చును? ఇతర జిల్లాల్లో పరిశ్రమలు ఏర్పడడానికి ప్రయత్నం చేయవచ్చునా? ఇతరజిల్లాలలో పరిశ్రమఏర్పాటు

Sri R. B. Ramakrishna Raju] [26th March 1956

చేయడానికి ఏదైనా ప్రయత్నం చేయవచ్చునా అనే విషయంలో గవర్నమెంటు చిన్న pamphlet తయారుచేసి, మట్టి పాత్రలను తయారుచేసే పద్ధతి ఈ ప్రకారంగా అయితే ఇంకా బాగుంటుందని అందరూ వాడుకోవచ్చునని, దీనికి ఫలానా చోట మట్టి ఉన్నదని, అక్కడ మట్టిలో ఉండే విశేషం ఇది అని, అది అందడానికి ఈవిధంగా చేయవలసిందనే విషయాలన్ని గ్రామాల్లో అందరికి తెలిసేట్లు గవర్నమెంటువారు ప్రచురించాలని ప్రార్థిస్తున్నారు. Blacksmithy కి training centres పెడతాం అన్నారు, ఎక్కడ పెడుతారు? ప్రతి జిల్లాకు పెడతారా? అక్కడక్కడ జిల్లాల్లో ఎక్కడయిన పెడతారా? మామూలు ఉపకరణాలు కాకుండా మంచి ఉపకరణాలు ఇవ్వడానికి ఏమైనా ప్రయత్నంచేస్తారా? దీనిపై కూడా ఒక pamphlet ఇవ్వాలని కోరుతున్నాను. ఇవన్నీ ప్రతి జిల్లాలో చేయవచ్చును. డబ్బు ఉంటే ఎన్ని చోట్ల అయినా చేయవచ్చును. దీనికి తగిన ప్రయత్నంచేసి ప్రతి జిల్లాలో ఒక centre ఉండేట్లు ప్రయత్నం చేయాలి అని కోరుతున్నాను. Japan machinery ఏదో ఉన్నదని వింటున్నాము. చీలలు, గడియలు, మగలు, hinges చేయడానికి స్వల్పమయిన machinery ఉన్నదని ఎవరో చెప్పారు. దాని వివరాలు తెలియవు. ఇది నిజంగా ఉన్నదా? గవర్నమెంటువారు తయారు చేయవచ్చునా? Private గా ఎంత వెల అవుతుంది? ఈ వివరాలన్నీ తెలియచేస్తూ ఒక చిన్న పుస్తకంవేస్తే 10 వేలు, 20 వేలు పెట్టి చేయడానికి సౌకర్యంగా ఉంటుంది కాబట్టి ఆ విషయంకూడా అందరికి తెలిసేట్లు చేయాలని కోరుచున్నాను వాగులకు, చెరువులకు repair చేయడంకంటె తగిన లోతులకు పోతే నీరు దొరకుతుందనే మంచి సూత్రం ఒకటి ప్రబలంగా ఉన్నది. బైట నీళ్లు లేని స్థలాల్లో గవర్నమెంటువారు తనిఖీ చేయించి deep wells త్రవ్వించి ప్రజలకు ఉపయోగకరంగా ఉండేట్లు చేయాలని ప్రభుత్వంవారిని ప్రార్థిస్తున్నాను.

Rural electrification విషయంలో చెప్పవలసిన పనిలేదు. ప్రభుత్వంవారు electricity మీద చాలాఖర్చుచేసినారు. దానిని గురించి అందరూ ఒప్పుకోవలసినదే అయితే గ్రామాదులలో electricity వస్తుంది. దీపాలు వేసుకొని కూర్చోవాలనే ఆశ, సంతోషంకాదు. గ్రామాలకు ఎలక్ట్రిసిటీ వస్తుందంటే వ్యవసాయానికి ఉపయోగపడేటట్లు కావలెను అనే కోరికఉన్నది. కాబట్టి మాకు ఎంత త్వరలో వ్యవసాయానికి ఉపయోగపడేటట్లు గ్రామాలకు విద్యుచ్ఛక్తిని విస్తరింపచేస్తే అంత బాగుంటుంది, ఆ ప్రకారము ఇప్పుడు చేసే ఖర్చంతాకూడా కొంతవరకు వినియోగించవలసివదని చెప్పుచున్నాను.

26th March 1956] [Sri R. B. Ramakrishna Raju

ఇక rural housing కూడా వేసినారు. రాబోయే 5 సంవత్సరాలలో 185 ఇండ్లకు ఏర్పాటుచేస్తాము అని వ్రాసిఉన్నారు. అందులో co-operative rural housing scheme క్రింద rural housing కు, 185 వేలు అని అన్నది. ఈ పనిని ఏవిధముగా చేస్తారు ? Rural co-operative society ఏర్పాటుచెసినట్లయితే అది ఏవిధముగా చెయ్యవలెనో గ్రామాదులలో అందరికి information తెలియచేసి నట్లయితే ఈ 185 వేలే కాదు పదింతలు అయినా ఖర్చుపెట్టవచ్చును ఈ అయిదు సంవత్సరాలలో యిండ్ల సౌకర్యము కలుగచేస్తే మన గ్రామాలలో పూరిగుడిశలకు అగ్నిభయము లేకుండా చెసికొనవచ్చును ఇటు వంటి కార్యక్రమము జరిగితే ఇతర అన్నిజాతులకు ఉపయోగపడేటట్లు అవుతుంది కాబట్టి ముఖ్యముగా estates లో దీనిని ప్రత్యేకమైన శ్రద్ధవహించి మంత్రిగారు దీనికి ప్రయత్నము చెయ్యవలెనని కోరుచున్నాను.

ఇంకొకటి చెప్పవలెనని ఉన్నది. కాని కడుపులో చల్లగ లేకపోతే సంగీతంగాని పద్యంగాని, పాటగాని బైటికిరాదు

" నిరుపహతి స్థలంబు . . . . . . " అని

పెద్ద పద్యం పెద్దన్నగారు చెప్పారు. ఆ ప్రకారం ఇక్కడ లలితకళలు బైటికిరావు. లలితకళలు పెంపొందించాలి బ్రహ్మాండమైన ప్రాజక్టులు కట్టామంటే చాలదు. అజంతా గుహలు చూచి ఆనందిస్తున్నాం. అజంతా hair styles స్త్రీలు పెట్టుకుంటున్నారు, ఈ ప్రకారముగా అమరావతిలో ఉండే సంస్కృతిని చూచి ఆనందపడుతున్నాము. అజంతా caves ఎన్నివేల సంవత్సరాలు అయిందో అట్లాగే ఉన్నాయి. కాబట్టి నిరంతరముగా స్థిరముగా స్థాయిగా ఉండేటటువంటి మన సంస్కృతికి ఒకరూపము కల్పించి ఈనాడు లలితకళలే వృద్ధికావాలి. ఆ కళలకు చాలా ప్రియులైన ప్రధానా మాత్యులు ఉన్నారు. Development శాఖా మాత్యులవారు వ్రాసినదానిలో ఎంతమాత్రము చూచినా ఎక్కడా కళ ఏమీ లేదు.

THE HON. SRI K. VENKATA RAO :— అకళ వాదగ్గర లేక.

SRI R. B. RAMAKRISHNA RAJU :—కాబట్టి ఇందుకుకూడా కొంతమొత్తము కేటాయించి కళలకు దోహదమిచ్చి తగినప్రోత్సాహము చెయ్యవలెను అని ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

SRI M. RAJESWARA RAO .—Mr. Speaker, Sir, while commending in general terms the draft Second Five Year Plan now before us I would take this opportunity to offer a few observations on the implication of the basic industrial policy envisaged in the draft plan The objectives of the plan are stated to be an increased income, a corresponding increase in the standard of living, rapid industrialisation creating more opportunities for employment and reducing inequalities in income , and I have no doubt that all these four objectives are inter-related. When we want to achieve the first two objectives naturally there should be increased production and increased industrial development and increased industrial development creates new opportunities for employment. I would request.........

SRI B. RAMA REDDI .—శ్రీ రాజేశ్వరరావుగారికి మంచి తెలుగు తెలుసును. వారు తెలుగులో మాట్లాడితే బాగుంటుంది.

MR. SPEAKER :—He can speak in any language he chooses. Nobody can curtail his right.

SRI M. RAJESWARA RAO :—Sir, industries are widely talked of as playing a very important role in the Second Five Year Plan. But when I look at the figures I am really surprised at the amount allotted for industries in the draft plan. For it constitutes only 19 per cent of the total amount. So I cannot understand, under the circumstances, how we can achieve the two objectives if industries are allowed to grow at this rate. Besides the scanty provision for industries, I am very much worried about one thing , and that is the growing tendency among some of our important leaders to subordinate their own convictions on national economy—I

mean the interest of national economy—to fissiparous political agitations of a temporary nature. Things which are basically national in character are turned down as anti-national in character on political grounds. Sir, it is only due to this subordination of convictions on national economy to fissiparous tendencies of a political nature that is responsible for laying too much emphasis on cottage industries, and my friend is justified in referring to the importance of the cottage industries. Sir, it is common knowledge that 'cottage industries' means reduced production and collosal sacrifice of the consumers and the continuance of the antiquated social order of a communal nature So, Sir, I cannot understand this spoon feeding of cottage industries unless it is only a stop-gap device, a temporary expedient, an ad hoc measure to support cottage industries, until major industries grow in numbers. Now I ask the question, as to what made the Government of India or the Planning Commission—whoever it is—to lay so much emphasis on cottage industries. Is it because they produce more economically than what the mills produce, or is it because that they produce better goods than what the mills produce, or is it because they produce cheaper goods than the mills produce ? I want an answer. But I am afraid that the Planning Commission or the person responsible for the framing of this plan was influenced by Sri V. L. Mehta, the President of the All India Khadi Board. For he said that mill production should be stopped.

Sir, then the question arises as to how we can solve the unemployment problem My only submission is this: We cannot sacrifice 100 persons in our anxiety to save one person. If we cannot provide employment through industries let us tap other resources which will not come into conflict with the productive capacity of the industries. I therefore venture to say that the conception of an equal emphasis on both cottage and major industries is not only conflicting but an illusion. It is mysterious to think that India will be able to reconcile the exacting demands of an atomic age and a nuclear era and a synthetic revolution with the imaginary

virtues of a by-gone epoch, represented by man-made goods as opposed to machine-made goods. The vision of a peaceful and contented countryside is conjured up, while in fact there being no intention to cut adrift from the world current clearly shows a tendency towards a new kind of industrial revolution. Hon Members are well aware of the importance of industry to this country If we look into the figures of 1954-55 we find that the total net value of the export of leather goods in India came to 26 1 as against 35·2 in 1951-52. While this is the position, the Planning Commission have not carefully thought of this aspect of the matter. Besides, Sir, in the Plan it is shown that the total requirements of finished leather goods in the country at the end of the Plan period is 100 million pairs. But the productive capacity of the existing mills in our country is only 5.97. It is expected to increase production by 2 2 millions, thus making the total 8 1 million pairs of shoes at the end of the Plan Period. Now, Sir, while this is the position, I shall also submit that about 35 lakhs of the people of this country are entirely dependent on tanning industry. Again I have to submit that there is a lot of deficiency in leather goods and when we require 92 million pairs of shoes at the end of the Plan period, what made the Government of India export so much of raw leather goods, I mean, to the tune of 34·2 crores and import finished goods. So another aspect of the question is that 35 lakhs of people are thrown out of employment by the sudden closure of several tanneries in several centres due to the lack of support from the Government, and therefore, Sir, any Plan which does not envisage providing employment for the 35 lakhs of people cannot be commended by a representative of these unfortunate victims. I have been making representations year after year to the Planning Commission and the State and Central Governments. I hope our Hon Minister for Planning would use his good offices to secure a fair treatment to these persons who are thrown out of employment.

So far as distribution is concerned I will submit only one thing. Distribution is as important as production itself in

the improvement of our national economy. Therefore my only wish is that there should be a fair treatment to the producer as well as to the consumer so far as distribution is concerned While I cannot give any concrete suggestion as to the device by which that fair treatment can be meted out I can only commend the revival of the producer-cum-consumer co-operative societies as envisaged by our veteran Andhra leader.

Then, Sir, I come to my last point Whenever I think of national development I am always confronted with one problem That is the magnitude of the problem of population in this country. I am reminded of the application of the Malthusian theory of population. It is stated in the Plan that the population of the country is growing from 45 5 to 50 lakhs every year. At this rate the population of the country would be double after a period of sixty years. It has been envisaged in the Plan that the Government are going to provide employment to 18 lakhs of people every year, that is, forty per cent of the new growth. I request the Government in all earnestness, to understand the implications of this matter. The Malthusian theory of population is known to all people. While population increases in geometrical proportion, that is, 1, 2, 4, 8, 16 etc., the means of subsistence increases in arithmetical proportion only that, is, 1, 2, 3, 4, 5 and so on. This appears to be a race between the hare and the tortoise. Unless we stop the hare at some stage the tortoise cannot reach it. So I feel the Planning Commission unfortunately without carefully examining this question of population went on increasing food products and also of creating employment for 18 lakhs of people. I submit at some stage the Law of Diminishing Return will certainly operate, and we will once again be confronted with the same old question. I wish, Sir, that this problem is carefully examined, i e. the prevention of unusual growth of population, either by suitable legislation or some effective preventive checks. In no other way can we solve this problem. I hope the Planning Commission and the Government will examine this aspect in all seriousness before finalising the draft plan. Thank you, Sir.

MR. SPEAKER :—That is why family planning is recommended to you.

SRI C. SUBBARAYUDU .—అధ్యక్షా, మనం యిప్పుడు రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా చర్చించే సందర్భంలో కొన్ని విషయాలు దృష్టిలో పెట్టుకోవాలని నమ్ముతున్నాను. ప్రధానంగా ఏ ప్రణాళిక రచించినప్పటికీ, అమలు పెట్టినప్పటికీ దేశసంపదను పెంపొందించడం ఆ సంపదను పెంపొందించడమే కాకుండా ఎవరికి ముఖ్యంగా అవసరమో ఎవరు దీనులుగా ఉంటారో వారికి ఆ సంపదలు చెందేటట్లుగా ఆ ఫలితాన్ని అందేటట్టుగా చేయడం అనేది యీ ప్రణాళిక ప్రధానలక్ష్యం. దేశం మొత్తంపైన ప్రపంచంలో ఎక్కడైనా సంపదలను పెంచాలంటే నాకు తెలిసినమేరకు రెండేమార్గాలున్నాయి. ఉత్పత్తి సాధనాలు కొత్తవి కనిపెట్టడంవల్ల ఉత్పత్తిని విపరీతముగా పెంచి దానితో దేశ సంపదనుపెంచి దానిని సరైనటువంటి మార్గాల్లో అందరికీ అందేటట్టుగా చేయడం అనేటటువంటి విధానం ఒకమార్గం. రెండోది మనం యితరపాశ్చాత్య దేశములతో పోల్చిచూసుకున్నప్పడు scientific research లో వారితో పోటీచేయ లేని పరిస్థితులలోనున్నాం. కనుక మన దేశంలో ఉండేటటువంటి అన్నివృత్తులవారు 8 గంటలకు బదులు 10 గంటలు పనిచేయడం, రూపాయి సంపాదనలో ఏ 0—12—0 ఖర్చుపెట్టి 0—4—0 మిగిల్చి దానిని పెట్టుబడిగా ఉపయోగించుకొని ఉన్నటువంటికొద్ది ఉత్పత్తి సాధనాలను ఉపయోగించుకుని పనిచేయడంవల్లనే మనదేశాన్ని మనం దారిద్ర్యంనుండి విముక్తి చేయగలుగుతాం. దేశ సంపదను పెంచుకోగలుగుతాం. కనుక యీ లక్ష్యంతో మనప్రణాళికను చూచుకున్నప్పుడు మనకున్నటువంటి జనసంఖ్యను మాత్రం ఆధారంగా చేసుకుని దీనిని ఏవిధంగా చేయడం అనేది దృష్టిలోపెట్టుకోవాలి. నిజమే మనదేశం వ్యవసాయికదేశం, నూటికి 70 మంది వ్యవసాయంపైన ఆధారపడ్డారు. అందులో మూడవభాగం యితర వృత్తులలో ఉండేటటువంటి వారున్నారు. కనుక రెండుభాగాలుగా దీనిని విభజించుకోవచ్చు. ఉన్నటువంటివారికి ఉన్నటువంటి వృత్తులలో చాలినంత ఆదాయం లేదు. కనుక వారికి ఉపవృత్తులు కల్పించి వారి ఆదాయం పెంపొందించడం అనేటటువంటిది ఒక ముఖ్యమైనటువంటి విషయం. రెండోది యితరులకు, నిరుద్యోగులుగా వుండేటటువంటివారికి ఉద్యోగం కల్పించి ఆవిధంగా వారి శ్రమతో దేశసంపద పెంపొందించడం. నూటికి 70 మంది వ్యవసాయంపై ఆధారపడి ఉండేటటువంటి దేశం అంతటిలో ఏ 40 వంతులుకో భూములుండడం తటస్థించినప్పుడు మిగతావారికి ఏవిధంగా ఉపవృత్తులు కల్పించడం అనేది ప్రధానసమస్య. వ్యవసాయంతోపాటు యితరవృత్తులను కల్పించినప్పుడే అది సాధ్యమవుతుంది. తక్కువ పెట్టుబడితో ఎక్కువమందికి పని కల్పించి ఆ ఆదాయం

నలుగురికీ సమానంగా పంపిణీ అయేటట్టుగా చేసినప్పుడే జీవనప్రమాణం పెంచడానికి అవకాశం కలుగుతుంది. Socialistic pattern of society తీసుకు రావడానికి అవకాశం ఉంటుంది. కనుక ఆ దృష్టితో ప్రణాళికను తీసుకున్నప్పుడు మనం దేశాన్ని industrialise చేయాలి అని ఎంత చెప్పినప్పటికీ, basic industries పెద్దపెద్ద machinery లు మనదేశంలో పెట్టవలసిన అవసరం ఎంత ఉన్నప్పటికీ ప్రధానంగా ఎక్కువమందికి జీవనోపాధి కల్పించేటట్టుగా రోజుకు 0 4-0, 0-8-0 సంపాదించకలిగేటట్టుగా వీలు కల్పిస్తేతప్ప జీవనప్రమాణాన్ని పెంచలేము, socialistic pattern of society achieve చేయలేము అన్నే టటువంటిది నా దృఢవిశ్వాసము. తరువాత రాజేశ్వరరావుగారు మాట్లాడుతూ కుటీరపరిశ్రమలు ఏమిచేయగలుగుతాయి అని అన్నారు. అలా వాదించేవారికి ఒకటే మనవిచేస్తున్నాను. ఈ atomic energy దినాలలో తక్కువపెట్టుబడితో మన శక్తిలోపుగ ఉన్నటువంటి ఏ పరికరమైనా లక్షలమందికి పని కల్పించేటట్టి అవకాశం ఏదయినా ఉన్నదా ? అటువంటి machinery ఏదయినా ఉన్నదా ? అది సాధ్యమవుతుందా ? కాదనేటటువంటిది ప్రతిఒక్కరూ ఎరిగినటువంటిదే. అటువంటి పరిస్థితులలో మనం చేయగలిగింది ముఖ్యంగా 2 లక్ష్యాలుగా ఉండాలి. ఏ పరిశ్రమనైనా పెట్టినప్పటికీ దానికి ఉపవృత్తిగా cottage industries ను ప్రోత్సహించవలసి ఉన్నది. అలాంటప్పుడు భారీపరిశ్రమలకు, కుటీరపరిశ్రమలకు బద్ధవిరోధం లేకుండాచేయగలిగినప్పుడే యిది సాధ్యమవుతుంది. కోటయ్యగారు మాట్లాడుతూ మగ్గాలసంగతి చెప్పారు. మగ్గాలకు మిల్లుల పోటీ? Hand pounding of rice ప్రోత్సాహించడంకోసం 8 కోట్లు కేటాయించడం జరిగింది. అది మన రాష్ట్రంలోని మిల్లులకు బద్ధవిరుద్ధముగా ఉండినప్పుడు ఏవిధంగా సాధించడం ? అదేవిధంగా నూనెగానుగలు expellers వీటికి పరిమితం పెడితేతప్ప నిర్దుష్టమైన policy ఉంటేటప్ప దృఢనిశ్చయం ఉంటేనేతప్ప దానిని సాధించడం దుర్లభం. పెద్దపెద్ద పెట్టుబడిదారులు, ఎవరైతే భారీపరిశ్రమలపై లాభం పొందుతూ ఉన్నారో ఎవరిచేతులలోనైతే ఆ పరిశ్రమలున్నాయో వారిపైన నిర్మొగమాటంగా ఆంక్షలు పెట్టాలి అప్పుడే చేతివృత్తులు కల్పించడానికి అవకాశం ఉంటుంది. జీవనప్రమాణం పెంచడానికి సాధ్యమవుతుంది ఎప్పుడైతే జీవనప్రమాణం పెరిగిందో అప్పుడు National savings పెరుగడానికి, పెట్టుబడులు రావడానికి అవకాశం ఏర్పడుతుంది. ఆంధ్ర దేశంలోనే కాకుండా భారతదేశంలో పెట్టుబడి పెట్టేందుకు చాలమంది ఉత్సాహం పడడంలేదంటే రూపాయికి 2-0-0 వడ్డీ గిట్టుబడి అవుతున్నప్పుడు పరిశ్రమలకై పెట్టుబడిని వినియోగించే దానికన్నా వడ్డీలవల్లనే ఆదాయం రావడానికి అవకాశాలున్నప్పుడు ఆ అవకాశాలు వినియోగించుకోడం సహజం, అది మానవ లక్షణం, అటువంటి అవకాశం

Sri C. Subbarayudu] [26th March 1956

లేకుండా ఏనాడు చేయగలమో ప్రజలదృక్పథం పరిశ్రమలపై పెట్టుబడి పెట్టి దేశసంపద పెంచడంపై మరల్చగలమో ఆ మూలసిద్ధాంతాలు ఆ విధంగా చేసినప్పుడు జీవన ప్రమాణం పెంచగలము. నాకు తెలిసినంతవరకు తక్కువ పెట్టుబడితో ఎక్కువ మందికి ప్రయోజనం కలిగించేది ఒకటి అంబర్ చరఖా, రెండోది hand pounding mill.

దేశసంపదను పెంపొందించడానికి, ప్రతిఒక్కరికీ ఇంకా ఎక్కువ ఆదాయము కలిగేట్లుగా కొత్త పరికరములు కనిపెట్టి అందరికి పనిచూపాలి. ఇంకొకరిని దోపిడి చేయకుండా ఒకరికి తినడానికి ఉండేట్లుగా ఏనాడు సంఘాన్ని నిర్మాణము చేస్తామో, వృత్తులను కల్పిస్తామో, వ్యవసాయము కానీయండి, పరిశ్రమలను కానీయండి, ఏనాడైతే ఏర్పాటుచేస్తామో, ఆనాడే మనం సోషలిస్టిక్ సిద్ధాంతమును అమలు పరచగలము. ఏదో ఉత్పత్తిపెంచి ఒకరికి బొజ్జపెరిగేటట్లుగాచేసి, ఇంకొరరికి తిండిలేక మలమల మాడేట్లుగా చేస్తే అది సార్థకమైన పనికాదు. ఎన్నాడైతే ఖచ్చితముగా మనం ఈ పనులు నెరవేరుస్తామో ఆనాడు దానిని సాధించడానికి అవకాశము ఏర్పడుతుంది. వ్యవసాయానికి ఉపవృత్తి పాడిపంటలు అంటారు. నిజంగా మనం ఆ ప్లాను ప్రకారం మన పశుసంపదలను పెంచాలి. పాలతో తయారుచేసే వస్తువులు, cream, butter, cheese ghee, వీటినన్నింటిని ప్రోత్సహించినప్పుడే ఈ పశుసంపదను ప్రోత్సహించడానికి అవకాశము ఏర్పడుతుంది. ప్లానింగులో dairy క్రింద 82 కోట్ల రూపాయిలు కేటాయించారు. ఆంధ్రదేశం ఈనాడు వ్యవసాయదేశం అయినప్పటికి, పుష్కలంగా నీళ్లు ఉన్నప్పటికి, పశువులకు మేతఉన్నప్పటికి మనం పశుసంపదను అభివృద్ధి చేయడములేదు. 22 యూనియన్లు, 12 ప్రైమరీ సంఘాలు 7 పాలపాడి తయారుచేసే ఫ్యాక్టరీలు ఈ పంచవర్ష ప్రణాళికలో పెట్టినట్లుగా అనుకున్నాను. 4 పశువులను పెట్టుకొని, ఒక చిన్నక్రీము సెపరేటరును పెట్టుకున్నట్లయితే రోజూ సులభంగా వెన్నను విడదీయవచ్చును. Cream milk, curd అన్నీ చేసుకోవచ్చును. పాలు త్రాగవచ్చును. Cream అంతా వారమునకు ఒక పర్యాయము చిలికినట్లయితే వెన్నవచ్చును. అది నెయ్యిగా అమ్ముకోవచ్చును. Butter గా అమ్ముకొనవచ్చును. 5, 6 పశువులు ఒక పల్లెటూర్లో పెట్టుకుంటే ఒక కుటుంబమునకు జీవనాధారము కలుగుతుంది. 10 పశువులను పెట్టుకొని, పురాతన పద్ధతులతో కవ్వముతో చిలికి, వెన్న తయారుచేసి, నెయ్యి తయారుచేయడము అంటే, అది సాధ్యము అయిన పనికాదు. ఆ విధంగా మనం cream ను సప్లయిచేయడములో, creameries ను ప్రోత్సహించడములో ఎక్కువ శ్రద్ధ తీసుకున్నట్లయితే కొందరికి ఒక ఉపవృత్తిని కల్పించిన వారమవుతాము.

ఖాదీపరిశ్రమలు, చిన్న చిన్న పరిశ్రమలుకూడా చాలాఅవసరము. ఏఏప్రాంతానికి అవసరమైన వస్తువులు ఆ ప్రాంతములోనే తయారయ్యేట్లుగా చూడాలి. రవాణాలు కూడా విపరీతంగా తగ్గించడానికి అవకాశము ఉంటుంది. దానివల్ల నిరుద్యోగ సమస్యను తీర్చడానికి అవకాశము ఉంటుంది. అటువంటి పరిశ్రమలను పెట్టేందుకు తగినచర్యలు తీసుకోవాలి. పెట్టుబడి విధానంద్వారా పెట్టుకునేందుకు అవకాశము కల్పించాలి. ప్రభుత్వానికికూడా దానిపైన బాధ్యత ఉంటుంది. Co-operative Society ల నడవడిలో చాలామందికి అనుమానాలు వస్తున్నాయి. అందువల్ల ఆ చట్టమును సవరించడానికి చర్యలు తీసుకోవాలి. ప్రజలకు నమ్మిక కల్గించినవాడే పెట్టుబడులు పెట్టుటకు ప్రజలు ముందుకువస్తారు. వాటిని భద్రంగా తీసుకు రావడానికికూడా అవకాశము ఉంటుంది. దానివల్ల మనకు లాభము ఉంటుంది. దేశ కళ్యాణానికి తోడ్పడినవారము అవుతామని నమ్మకంతో వారు పెట్టుబడులు పెడు తారు. అందువల్ల ప్రభుత్వంవారు అటువంటి సత్వరచర్యలు తీసుకోవాలని కోరు తున్నాను.

Sri K. SUBBA RAO :—అధ్యక్షా, ఇది రెండవ పంచవర్ష ప్రణాళిక. మొదటి పంచవర్ష ప్రణాళిక అభ్యుదయ మార్గములో ప్రజలయొక్క ఆకలిని, అన్న వస్త్రాలను, కొంతవరకు తీర్చిందని, ఇంతవరకు అందరు మాట్లాడిన విషయములను బట్టి, మన అనుభవాన్నిబట్టి తేలింది. రెండవ పంచవర్ష ప్రణాళిక లక్ష్యము, మన స్వాతంత్ర్యమునకు, సంప్రదాయానికి, సంస్కృతికి, అనుగుణంగా రూపొందించ బడింది. నిన్నటిరోజున మిత్రులు ప్రతిపక్షనాయకుడు అయిన శ్రీ సుందరయ్య గారు మాట్లాడుతూ, చైనా అంత చేస్తున్నది, ఇంత చేస్తున్నది అని, కట్టకడప టికి చైనాతో సరితూగగల అభివృద్ధి మనకు లేదు అన్నారు. చైనా సిద్ధాంతమే వేరు. ఆదోపిడి విధానముగాని, ఆ నిర్బంధ విధానముగాని, మనం అమలుపెట్టే పరిస్థితిలో లేము. పెట్టదలచుకొనలేదు, పెట్టకూడదనికూడా నిశ్చయించు కొన్నాము. అంతమాత్రముచేత వారితో సరితూగవలసిన అవసరములేదు. మన సాంప్రదాయానికి అనుగుణ్యంగా, మన సిద్ధాంతానికి అనుగుణంగా, ఈ పంచవర్ష ప్రణాళికను రూపొందించుతున్నాము. ఈ ప్రణాళికవల్ల ప్రజలకు అశన, వసన, నివాససౌకర్యాలు ఏర్పాటుచేసి, బుద్ధిమంతులుగాను, బలవంతులుగాను, భాగ్య వంతులుగాను, చేయడానికి తగిన కార్యక్రమంగా ఇది రూపొందించబడింది. ఈ ప్రణాళికనుగురించి దేశంలో తగినప్రచారం జరగడము లేదు. దానిని ప్రజలలోబాగా ప్రచారంలోకి తీసుకొని రావలయును. దానికిగాను మంత్రిగారు ఒక్క చక్కని మిష నరీని తయారుచేయించి ప్రజలలో నూతన ఉత్సాహాన్ని, నూతన ఉత్తేజాన్ని కల్పిం చేసే ప్రయత్నం చేయాలి. అవసరము అయితే ఒక మంత్రిని దేశంలో ప్రచారం

Sri K. Subba Rao] [26th March 1956

చేయడానికిగాను ఏర్పాటుచేయవలయును. మన ముఖ్యమంత్రి విద్యాశాఖమంత్రిగా కూడా ఉన్నారు. కాబట్టి ప్రతి హైస్కూలుకుకూడా ఆదేశాలను పంపించి ప్రజా సముదాయములో పంచవర్ష ప్రణాళిక అభివృద్ధి కార్యక్రమాలు, ప్రణాళికలక్ష్యం, ప్రణాళిక ఎట్లాచేస్తె బాగుంటుందో, ప్రచారానికి తీసుకొని రావలయును. అవసరము అయితే కొంతమంది ఉపాధ్యాయులకు గౌరవవేతనము ఇచ్చి వాళ్లతో చక్కగా ప్రచారముచేయించే ప్రయత్నము చేయాలి. ఎప్పుడు అయితే ఆ విధంగా ప్రచారము చేస్తామో, అప్పుడు ఈ ప్రణాళిక ఇంకాయెక్కువ విజయాన్ని పొందగలదని చెప్పగలము.

పెద్ద పెద్ద పరిశ్రమల గురించి అనేకవిధాలుగ పెద్దలు అందరూ చెప్పినారు. పరిశ్రమలకు కావలసిన మూలధనము, ముడిపదార్థము. ఆ పరిశ్రమలో తరిఫీదుపొందిన జనులు ఎంతమంది ఉన్నారో చక్కగా లెక్కగట్టి ఆ పరిశ్రమలను ఏర్పాటు చేసుకో వలెను. అంతేగాక ఇప్పుడు స్థాపించబడిన పరిశ్రమలను చక్కగా నిర్వహించినట్లయితే దేశం కొంతముందుకు పోగలదు. పల్లెటూరు ప్రజలలోగల నిర్వ్యాపారత్వాన్ని, నిరు ద్యోగాన్ని నిర్మూలించేందుకు మిత్రులు కోటయ్యగారు, సుబ్బారాయుడుగారు చెప్పినట్లు పరిశ్రమలలో కుటీరపరిశ్రమలను నెలకొల్పగల పథకాన్ని ప్రభుత్వం రూపొందించవలసిన అవసరం ఎంతేనాఉన్నది. ఇంతవరకు ఎక్కడో ఒకబోర్డుకు కేంద్రప్రభుత్వంవారు డబ్బుయిస్తామన్నారేగాని అలాఇచ్చిన ఉదాహరణ ఎక్కడా లేదు. కేంద్రప్రభుత్వానికి ఈ విషయమై సరైన పద్ధతిలేదు. కనుక ఆంధ్రప్రభుత్వమే బాధ్యత వహించి పల్లెపల్లెలలో, ఎక్కడెక్కడ, ఏయే పద్ధతిని యీ కుటీరపరి శ్రమలను ప్రోత్సహించినట్లయితే బాగుంటుందో అన్నవిషయాన్ని పరిశీలన చేయాలి.

అంతకన్న ఎక్కువగా వ్యవసాయం గురించి చెప్పవలసిఉన్నది. మిత్రుడు సుందరయ్యగారు చెప్పినట్లు కనిష్ఠ లేక గరిష్టపరిమితులను ఏర్పాటుచేసి తీరవలెను. అఖిలాంధ్రం ఏర్పాటు అయేలోపుగా మన ప్రభుత్వం భూసంస్క రణల్లో ఈ సమస్యనుగురించి జాగ్రత్తగా పరిశీలించి మనదేశానికి అనుగుణంగా చక్కని చట్టాన్ని తయారుచేయవలసి ఉన్నదని ప్రార్థన చేస్తున్నాను. కొందరు సభ్యులు అడిగినట్లు భూసమస్యతోపాటు ధనసంపాదనకుగూడ ఒక పరిమితి పెట్ట వలసిన అవసరము చాలఉన్నది. "లక్షాధికారైన లవణమన్నమె కాని మెరుగుబంగా రంబు మ్రింగబోడు" అని ఒక నానుడిఉన్నది. ఏమనిషిగూడా సంవత్సరానికి 20 వేల రూపాయలకు మించి సంపాదించుకోవలసిన అవసరంలేదు. దానితో అందరూ ఏకీభవించవలసినదే. 20 వేలకు మించిన సంపాదనకు ప్రయత్నములు చేసేవాడు ప్రజలను దగాచేసి ధనాన్ని సంపాదించడం జరుగుతుంది. దూపరదండిచేసి దుఃఖ మయమైన జీవితాన్ని తాను అనుభవించడమేగాక ప్రజలను దుఃఖంలో మగ్నంచేసే

ప్రయత్నమే అది. అలాగాక డబ్బు సంపాదించినవారంతా "మేము దేశసౌభాగ్యానికై పెద్ద పెద్ద పరిశ్రమలకు మూలధనాలను యిస్తాము" అని అంటే వారి దగ్గరనుండి ధనాన్ని సేకరించి వారి పరిమితి ఎంతో అంతవరకు సరిచేసేదానికి ఆంధ్రదేశంలో ఒకవిధానాన్ని ఏర్పాటు చేయవలసినదని నేను ప్రార్థన చేస్తున్నాను.

నీటి పారుదల సౌకర్యాలగురించి సభ్యులు అనేకవిషయాలు చెప్పినారు నీటి పారుదలకై యిప్పుడు వేసినపథకాలు చక్కగా నిర్వర్తించినట్లయితే ప్రజలలో ఉత్సాహంపుడుతుంది గ్రామగ్రామానికీ, ఊరూరికి నీటిపథకాలు వేస్తారా ? అనేటటువంటిది పంచవర్ష ప్రణాళికలో వచ్చేటటువంటి విషయంకాదు. అది నిత్యనైమిత్తిక వ్యవహారాల్లో, ప్రభుత్వం చేస్తుండే కార్యక్రమాలలో అక్కడక్కడ ఉండేటటువంటి అధికారులుచేసే వ్యవహారం అది. ఈ కార్యక్రమాన్ని ఆయా గ్రామాలలోగల అధికారులే రూపొందించుకోవలసిన బాధ్యతఉన్నది. వ్యవసాయ విషయంలోను, నీటి పారుదల విషయంలోను యిప్పుడు వేసుకున్న పథకాలను, తీసుకున్న పనులను పూర్తిగావించి ప్రజలలో ఉత్సాహాన్ని కలుగజేయవలసిందని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

జాతీయ విస్తరణ ప్రణాళిక, సమాజ నివాసవిస్తరణ ప్రణాళికలనే అపూర్వ పద్ధతులను దేశంలో ప్రవేశపరచి గ్రామప్రజలలో నవ్యతను, చైతన్యాన్ని ప్రభుత్వం వారు పురికొల్పుతున్నారు. నేను ఒక సమాజవికాస కేంద్రంనుండి వస్తున్నవాణ్ణి. అక్కడఉండే ప్రజలలో "నేను, ప్రభుత్వం ఒక్కటే ప్రభుత్వం చేసేపనులకు సహకారంచేసి పరిస్థితులను చక్కచేసుకోవా"లనే భావం దినదిన ప్రవర్ధమాన మవుతున్నది. కాని అక్కడ కనబడే ఒక్కలోపాన్ని మాత్రం స్పష్టపరుస్తాను. ఇప్పుడు కేటాయించిన డబ్బుతోనే, జాతీయవిస్తరణ ప్రణాళికల్లోగాని, సమాజవికాస ప్రణాళికల్లోగాని ఈ లోపాన్ని సరిదిద్దుకోవచ్చును. ఎక్కడో సామర్లకోటలోనో, లేక బాపట్లలోనో గ్రామసేవికా విద్యాలయాలు నెలకొల్పుతున్నామని చెప్తున్నారు. అలాగాకుండా ప్రతివికాస కేంద్రంలోను చక్కటి అభ్యుదయ కళాశాల నొకదానిని పెట్టండి అలాంటి కళాశాలను నెలకొల్పితే గ్రామపరిస్థితి బాగుపడుతుంది. నిరుద్యోగసమస్యను నిర్మూలించగల్గుతాము. ఈ రోజున విద్యలేక కాదు దేశం నాశనమాతున్నది. కొంతవరకు చదివి నిరుద్యోగులగాఉన్న జనం వల్లనే. నాల్గులేక ఆరవఫారముదాకా చదువుకొని, సిగరెట్లకు సినిమాలకు అలవాటు పడి పోకిరీలయి, దొంగలయి దేశాన్ని అనేకవిధాలుగ దుఃఖంలో ముంచేజనం గ్రామాలలో ఎక్కువగాఉన్నారు. వాళ్ళతప్పుకాదు అది. అది ఈనాటి విద్యలోని ముప్పు. వెనుకటి ప్రభుత్వం, యింకా అదేపద్ధతుల్లో పోతున్న ఈ ప్రభుత్వాలు యిస్తున్న విద్యల్లోనితప్పు. ఆ మాత్రం చదువు నేర్పినవాడు ఘంటకొట్టకపోతే

Sri K. Subba Rao] [26th March 1956

పనికిరాడు. సేద్యానికి పనికిరాడు. ఈలాంటి పరిస్థితులవల్ల తమ పిల్లలను చదివించిన అనేకమంది తల్లిదండ్రులు బాధపడ్తున్నారు. అటువంటి పిల్లలకుతగిన చదువు చెప్పించేదానికి, ఒకలక్షరూపాయలు ఖర్చుఅయినాసరే, ప్రతివికాస కేంద్రంలోను ఒక కళాశాలను ఏర్పరచాలి ఒకవిద్యావిషయంలోనే కాకుండా, వైజ్ఞానిక విషయాలన్నీ వారందరికి నూతనపద్ధతులలో చక్కగా చెప్పవలెను. శ్రీరామకృష్ణరాజుగారు దేశంలో లలితకళలు అభివృద్ధికావలసిందని చెప్పారు. నేను జాతీయవికాసకేంద్రాల్లో ప్రయత్నంచేస్తున్నాను. పూర్వపద్ధతిని, గాంధీయుగ పద్ధతిని ప్రయత్నంచేస్తున్నాను. ఈపొద్దు మీటింగుపెడ్తామంటే యువకులు రారు. నాటకాలనో, నృత్యాలనో, ప్రభలనో మూన్నాళ్లు ముచ్చటగా మహాసభ ఏర్పాటు చేసి రాత్రి పగలు దివ్యమైన సంగీతంతో సాహిత్యంతో హితబోధ చేయవలసి ఉన్నది ఇలా చేస్తుంటే వేలకొలది యువకులు గుమిగూడి "ఇది నాదేశం, నా దేశానికై కొంత కృషిచేయాలె" అని దీక్షకు పూనుకుంటున్నారు. ఇది మన సంస్కృతికి సంబంధించినది. మన సంస్కారానికి అనుగుణంగా లలితకళలను అభివృద్ధిపరచుకొనే అవకాశంకూడా జాతీయ విస్తరణప్రణాళికలోభాగంగా ఉంది. దీనికి అనుగుణంగా అభ్యుదయకళాశాలలను ఏర్పాటుచేసి చక్కగా ప్రజలలో ప్రబోధంచేయించే ప్రయత్నం కావాలి. ఆలాగునసే మనదేశంలో స్త్రీలకుయిచ్చే విద్యావిధానంలో మార్పుతెచ్చి, వారు దేశవ్యవహారాల్లో ముందుకునడిచేటట్లు, అభ్యుదయపథగాములయ్యేటట్లు ప్రయత్నంచేయవలెను. ఈ దినాల్లో B.A, M.A ల వరకు చదివిన ఆడవాళ్లున్నారు. వీళ్లు ఇటు యింటి సంసారానికి రారు, అటు ఉద్యోగాలకు అసలేపోరు. ఉద్యోగాలకు పోయినట్లయితే వాళ్ళకుండే బాధలు మనం చూస్తూనే ఉన్నాము. అందుచేత ప్రస్తుత విద్యావిధానంలో మార్పుతెచ్చి యింటింటికి ప్రచారంచేసినట్లయితే దేశవ్యవహారాలను నిర్వహించేందుకు వాళ్లు పనికి వస్తారు. కాబట్టి ప్రభుత్వం ప్రణాళికలకై ఖర్చుపెట్టే లక్షలకొలదీ డబ్బులో యిటువంటి ప్రయత్నాలకయే డబ్బును భాగంగాపెట్టి యావద్దేశంలోనూ కమ్యూనిటీ ప్రాజక్టులనుగాని National Extension Service scheme లనుగాని పెట్టి నట్లయితే ప్రజాహృదయంలో నూత్నమైన ఉత్తేజాన్ని కల్గించవచ్చును. ఈ పద్ధతి ఒక్కటే నూత్నతేజాన్ని కల్గిస్తున్నది. ఎప్పుడు ప్రజల్లో నూత్నచైతన్యం కల్గుతుందో అప్పుడే పోలీసువాని పోకిరీతనం తగ్గిపోతుంది; పోలీసువాడు చేసే దుర్మార్గమూ తగ్గిపోతుంది. కనుక ప్రభుత్వం ప్రజలలో విజ్ఞానము, వికాసమూ కలుగచేసేందుకు ప్రయత్నంచేయాలి. అప్పుడు ప్రక్కనున్న ఉద్యోగికికూడా "నేను పదిమందిలో కలసి మెలసి వారియొక్క బాగోగులలో భాగస్వామినై వ్యవహరించితే బాగుంటుంది" అని తెలుసుకుంటాడు. కాబట్టి ఈ వ్యవహారాలన్నీ పంచవర్ష ప్రణాళికపద్ధతిలో ఒకభాగంగా తీసుకొని ప్రచారంచేసేందుకు తగినకృషి చేయవలెను

ఈ సందర్భంలో ఒక విషయాన్ని విన్నవించవలసి ఉంది. ఇప్పుడు ప్లానింగు కమిటీలు ఉన్నవి ఈ ప్లానింగు కమిటీలు వృధా అని నేను చెప్పగలను. జిల్లాలలో నేను చూస్తున్నాను.

గవర్నరుకంటే ఎక్కువ అధికారాలు కలెక్టర్లకు ప్రభుత్వంవారు యిచ్చారు. గవర్నరుకు లేని అధికారాలు, గవర్నరుకు మించిన అధికారాలు కలెక్టర్లకు ఇచ్చారు. 18 వృత్తాల్లాగా ఉంటున్నటువంటి 18 శాఖలలో అధికారాలన్నీ వాళ్ళ చేతికిచ్చి, వాళ్లను పనిచేయమంటే వాళ్లు గవర్నరులాగా ప్రవర్తిస్తూ సూచాయగా "ఈ పని చేయండి, ఈ పని చేయండి" అని శాసించేపద్ధతిలో జరుగుతున్నది. మన పంచాంగంల్లోనుండే సంక్రాంతి పురుషుల్లాగా ఒక కలెక్టరు జాతీయవిస్తరణ ప్రణాళికకు ప్రచారంచేయవలెను అని వస్తాడు, యింకొకడు ఎప్పుడూ క్లబ్బులుకట్టించే వ్యవహార నిమిత్తం వస్తాడు; ఇంకొకరు నృత్యాలకు, సంగీతానికి సరైన కళామందిరాలను కట్టించే ప్రయత్నంలో వస్తారు. Gentlemen are those who are busy about other man's work than their own" అన్నట్లుగా కలెక్టర్లు తమకు సంబంధించినపనిని విడిచిపెట్టి ఇతర కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. తమపనిని విడిచిపెట్టి లోకోపకారక వ్యవహారం యితరులకు చేస్తున్నామనేవారు ఈనాడు ఆనధికారులలో ఎలా ఉన్నారో అలాగుననే అధికారులైన కలెక్టర్లలో గూడ ఉన్నారు. ఇది సరియైన పద్ధతికాదు. సెక్రటరీ సెక్రటరీపని చేయవలె. కలెక్టరు కలెక్టరుపని చేయవలె. అంతేగాని కలెక్టర్లకు అన్ని అధికారాలు యిచ్చి, "అన్నిపనులు నువ్వు చేయమంటే," ఆయనకు నచ్చినదేదో, కావలసినదేదో, ఆయనమనస్సుకు సంతృప్తికలిగించేదేదో ఆ పనిని చేసుకుపోయే అవకాశముంది. ఇప్పుడు వాళ్లు దేశంలో ప్రచారంచేసి సముద్ధరణచేస్తారనే నమ్మకం లేదు. ఎప్పటికీ వాళ్లు తాబేదారులే. వాళ్లపై అధికారం గల్గినటువంటి మంత్రులు తదితరులు ప్రణాళికలగురించి చక్కని ప్రచారం చేసినట్లయితే వేసుకున్న ప్రణాళికలు విజయవంత మవుతాయి. మంత్రులు గూడ తమప్రచారంలో ప్రజలకు మేలు కూర్పగల ద్వితీయ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను, ప్రజలకు ఆ ప్రణాళికలు ఎందుకు కావలెనన్న విషయాలను స్పష్టపరుస్తూండవలెను. ఇప్పుడు మంత్రులు తామెక్కడికి పోయినప్పటికిని ద్వితీయప్రణాళిక లక్ష్యాలను చెప్తున్నారు. దానిని ఇంకా ప్రచారం విస్తృతం చేయవలెనని, ప్రచారం ఎక్కువయినట్లయితే ప్రజలలో ఒక నూత్న తేజం కల్గుతుందని విన్నవిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI G. BAPAIAH CHOWDARY :—అధ్యక్షా, ఈ పంచవర్ష ప్రణాళికను అర్థశాస్త్రి వేత్తలు, విద్యాంసులు మొదలైన గొప్పవారంతా కలిసి ఆలోచించి నిర్మించి ఉంటారు. దీనివల్ల దేశానికి సత్ఫలితాలు కలుగుతాయని వారి ఉద్దేశ్యమై ఉంటుంది. అందువలన దానిలో ఏమైన సూచనలు చేయడానికిగాని,

దానిని ఆక్షేపించడానికిగాని మనం అర్హులముకామేమోనని నా ఉద్దేశ్యము. Socialistic Pattern of Society క్రమేణ రావలెననేది ఈ ప్రణాళిక యొక్క ఉద్దేశమయినట్లు కన్పిస్తోంది. అది సాధ్యంకాదేమోనని నా ఉద్దేశ్యం. ఈ క్రమేణా రావలెననే దానిలో కొంతమంది భాగ్యవంతులను తగ్గించడానికి ప్రయత్నం చేస్తున్నప్పటికి ఆ చేసే ప్రయత్నంవల్ల ఇంకా కొంతమంది లక్షాధికారులు స్వార్థంతో తయారౌతున్నారు. 10 మందిని తగ్గిస్తే 20 మంది తయారౌతున్నారు. ఇది అవినీతివల్ల జరుగుతున్నటువంటి విషయం. ఈ అవినీతి ఎందువల్ల వస్తున్నదంటే స్వార్థచింతవల్ల. ఈ ముని మనుములను రక్షించే భారం నా చేతిలో ఉన్నదనే భావం కలుగుతోంది. ఇటువంటి భావం పోవాలి అంటే క్రమేణ కాకుండా ఒక్క పర్యాయమే సామ్యవాదాన్ని అమలుపెట్టేటట్లయితే "స్వ" నశించిపోతుంది. ధర్మము ప్రవేశిస్తుంది. అప్పుడు ఇటువంటి పంచవర్ష ప్రణాళికలు ఎన్ని చేసినప్పటికి దేశం సమిష్టిగా అభివృద్ధి చెందడానికి మార్గం ఉంటుందని నా ఉద్దేశ్యం. దేశ సంపదనంతను ఒకే పర్యాయము ప్రజలందరు సమిష్టిగా అనుభవించాలంటే సంపదనంతా nationalise చేసి, ఇల్లు, వాకిలి, . . అన్న వస్త్రాదులను ఉపయోగించుట మాత్రమే వారికి అప్పజెప్పినట్లయితే స్వార్థమునకు అవకాశంలేకుండా చేసినపుడుగాని న్యాయం జరగనేరదు. న్యాయం జరిగినపుడుగాని మనం ఉద్దేశించిన విధంగా నెరవేరడానికి అవకాశం ఉండదు. అందువల్ల Socialistic Pattern of Society ని క్రమేణ ప్రవేశపెట్టే దానికంటె ఒక్క పర్యాయమే State ను యావత్తు joint family క్రింద మార్చి స్వార్థంలేకుండా చేసి వారికి తినుట, చేయుట మాత్రమే అప్పజెప్పినట్లయితే బాగుంటుంది. దేశ సౌభాగ్యమే మన joint liability అని చెప్పి Socialistic Pattern of Society ని విధానంగా తీసుకురావడం అంటే ఏమిటో ప్లానింగ్ మంత్రిగారు కొంచెము విమర్శనచేసి చెప్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI P. RATNASABHAPATHI :—అధ్యక్షా, ప్లానింగ్ మంత్రిగారు నిన్న ఈ plan ను consideration కై ప్రతిపాదిస్తూ ఆఖరున ఈ plan విజయవంతంగా కొనసాగాలంటే ప్రజాసహకారం కావాలని తెలియజేశారు. ఈ విషయంలో ఎవరికి భేదాభిప్రాయాలు లేవనుకుంటాను. ఈ ప్రణాళిక ప్రత్యేకంగా గ్రామస్థులదే కాదు. పట్టణవాసులదే కాదు. అన్ని రాజకీయ పార్టీలవారు కూడా అర్థికాభివృద్ధికి తోడ్పడతారని అనుకొంటాను. ప్రజాసహకారాన్ని ఏ విధంగా తీసుకోవాలి అన్నది సమస్యగా తయారౌతున్నది. మొదటి పంచవర్ష ప్రణాళిక ఈ నెల ఆఖరుకు పూర్తిఅయి రెండో పంచవర్ష ప్రణాళికను మొదలు పెట్టబోతున్నాము. మొదటి పంచవర్ష ప్రణాళికలోనే మనం local development works ను స్థాపించినాము. National Extension Blocksలో

కూడా మనకు అనుభవం ఉన్నది. కమ్యూనిటీ ప్రాజెక్టులుకూడా ప్రయత్నం చేసి చూశాము. వీటన్నింటిలో చాలవరకు ప్రజా సహకారాన్ని సంపాదించాము. ఈ సహకారాన్ని డబ్బు మూలంగా ఎంత సాధించగలము. శ్రమదానం మూలముగా ఎంత సాధించగలమనేటటువంటి దానిలో కూడా మనకు అనుభవం ఉన్నది. మంత్రిగారు డబ్బులేనివాళ్లు, పేదవాళ్లు, రైతులు మొదలైనవాళ్లు శ్రమదానం ఇవ్వవచ్చునని చెప్పారు. దీనినిబట్టి చూస్తే రెండో పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా కొనసాగించాలన్నా గాని లేక local development works ను గాని మిగతా కార్యక్రమాలన్నిటిలో కూడా కేవలం శ్రమదానం వల్లనే ప్రజాసహకారం పొంది ప్రణాళికను నెరవేర్చాలన్న ఉద్దేశ్యం కనబడుతోంది. డబ్బున్నవాళ్ల నుంచి, ధనికులునుంచి ఇంతవరకు లభించినది ఏమీలేదు. ఇకముందు లభిస్తుందనే ఆశకూడాలేదు. అందువల్ల కేవలం శ్రమదానంవల్లనే మనము ప్రణాళికను విజయవంతంగా చేయడానికి వీలౌతుందా అనే సందేహం కలుగుతోంది. అంతే కాకుండా శ్రమదానం అనే పేరుతో బీదవాళ్లచేత ఎక్కువ sacrifice చేయించి వాళ్ల కష్టాన్నే ఎక్కువగా తీసుకొని ఈ ప్రణాళికను నెరవేర్చవలసిన అవసరం కనబడుతోంది. ఇటువంటి సహాయాన్ని కోరేటప్పుడు, ఇటువంటి sacrifice చేయమన్నప్పుడు, అన్ని వర్గాల వారినుంచికూడా అటువంటి సహాయాన్ని మనం పొందుతున్నామా అనే సందేహం కలుగుతోంది. అందువలన ప్రతి వర్గం నుంచి వారియొక్క ఆర్థిక స్థితినిబట్టి వాళ్ళ సహాయాన్ని పొందడంలేదని మీకు నేను తెలియజేస్తున్నాను. ఈ ప్రణాళికను అమలుజరపకముందే ఆర్థిక వ్యవస్థలో ఉంటేటటువంటి హెచ్చు తగ్గులను సరిదిద్దుకొని, maximum, minimum ఈ రెండింటికి మధ్య ఉన్నటువంటి వ్యత్యాసాన్ని తగ్గిస్తేనేగాని ప్రణాళిక విజయవంతంగా కొనసాగదనే సిద్ధాంతంకూడా ఉన్నది. Capitalist రాజ్యాలలో ప్రణాళికబద్ధమైన ఆర్థిక వ్యవస్థను సృష్టించుకోవడం ఉండదు. Socialist సిద్ధాంతాన్ని అనుసరించి ఈ ప్రణాళికను రూపొందించి వాళ్ళయొక్క శక్తి సామర్థ్యాలను సమైక్యం చేసి ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేసుకోవడం జరుగుతోంది. ఈ ప్రణాళికను అమలుజరుపుటకు ముందే ఆర్థిక వ్యవస్థను చాలవరకు తగ్గిస్తేనేగాని ప్రజాసహకారం పూర్తిగా లభించదనే సిద్ధాంతాన్ని మనమందరం ఒప్పుకొన్నదే. ఇప్పుడు మన దేశంలో ఆర్థికవ్యవస్థ ఏ విధంగా ఉన్నదో లెక్కలను బట్టి చూస్తే తెలుస్తుంది. మన జాతీయాదాయం ఈ సంవత్సరాంతానికి 10,800 కోట్ల రూపాయలవరకు ఉంటుందని అంచనా వేశారు. అందులో 100 కి 62 మంది ఒక భాగము, 100 కి 33 మంది ఇంకొక భాగము, 100 కి 5 మంది 3 వభాగము అనుభవిస్తున్నారు. అందులో కూడా ఇంకా హెచ్చు తగ్గులున్నాయి. Per capita income 280 కోట్ల రూపాయలని అంచనా వేశారు.

Per Capita income లోకూడా 100 కి 62 మంది ఎక్కువ భాగాన్ని మిగిలిన వాళ్లు తక్కువ భాగాన్ని అనుభవిస్తున్నారు ఆరోజు కారోజు కేవలం భుక్తికి మాత్రమే సరిపోయేటటువంటి ఆదాయం వాళ్లకు లభిస్తోంది. కాబట్టి ప్రణాళికను విజయవంతం చేసుకోవాలంటే ప్రజానీకం దగ్గరనుంచి, ఏ విధంగా సహకారం వస్తుందో నాకు అర్థం కావడంలేదు. ప్రజలనుండి సంపూర్ణ సహకారం లభించాలంటే, ప్రణాళిక విజయవంతం కావాలంటే, ముందు హెచ్చు తగ్గులను సవరించి ప్రణాళికను ముందుకు తీసుకుపోవాలి. Land Reforms మొదలైన వాటిని చట్టంగా తీసుకొచ్చి వాటిని అమలు పెట్టిన తరువాత ప్రణాళికను అమలు జరిపితే ప్రణాళిక విజయవంతం కావడానికి అవకాశం ఉంటుందని అనుకుంటున్నాను.

ఇక రెండవది నిరుద్యోగ సమస్య. మనకు అందించినటువంటి ఈ draft planలో 1961 వ సంవత్సరానికి 15.3 మిలియన్ల నిరుద్యోగులు ఉంటారని తెలిసినది. అందులో 8 మిలియన్ల ప్రజానీకానికి మాత్రమే ఉద్యోగం చూపించగలుగుతామని చెప్పారు. అందులో unemployed, underemployed ఉన్నారు. వీరిలో నిజంగా unemployed వారు ఎంతమందో, underemployed వారు ఎంతమంది ఉన్నారో తేల్చలేకుండా ఉన్నాము. ఏదో rough గా 9 మిలియన్లు గ్రామాలలో నిరుద్యోగులుగా ఉన్నారని లెక్కవేశారు. కాని Rural Credit Survey report ను బట్టి చూస్తే underemployed, unemployed అందరు కలిపి మొత్తం 1961 వ సంవత్సరమునకు 40 మిలియన్లు ఉంటారని లెక్క తేల్చినారు. మొత్తం rural areas లోను towns లోను కలిపి 1961 వ సంవత్సరానికి 6.3 మిలియన్ల మంది నిరుద్యోగులు ఉంటారని లెక్క తేల్చారు.

కనుక Rural Credit Society లో, survey లెక్కల ప్రకారం, 40 millions న్నూ, towns లో ఉన్నటువంటివారు, ఈ plan ప్రకారం, ఆరు మిలియన్లు, మొత్తము 46 మిలియన్ల మంది నిరుద్యోగులున్నారు. కాని ఈ plan ప్రకారం 8 మిలియన్లమందికి మాత్రమే ఉద్యోగాలు చూపించబోతున్నారు. ఈ సందర్భంలో, మొదటి పంచవర్ష ప్రణాళికలో ఎంతవరకు చేయగలిగాము అని మన అనుభవాన్ని బట్టి చూస్తే 4.5 మిలియన్లుమాత్రమే ఉద్యోగాలు చూపించగలిగాము. ఇప్పుడు Central Government వారు supply చేసిన ఈ Outline of Second Five Year Plan పుస్తకం ప్రకారం ఇంతకంటె ఎక్కువగా మనము ఉద్యోగాలు చూపించగలుగుతామా అనే సందేహం కలుగుతున్నది. మొదటి పంచవర్ష ప్రణాళికలో development works పైన ఎక్కువగా ఖర్చుచేశారు అందువల్ల ఉద్యోగాలు రాగలిగినాయి. అదే మొత్తాన్ని రెండవ పంచవర్ష ప్రణాళికలో

కూడ ఖర్చు చేయబోతున్నాము, అంతకంటే హెచ్చుఖర్చు చేయలేక పోవచ్చు, గనుక ఇంతకంటే ఉద్యోగాలు ఎక్కువవచ్చే అవకాశముకూడ లేదేమో అనే సందేహము వారు తెలియజేశారు. కాని మీరు చూపించిన 8 మిలియన్ల ప్రజలకైనా ఉద్యోగాలు చూపించగలుగుతారా లేదా అనే సందేహంకూడ ఉన్నది. ఈ విధంగా అయితే, ఈ ప్రణాళికలో చూపించిన figures ప్రకారం, 46 మిలియన్లమందికి ఉద్యోగాలు చూపించాలంటే ఇటువంటివి ఎన్ని ప్రణాళికలు కావలసి యుంటుందో అర్థంకాకుండా వున్నది. ఇక వ్యవసాయానికి సంబంధించి మొట్టమొదట ఆహారసమస్య, తరువాత భూసమస్య తరువాత ఆహారపదార్థాలయొక్క prices, ఈ రకంగా మూడు రకములసమస్యలుఉన్నాయి. మనదేశం మొత్తంమీద, 1956 సంవత్సరము ఆఖరుకు మనకుకావలసినటువంటి మొత్తం ధాన్యం 80 million tons అని rural credit survey వాళ్ల లెక్కల ప్రకారం తెలుస్తూ ఉన్నది. కాని ఈ రోజు దేశం మొత్తంమీద 65 million tons మాత్రమే ధాన్యంవుత్పత్తి అవుతున్నది. అందులో ముఖ్యంగా అన్ని రాష్ట్రాలకంటే ఆంధ్రరాష్ట్రములో ఎక్కువగా పండిస్తున్నామని మనకు తెలుసు. కనుక ఈ ఆహార పదార్థాలను ఉత్పత్తిచేయడంలో మనం ఎంతవరకు ప్రయత్నం చేస్తున్నామనేదికూడ ఆలోచించాలి. 1956 వ సంవత్సరమునకు మనకు 50 million tons ధాన్యం అవసరమయితే, 1961 వ సంవత్సరానికి 85 million tons ధాన్యం అవసరమవుతుంది. కాని 1956 సంవత్సరమునకు దేశం మొత్తంమీద పండించేది 65 మిలియను టన్నులయితే ఆంధ్రదేశంలోనే 44 లక్షలు టన్నులు ఉత్పత్తిచేస్తున్నారని మీరు తెలియజేశారు. దీనికి కారణమేమిటి ? మనము ఎన్ని ప్రాజెక్టులు కట్టినా, ఎంత భూమిని సాగులోకి తీసుకువచ్చి నీటిసౌకర్యాలు కలిగించినా ఎందువల్ల మనం ఎక్కువ ఉత్పత్తి చేయలేకపోతున్నాము అనేది ఆలోచించాలి. పెద్దపెద్ద ప్రాజెక్టులు కట్టినందువల్ల అవి immediate గా ఉపయోగపడే అవకాశం లేదు. దీనికి కారణాలు చాలా ఉన్నాయి. బీడుభూములు సారవంతంగా లేకపోవడంవల్ల వాటి మీద వెచ్చించవలసిన ద్రవ్యంకూడా ఎక్కువ అవడంవల్ల ఆ భూములు మనకు వెంటనే సక్రమంగా పంటలు ఇవ్వలేకుండా ఉన్నాయి. కనుక ఒకవైపు పెద్దప్రాజెక్టులకు వెచ్చించడం అట్లా ఉండగా, ప్రత్యేకించి medium projects కూడకాకుండా, Minor Projects పైన వెచ్చించి నీరు సరఫరా చేయడంవల్ల వెంటనే మనకు ఫలితమువచ్చి ఆదాయము కలిగే అవకాశము ఉన్నది. అటువంటి ఈ minor irrigation పనులమీద మనము శ్రద్ధచూపించకుండాఉండడం చాలాఆశ్చర్యకరంగావున్నది. మన రెండవ పంచవర్ష ప్రణాళికలో రెండుకోట్ల రూపాయలు minor irrigation ప్రాజెక్టులకు వినియోగిస్తామని తెలియజేశారు. అది చాలదని అవకాశమున్నవాటంతా medium scale projects మీదే కాకుండా, minor irrigation works

Sri B. Ratnasabhapathi] [26th March 1956

మీద ఇంకా ఎక్కువ ఖర్చుపెట్టి వాటిని అభివృద్ధిచేయవలసిన అవసరమున్నదని తెలియజేస్తున్నాను. అంతవరకు, మన ఆహారకొరతను తీర్చడానికి ఏవిధంగాను మనకు సాధ్యం కాదేమోనని నాకు సందేహంగా ఉన్నది. తరువాత, మనదేశంలో ఇప్పటికి 36 కోట్ల ఎకరాలుమాత్రం సాగుబడిలో ఉన్నదన్నారు. ఇంకా సుమారు 10 కోట్ల ఎకరాలువరకు సాగుకు వీలయ్యేటటువంటి భూమి ఉన్నది. మనరాష్ట్రంలో 13 లక్షల ఎకరాలు గవర్నమెంటు బీడుభూమి ఉండగా 1 లక్ష ఎకరాలుమాత్రమే landless poor కు ఇప్పటికి distribute చేశారు. ఇంకనూ 12 లక్షలు ఎకరాలు భూమి ఉన్నది. దీన్ని వృధాగా వదలివేయకుండా, దాన్నంతటిని సాగులోకి తీసుకువచ్చారంటే దానివల్లకూడ ఆహారపదార్థాలు అభివృద్ధికావడానికి అవకాశమున్నది. కాని దీన్ని ఏవిధంగా సాగుకుతేవాలి అనేదే సమస్య. కేవలం minor irrigation projects గాని, medium scale projects గాని, పెద్ద projects గాని కట్టినంతమాత్రాన ఇది సాగుకురాదు. ఈ భూమిని రైతుకు ఇచ్చేటప్పుడు, దానికి కావలసిన సాధనసంపత్తికూడ మీరు సంపూర్ణంగా సహాయం చేయవలసిన అవసరమున్నది. దీంట్లో మాకు ఒక అనుభవమున్నది. East Godavari, కృష్ణాజిల్లాలలో మీకు land colonization scheme ex-military వాళ్ళకు ఏర్పాటుచేయడంకూడ జరిగింది. దాని అనుభవముకూడ మీరు సంపాదించారు. అదేవిధంగా ఈ మిగతా 12 లక్షల ఎకరాల భూమిని, ప్రతి గ్రామంలోను ఎక్కువగా ఉన్నదంతా, survey చేయించి, co-operative societies పెట్టి, land colonization schemes పెట్టి, భూమి లేనటువంటి వాళ్లను ఆ societies లో సభ్యులుగా చేర్పించి ఆ భూమిని సాగులోకి తీసుకువచ్చే మార్గం చేశారంటే, అదంతా సాగుఅయ్యేదేకాకుండా, ఆహారధాన్యాలు ఎక్కువగా ఉత్పత్తిఅయ్యేదే కాకుండా నిరుద్యోగసమస్యకూడ చాలావరకు తీర్చగలుగుతారనుకొంటాను. తరువాత, ఆహారధాన్యాలను ఎక్కువగా పండించడం ఒక్కటే కాదు చూడవలసింది. రైతుకు అయ్యే ఖర్చుకు, అతని ఆదాయానికి సమన్వయమున్నదా లేదా అనేదికూడ చూడాలి. అదే price structure అంటారు. మొన్న గోపాలరెడ్డిగారు బడ్జెట్ ఉపన్యాసములో చెప్పుతూ, 1954 డిసెంబరు నెలకు, 1955 డిసెంబరునెలకు వడ్లు ధరలు 19 points పెరిగిందని తెలియజేశారు. కాని ఈ plan లో చూస్తే ఇక్కడ wholesale prices యొక్క index ఇచ్చినారు. దానిప్రకారం, 1953-54 లో food articles యొక్క index 384 point ఉంటే 1955 జనవరి 22 వ తేదిన 309 ఉన్నది. కాని వారేమో 13 points ఎక్కువ అయిందన్నారు. ఇక్కడ చూస్తేనేమో 75 points తగ్గిపోయింది. కాని 1955 జనవరి తరువాత ఎక్కింది అని మంత్రిగారు అంటున్నారు. అది వాస్తవమే కావచ్చు. నేను కాదనడంలేదు. కాని గ్రామాలలో ఉన్న ధరలకు market లో

ఉన్న ధరలకు చాలా భేదము ఉన్నదని చెప్పుచున్నాను. ఈరోజు మార్కెట్టులో మధ్యవ్యాపారస్థులు అమ్మే వస్తువుల ధరకు, గ్రామాలలో కొనుగోలు ధరకు చాలా తేడాఉన్నది. ఈమధ్యవర్తులు, మధ్యవ్యాపారస్థులు గ్రామాలలో తక్కువ ధరలకు ముందుగానే కొని hoard చేసుకొని, మార్కెట్టులో చాలా హెచ్చుధరలకు అమ్ముకొంటున్నారు, అనేవిషయము మరచిపోకూడదు. రైతు సాధారణంగా ధర ఎక్కువైనప్పుడు సంతోషిస్తాడు. తగ్గినప్పుడు బాధపడతాడు. అయితే అదికాదు మనకు కావలసింది. రైతు కొనుగోలు చేసేటటువంటి వస్తువులకు ఎంతధర ఉన్నది. అమ్మే వస్తువులకు ఎంతధర ఉన్నది, ఈ రెంటికి సమన్వయము (parity) ఉన్నదా లేదా అనేది మీరు గమనించాలని మనవిచేస్తున్నాను. ఈరోజు ధర ఎక్కువవుంటే రైతు సంతోషపడవచ్చు లేకపోతే బాధపడవచ్చు. అదికాదు మనము చూడవలసింది. వారు కొనే వస్తువుకు ఎంతధర ఉన్నది, అమ్మేవస్తువుకు ఎంతధర ఉన్నది. ఆ రెంటి ధరలయొక్క parity ని చూడవలసియుంటుంది. ఈ plan frame లో 1955 జనవరి 22 వ తేదీకి food articles యొక్క price 309 points ఉంటే, manufacture articles యొక్క price 377 points ఉన్నది, general index 360 ఉన్నది. ఈవిధముగా రైతు అమ్మేవస్తువులకు, రైతుకొనే వస్తువులకు, general index కు ఎంత difference ఉన్నదో చూడండి. వాళ్లు అమ్మేధరకు, కొనే ధరకు సమన్వయముండాలి. లేకపోతే production కు కూడ దీనివల్ల దెబ్బ తగులుతుందని మనవిచేస్తున్నాను.

ద్వితీయపంచవర్ష ప్రణాళిక కొరకు ఖర్చుకుగాను, డబ్బునుచేకూర్చటానికి మరల పన్నులు వేయడానికి ప్రభుత్వం పూనుకుంటున్నది. దీనినిబట్టి చూస్తే, ప్రభుత్వము వేసేపన్నులలోకూడ కొంతవరకు పరిమితి అనేది ఉండాలని నా అభిప్రాయము. ప్రణాళిక ఖర్చుకొరకు, శాస్త్రోక్తముగా, ప్రణాళిక బద్ధమైన ఆర్థికవ్యవస్థను అభివృద్ధిచేయదలచి, డబ్బు సేకరణ విషయమామనుకరించి ఆలోచించేటప్పుడు, యీ ప్రణాళికకు యింత డబ్బు ఎక్కడినుంచి తీసుకొనిరావాలి, ఎవరివద్దనుంచి సేకరించాలి, దీనికి ఏఏపద్ధతులు అవలంబించాలి అనేది ముందుగా దృష్టిలో పెట్టుకుని చేస్తే బాగుంటుందని ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను. ప్రభుత్వమునకు ఎప్పుడు డబ్బు కావలసి వచ్చినను ముందు రైతుమీదికి పరుగెడుతున్నారు. రైతుయొక్క ఆర్థిక పరిస్థితి ప్రభుత్వము ఆలోచించినట్లు కనబడదు. ప్రతిసారి ప్రభుత్వమునకు డబ్బు అవసరమువచ్చినప్పుడల్లా రైతు, రైతు అని అంటే ప్రయోజనములేదు. 1954 వ సంవత్సరములో మన రాష్ట్రములో ఎన్నికలు జరగబోయేముందు, రైతు ప్రభుత్వానికి చెల్లించే భూమి శిస్తుకంటె, యీ నాటివరకు ప్రభుత్వము ఏరూపములోనైనాసరే, 50% కు

అదనపు శిస్తు విధించి వసూలు చేశారు. ఈ రోజున యీ శిస్తును యింకా ఎక్కువచేసి వసూలు చేయాలనే ఆలోచిస్తున్నారు. ఈ అదనపు శిస్తులు రైతు ఎక్కడనుంచి తెచ్చి చెల్లించగలడనే విషయము ప్రభుత్వము గమనించడములేదు. అసలు సోషలిస్టు సిద్ధాంతాన్నిబట్టి చూచినప్పటికినీ, మరి ఏ సిద్ధాంతాన్నిబట్టి అయినా, కేవలము బాధపడే రైతు మీదనేవేసి వసూలుచేయడము కన్పిస్తున్నది. ప్రభుత్వమునకు డబ్బు కావాలంటే deficit financing ఎట్లా సర్దుబాటు చేస్తున్నది అనేది ఒకటి ఉన్నది.

రెండవది commerce ఉన్నది. వాటిపైన కొంత tax ప్రభుత్వంవేస్తు న్నదికాని, దానివల్ల నష్టములేదు. వేయవలసిందే. ఈ ప్రణాళికకు అవసరమైన ఆర్థికవ్యవస్థను అభివృద్ధి చేసుకోటానికి, ఏ దేశములోగాని, ఎక్కడాగాని భూమి శిస్తును అధికముచేయడమనేదిలేదు. ప్రభుత్వం industries ను అభివృద్ధిచేసేటప్పుడు, కుటీర పరిశ్రమలను అభివృద్ధిచేసేటప్పుడు, ఆహారపదార్థాలను, మిగతా ధాన్యాదులను తగ్గించే ప్రయత్నము చేయకూడదు. ఈ విషయము యితర దేశాలయొక్క అనుభవములనుబట్టి మనము తెలుసుకోగలిగిన విషయాలు రష్యాలో, వారియొక్క industrialization మనము చూచాము. వారు అవి త్వరలో అభివృద్ధిచేయాలని ప్రయత్నించారు. తరువాత పరిశ్రమలను అభివృద్ధిచేయడానికి ప్రయత్నించారు. వారు ఏవిధానము అవలంబించిందన్నీ మనకు తెలుసు. దాని వల్ల వారికి కలిగిన పెద్ద నష్టమయేమిటంటే collectivisation తీసుకొచ్చారు. దానితో రైతు సర్వనాశనము అయ్యాడు. ఈ సంగతి ప్రభుత్వానికి తెలిసిన విషయమే. తరువాత ఇంగ్లాండు దేశములో industrialization త్వరలో చేయాలని ఒక movememt తీసుకొచ్చారు. అక్కడకూడ రైతుకే పెద్ద దెబ్బ తగిలింది. ఈ సంగతికూడ ప్రభుత్వానికి తెలుసు కాదని చెప్పలేరు. ఆ అనుభవాలను దృష్టిలో పెట్టుకుని చైనా దేశములో చాలా మార్పులు వచ్చినవి. వారు industrialisation చేసుకునేటప్పుడు 1950 నుంచి 1953 దాకా వారు భూమి శిస్తునే increase చేస్తూవచ్చారు. ఎంతవరకు చేశారంటే 34% వరకూ చేశారు. కాని మిగిలిన పరిశ్రమలు మీదగాని, వ్యాపారము మీదగాని, డబ్బు ఉన్నవారిమీద గాని, tax ను 134% వరకూ increase చేశారు. దాని మూలంగా వారు industries ను అభివృద్ధి పరచుకోటానికి ప్రయత్నము చేశారు. కాని కేవలము ఒక్క land పైననే శిస్తులను అదనముగావేసి, యితరులను విడిచిపెట్టే పద్ధతి, యిక్కడ యీ ప్రభుత్వములో చూస్తున్నాముగాని విదేశాలలోకూడ లేదు. అక్కడ రైతు భరించగలిగినంతవరకు వేశారు. మిగతా డబ్బుకొరకు యితరులమీద వేశారు. కాబట్టి యీ modern times లో ప్రభుత్వానికి ఎప్పుడు డబ్బు కావాలని అనుకున్నప్పుడల్లా, రైతుమీదనే అదనపు శిస్తులువేసి, యితరుల జోలికిపోకుండా చూడడము

న్యాయముకాదు. ఈ పద్ధతులను ఏ దేశము గూడ అనుసరించడము లేదు. ఇది మన దేశములోనే అనుసరిస్తున్నారు. ఇది రైతును బాధించే ప్రణాళికగా ఉన్నది గాని రైతును బాగుచేసే ప్రణాళిక కాదు. కాబట్టి ఈ ప్రణాళిక కొరకు డబ్బు కావాలంటే, రైతు జోలికి పోకుండా, యితర విధములలో డబ్బు సేకరించమని అంటున్నాను. రైతు భరించే స్థితిలో లేనప్పుడు, పన్ను పైన పన్ను విధించి ప్రయోజనము లేదు. కాబట్టి రైతుమీద యికముందు ఏ మాత్రము పన్ను వేసినను, యివ్వలేరు కాబట్టి, పన్నులు వేయడము మానవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ, యింతటితో విరమిస్తున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—అధ్యక్షా, ద్వితీయ పంచ వర్ష ప్రణాళికను గురించి యీ మూడు దినముల నుంచి జరిగిన చర్చలలో 32 మంది సభ్యులు పాల్గొన్నారు. ఇందులో వ్యతిరేక పక్ష సభ్యులు 11 మంది ఉన్నారు. కాని యీ చర్చలలో మాత్రము చాలావరకు వ్యతిరేక పక్షమువారు, అనుకూల పక్షము వారు కూడ యీ ప్రణాళిక విషయములో సుహృద్భావాన్నే ప్రకటించడము జరిగింది. ఇది సంతోషదాయకమైన విషయమని అంటున్నాను. మనకు స్వాతంత్ర్యము లభించిన తరువాత మనదేశముకొరకు ప్రభుత్వముచేసే కృషి ప్రశంసనీయమైన విషయమనే గుర్తించవలసి వస్తున్నది. ఇంతవరకు మాట్లాడిన సభ్యులందరు చెప్పిన విషయాలన్నిటికినీ విడివిడిగా సమాధానము చెప్పుటకు కాల వ్యవధి లేదు. అవసరము కూడ ఉండదు. నిన్నటివరకు మాట్లాడిన విషయములు, యీ రోజు ఉదయమున అన్నియూ క్రోడీకరించి కొన్ని headings క్రింద విడదీసుకున్నాను. ఈ దినము సభ్యులు మాట్లాడిన విషయములనుగూడ వాటితో క్రోడీకరించుకుని, headings లోకి సర్దుకుని నేను జవాబు చెబుతున్నాను. నేను చెప్పబోయే సమాధానములు సభ్యులు మాట్లాడిన విషయములకు అన్నింటికి వచ్చేటట్లు చెప్పటానికి ప్రయత్నము చేస్తాను. యిందులో మొట్టమొదటగానే అంతా అనుమానములతో మనము బయలుదేరితే, అసలు జరిగే వ్యవహారమే కాదు యిది. పూర్వము మన పెద్దలు "మనోజవంతు। మాండవ్యాః" అన్నారు. అసలు మనస్సులలో ఉన్న ఉద్వేగమువల్ల, పట్టుదలవల్ల ఏ విషయమైనను కేంద్రీకరించిన దృష్టితో పనిచేస్తే, అది కార్యసాధన అవుతుంది గాని, ముందుగానే, అన్నీ అనుమానములు మనస్సులో పెట్టుకొని, దానికి ఏమిటి ? దీనికి ఏమిటి ? అని బయలుదేరి "ఘృతశ్యపాత్రాధారః। పాత్రశ్యఘృతాధారః" అని పెద్దలు చెప్పినట్లు, ప్రతివిషయమును గురించి తర్కించడము ఆరంభిస్తే, కార్యసాఫల్యము కాదగినవిగూడ, మధ్యలో ఆగి పోతాయి. ఆ వ్యవహారము పూర్తి కానే కాదు. కాబట్టి అనుమానాలతోటి ఉపక్రమించిన సభ్యులనందరిని వారియొక్క అనుమానాలను మొట్టమొదట ఉపసంహరించుకోవలసిందని, నాయొక్క ప్రథమ ప్రార్థన.

THE HON. DR. B. GOPALA REDDI :—" సంశయాత్మ! వినశ్యతి." అన్నట్లు.

THE HON. SRI K. VENKATA RAO :—మరొక విషయము రత్న సభాపతిగారు యీ ప్రణాళికను గురించి ఆఖరున మాట్లాడారు. ఆయనగారు Socialistic plan కు ఏదో ఒక కౌంటరు తయారుచేసుకునివచ్చి చెబుతారని నేను చాలా ఆ దుర్దాగా కూర్చున్నానుగాని, ఆయన మాట్లాడినదిచూస్తే " బండిముందు, గుర్రము వెనుక" పెట్టినట్లుగా మాట్లాడారు. అసలు యీ plan అంటూ పెట్ట దలిస్తే ముందు " equalise " చేయమన్నారు. అంటే " అందరిని సమానం చెయ్యండి " అని దీని అర్థముయేమిటంటే, యిప్పుడుఉండే వ్యత్యాసాన్ని సర్దు బాటుచేసిన తరువాత యీ ప్లానును సాగించండి అన్నారు. విత్తుముందా! చెట్టు ముందా అన్నట్లు వారు ఏ పనిచేయాలని చెప్పారో ఆ పని చేయటానికేగదా యీ plan, ఈ వ్యవహారముఅంతా! ఏపని తలపెట్టినా, పనిచేయడం దానియొక్క పర్యవ సానముగాని, చేయడమనేది ముందు జరపవలసిన విఘ్నేశ్వరపూజలో ఉండదు. మనము చేసేకార్యక్రమానికి యీ దినము ఒక Ordinance చేసి, మరునాడు యీ దేశములో ఎవ్వరికీగూడ ఏమీలేకుండాచేస్తే, అప్పుడు యీ plan అంతా అయి పోయినట్లే అన్నమాట. ఆ పనిని నిర్వహించే ప్రయత్నములో మనము అవలంబించ వలసిన భావాన్ని మొట్టమొదటనే చెప్పాము. దేశములో మనకు Socialistic Pattern of Society అన్నారుగాని, యింకా Socialism అనేది చెప్పనే లేదు. ఈ socialism అనే పదమునకు రత్నసభాపతిగారు చెప్పినదానిలో యింకొక భావముకూడఉన్నది. Communism కు కూడ socialism అని అర్థముఉన్నది. Communism వేరేకాదు. మన History of Socialism చూచుకుంటే, Communism కూడ దానిలో ఒకభాగమేకాని అది వేరు, యిది వేరుకాదు. తరువాత Lenin మహాశయుడు Max కంటే దీనికి ఒక ప్రత్యేకతకూడ కల్పించారు. ఎట్లాఅంటే " The communist party is the spearhead of socialism " అన్నారు. అందుచేత కమ్యూనిస్టుపార్టీ అనేది ఒక spearhead క్రిందికి వస్తుంది. అది ముందుకు చాచినచెయ్యి అయింది. కాని అసలు శరీరములో లేవటువంటి కొత్తది యేదీకాదు యీ Communism అనేది. దీని విషయమై చాలా మంది పెద్దలు చర్చలలో దిగారు. అందుచేత మనము ఆ details లోకి పోయి, యిక్కడ బాధపడవలసిన అవసరములేదు. కాని మా నమ్మకము యేమిటంటే, రాబోయే పరిణామముఅంతా దేశములో శాంతియుతముగా రావాలి, అనేపద్ధతిమీద అడుగుముందుకు వేసుకుంటూ మనం ముందుకు వెళ్ళవలసి ఉంటుంది. ఆ నిర్ణయము

తోనే యీ ప్లానును ఏర్పాటు చేసుకోవడము జరిగింది. కాని కొంతమంది అను కున్నట్లు ఈ రాత్రికి రాత్రే విప్లవము వచ్చేపరిస్థితి యీ ప్లానులో లేదనిఅంటే, అది అంతా ఒక విమర్శనక్రింద కన్పిస్తున్నది. మాకు మాత్రము వాస్తవముగా మేము మంచిపనియే చేశామన్నట్లు కన్పిస్తున్నది. మార్క్స్ వ్రాసిన History of Approach కున్నూ, అసలు మూల సిద్ధాంతానికిన్నీ చాలా తేడా ఉన్నది గనుక, దీన్నిగురించి మనము చర్చించడము భావ్యముకాదు. అందులోకి మనము వెళ్ళవలసిన అవసరము లేదుకూడా.

ఇప్పుడు మన ఆర్థిక వ్యవస్థ సర్వతోముఖంగా వ్యాపించిందికాదు ఇది చాలా వెనుకబడియున్నది. ఈ వెనుకబడిన దానిని మనము ముందుకు తీసుకుని పోవాలంటే, దీనిని మనము సర్వతోముఖముగా వ్యాపింప జేసుకోవాలి. ఒక్క నీటి వనర్లు మనకు ఎక్కువ అయితే లాభములేదు. ఒక్క industrialisation ఎక్కువ అయితే లాభములేదు, ఒక్క విద్య ఎక్కువ అయితే లాభములేదు. ఆరోగ్యము ఎక్కువ అయితే లాభములేదు. అన్నీగూడ సమగ్రమైన రీతిలో మనము అభివృద్ధిలోకి తెచ్చుకోవాలి. ఇవి కాకుండా అనేక sections లో ఉన్న యావత్తు వృత్తులను, ఉత్పత్తులను ముందుకు తెచ్చుకోవాలి. ధాన్యంఒక్కటే పండిస్తే చాలదు. దానికి కొనుగోలు శక్తి ఉండదు, దానినికూడ సంపాదించుకోవాలి. దానితోబాటు industries అవసరము. ఒక్క industry పెట్టుకుంటే, కొనుకోవ టానికి ముడి పదార్థము ఉండదు. అందుచేత ముడి పదార్థముకూడ మనము సృష్టించు కోవాలి కాబట్టి యివన్నీగూడ ఒకదానిని ఒకటి support చేసే దృష్టిలో మనము వృద్ధికి తెచ్చుకోవాలి. ఒకదాని కొకటి బలపరుచుకునే పద్ధతిలో మనము ఉంటే మనము ముందుకు వెళ్లగలముకాని, ఒక్కదానికోసము మనము ప్రాకులాడితే, మొత్తమువీద దీని structure అంతాకూడ పాడైపోతుంది. అందుచేత మన దేశ ములో మనమందరమూకలసి ఒకపద్ధతిమీద వెళ్లవలసివచ్చింది. మనకు పెట్టుబడి లేదు. ఇది అందరూ అంగీకరిస్తున్నదే. కొంతమంది ఎక్కడో పెట్టుబడి ఉన్నది, దానిని తీసుకొని పెట్టకూడదా అని అనుకుంటున్నారు. దీనికి సమాధానము నేను తరువాత చెబుతాను. అసలు మనకు పెట్టుబడి పెట్టటానికి యేమీలేదు అనే సంగతి అందరికీ తెలుసును. దీన్ని అందరము ఒప్పుకుంటున్నదే అందువల్ల యీ plan విషయములో ముఖ్యంగా నేను చెప్పేది యేమిటంటే "Where knowledge can take place of capital" అనే భావముతో దీనిని తీసు కొచ్చారు. ఈ రోజున మనకు capital అనేది లేదు; కాని బుద్ధికుశలతమట్టుకు ఉన్నది. Capital లేనప్పుడు, దాని place లో మన బుద్ధికుశలతను ఉపయోగించుకోవాలి, అని మేము అనుకున్నాము. ఎక్కడైతే మనకు machinery లేకుండా ఉన్నదో, అక్కడ మనము మనుష్యులనే ఉపయోగించుకోవాలని అను

కున్నాము. దీనివల్ల మనదేశము బాగుపడుతుందని అనుకుంటున్నాము. ఉదాహరణ చెప్పాలంటే, గారెలు చేసుకోటానికి ఏమి ఉన్నది అని అడిగితే, వేలు ఉన్నది అని అన్నాడట. ఒక్క వేలుమాత్రము ఉంటే, లాభములేదు. దానికి నూనె కావాలి, పిండికావాలి, దానికి కావలసినవి అన్నీ ఉండాలి. అన్నీ ఉంటే, పిండిరుబ్బి, బాణలిలో నూనెపోసి, పిండి అందులోవేసి ఉడికించితేనే, అప్పుడు గారెలు తయారు అవుతాయి. దేనికైనా అన్నివిధములైనపనులు చేసుకుంటేనే గాని, అసలు ఆపని పూర్తికాదు. కాబట్టి ఇప్పుడు యీ ప్లానులోమనము చేయవలసిన పనులు చాలా ఉన్నవి. మనదేశములో మనకు కావలసినవి అన్నీ తయారు చేసుకోటానికి, ఉత్పత్తిశక్తి, కొనుగోలుశక్తి అన్నీగూడ సమీకరణచేసుకుని, మనము వెళ్లినట్లయితే, యీ వ్యవహారము జరుగుతుందిగాని, మరొకవిధముగా జరుగదు.

ఈ plan లో ఉన్నటువంటి priorities, అంటే ఏదిముందు ఏదివెనుక అనే నిర్ణయం, మనకు ఈవేళ ఉండే ఆర్థికపరిస్థితులను ఆలోచించి చేసినటువంటివి. గాని ఊరికే ఇది జరిగితే ఇది జరుగుతుంది; అది జరిగితే అది జరుగుతుంది అన్నట్లు వెయ్యలేదు. మనవాళ్లు వేదాంతులు చెబుతూఉంటారే "యా" నుండి 'మా' పుట్టె, 'మా' నుండి 'తా' పుట్టె, 'తా' నుండి ప్రపంచంపుట్టె అని ఈరకంగా వెళ్లడానికిలేదు. ఐహికదృష్టితో మన పరిస్థితులను దృష్టిలోపెట్టుకుని మనం ముందుకుపోవాలనే విషయం గుర్తించుకోవాలి. ఇంకొక ప్రధానమైన విషయముకూడా ఉన్నది. ఈ plan అనేకరకాలుగా ప్రపంచంలో కొనసాగుతోంది. రష్యాలో దీన్ని communist system అంటారు. కొన్ని దేశాలలో Welfare State అంటారు. కొన్నిచోట్ల new deal అనీ ఇంకొకొన్నిచోట్ల ఆదేశాలకు అనుగుణమైన పేర్లు పెట్టుకున్నారు. మనది సర్వోదయం. రెండు విధాలుగా ఈ వ్యవహారము సాగించవచ్చు. ఒకరకంగా కత్తి చేతులో పుచ్చుకొని పనిచేయించే పద్ధతి ఒకటి. లేదా ఏదైనా ఆశకల్పించి ఇదుగో నీకు బహుమానంక్రింద ఇది ఇస్తాను, నువ్వు ఈపనిచెయ్యి అని ఏదైనా carrot చూపెట్టడం మరోపద్ధతి. ఈ కత్తి, carrot మధ్యమనల్ని choose చేసుకోమంటే మనం carrot ను choose చేసుకుంటాంగాని కత్తికాదనే విషయంకూడా పునాదిసిద్ధాంతంక్రింద మనం అంగీకరించితీరాలి. ఈ plan మీద వచ్చినటువంటి విమర్శ ముఖ్యంగా పరిశ్రమలకు సంబంధించినదై ఉన్నది. దేశంలో పరిశ్రమలు అభివృద్ధికావడంవల్ల రెండుమూడు విషయాలు జరుగుతాయి. మనదేశంలో నూటికి 76 నుంచి 80 మందివరకూ వ్యవసాయంమీద ఆధారపడిఉన్నాము. ఆ బరువు తగ్గించాలి. తగ్గించడానికి industrialization పద్ధతి కొనసాగితే ఈ 86 నుంచి క్రమంగా 66 కి, 56 కి కూడా సంఖ్య తగ్గుతుంది. వందసంవత్సరాలక్రితం ఈ దేశంలో 58 మంది

వ్యవసాయంమీద, 42గురు ఇతర వృత్తులమీద ఆధారపడి ఉండేవారు. కాని ఈనాడు హెచ్చుమంది వ్యవసాయంమీద ఆధారపడుతున్నారు. వ్యవసాయంమీద ఆధారపడేవారి సంఖ్యను తగ్గించడం జరుగవలసిఉంది. ఎక్కువమందికి అందుబాటులోకి వచ్చేటటువంటి వస్తుసముదాయం దేశంలో ఉత్పత్తి కావాలి. దీనివల్ల ఎక్కువమంది ఆ పదార్థాలను వినియోగించుకునే శక్తి, మన జీవన ప్రమాణం పెరగడం మొదలైనవన్నీ పారిశ్రామిక అభివృద్ధివల్ల జరుగుతాయి. కొంతమంది ఏమండీ 19% పెట్టారు అంటారు. 19 కాకపోతే 25 పెడుదుం, 50 పెడుదుం కాని, అది ఊరికే గాలిలో చేసేదికాదు. నేను ఒకవిషయం క్రిందటి మాటుకూడా చెప్పాను. మీరు బజారులో గారిడీ చూసిఉంటారు. బుట్ట బోర్లిస్తే మామిడిమొక్క మొలుస్తుంది. మరొకమారు బుట్ట బోర్లిస్తే కాయ కాస్తుంది. అది మన అందరకూపెట్టి గారడీవాడు; తలోతవ్వెడు ధాన్యం పట్టుకు చక్కాబోతాడు. మర్నాడు ఉదయం మామిడిచెట్టు ఉంటుందా? లేకపోతే కాయ ఉంటుందా? మళ్ళీ తినడం ఎల్లాగ? ఈ రకమైన గారిడీ ఏమి లాభంలేదు. మామిడిపండ్లు కావాలంటే అంటుపాతితే నాలుగేళ్ళకు కాపుకివస్తుంది. చెట్టు పెంచితే 8 ఏళ్లకు కాపుకివస్తుంది. ఈ మధ్యన ఆకాశంకేసి చూస్తూనో, దానికి నీళ్లుపోస్తూనో, దాన్ని పోషించుకుంటూ చూస్తూండవలసిందేకాని వేరేమార్గం లేదు. ఈ economy ని ముందుకు తీసుకువెళ్లుటకు వేరేమార్గంలేదు. ఎక్కువ ఉద్వేగంతో వెళ్ళాలనే ఆదుర్దా మనస్సులో ఉన్నప్పటికీ అది సాధ్యమైనటువంటి విషయంకాదు. మొట్టమొదటి plan కన్న రెండో plan లో tempo ఎక్కువ ఉన్నదని అంగీకరించారు. మూడవ plan లో tempo ఇంకా ఎక్కువ అవుతుంది. నాలుగవ plan లో ఇంకా ఎక్కువవుతుంది. 5, 6 అయ్యేటప్పటికి మన కవులు, వక్తలు చిత్రించినటువంటి హావభావవిలాస విజృంభణంలో ఆ fairy lands లోకి వెళ్ళిపోయేటటువంటి పరిస్థితి అప్పుడు కల్గుతుందికాని, అటువంటిస్థితి కల్పించడానికి సామాన్య మానవునికి ఈ మధ్యకాలంలో అసాధ్యం అని మనవిచేస్తున్నాను. ఇప్పుడు industrialization ను గురించి "Why not produce whole contents of the unit" అని సుందరయ్యగారు చెప్పారు. ఇదివరకు మన దేశంలో అసలు రైల్వే ఇంజనే చేయలేదు. తరువాత 50 పాళ్లు ఇక్కడ చేశాం, తరువాత 80 పాళ్లు చేశాం. ఇప్పుడు 90 పాళ్లు చేస్తున్నాం. ఇంకొక step ముందుకు వెళ్ళేటప్పటికి నూటికి నూరూ చేయగలుగుతాం. అందులో 10 పాళ్లు యింకొకరి దగ్గరనుంచి తెచ్చుకుని వారికి డబ్బు కట్టిపెట్టాలనే షరతు ఎక్కడాలేదు. ఇవన్నీ మనం నేర్చుకోవలసిన విద్యలు. మనం రైలు ఎక్కడమే నేర్చుకున్నాంగాని. రైలుఇంజనును తయారు చేయడం నేర్చుకోలేదు. ఇప్పటికి పెట్టెలుతయారుచేస్తున్నాం. Hindustan Coach Factory, Madras

Sri K. Venkata Rao] [26th March 1956

Integral Coach Factory, ఇంకా అజ్మీరులో ఒక Factory కట్టుకున్నాం. ఒకదానిలోనుంచి ఇంకొకటి తయారుచేస్తూ ముందుకుపోతున్నాం. వీటన్నింటికీ High tension steel కావాలి. మనకు ఇప్పుడు 15 లక్షల ton లు తయారవుతోంది. ఈ సంవత్సరం దేశంలో 35 లక్షల ton ల steel కావాలి. ఏమి చేస్తాం. తాత్కాలికంగా అవస్థపడడంతప్పదు. అది వెంకపెట్టుకుని విమర్శన చేస్తే వ్యవహారం జరగదు. ఇప్పుడే ఎవరో చెప్పారు. School final pass ఐనా, M. A. pass ఐనా ఒకటేవిద్యఅని. మేము చదువుకున్నరోజులలో B. A. Pass ఐతే ఏమి తెలిసేదనగా Test tube లో Red oxide of mercury పెట్టి దీపంమీదపెడితే అది విడిపోతుందనీ, మూడు రూపాయిలు వరసాగాపెట్టి నొక్కిపెట్టితే ఏదో జరుగుతుందనీ ఇవన్నీ నేర్పారు. కాని మనకు అసలు science Chemistry, physics ఇవేమీ అంతలోతుగా ఇదివరకు తెలియవు. ఇప్పుడిప్పుడే మనకు research వచ్చింది. అందులో మన Andhra University మంచిపేరు తెచ్చుకుంటోంది. ఈ research ని ఆధారంగా చేసుకుని Inventions రావాలి. ఉపయోగమైన వస్తువులు దేశంలో మనం తయారుచేసుకునే శక్తి మనకువచ్చేవరకూ, కొన్ని వస్తువుల విషయంలో విదేశీయులమీద ఆధారపడకతప్పదు. ఇప్పుడు Bhilai లో steel plant కు Russia మీద ఆధారపడుతున్నాం. Roorkela లో steel plant నిర్మించడానికి America మీద, Durgapur లో steel factory నిర్మాణానికి ఇంగ్లండుమీద ఆధారపడుతున్నాం. అందరియొక్క సహృదయతతో మనదేశాన్ని ముందుకు తీసుకువెళ్ళేయత్నం చేస్తున్నాం. దీన్ని Colonialism అనీ, British colonialism అనీ తొత్తులనీ, పడితొత్తులనీ దానిక్రింద వాళ్ళనీ-విప్రనారాయణ నాటకంలో విప్రనారాయణుడు వైష్ణవ ప్రతిపత్తిలో చిన్నవాణ్ణిఅని చెప్పటానికి నేను కోతిని, కోతితోకను కొరికేసేనును, కాలిక్రింద చెప్పునూ, చెప్పుక్రింద మట్టిని అన్నట్లు ఈ రకమైన విమర్శలోకి దిగడం న్యాయమైన విషయంకాదు. పారిశ్రామిక విధానంఅనేది Long range process. ఒకేరోజున గారడీవల్ల జరిగేదికాదు. మనం చేసేప్రయత్నంకూడా ఆ పరిపూర్ణత్వాన్ని సాధించుకోడానికే చేస్తున్నామా అనేదృష్టిలో తీసుకోవాలిగాని అడుగుబద్దపెట్టి ప్రతిరోజూకొలిస్తే కుట్టువాడు ఎదగడు. నిన్నను ఎవరో గౌరవ సభ్యులు "Industrialise or perish" అన్నారు. మంచి స్లోగనే, అదే మేమంతా చెబుతున్నాం. కాని ఒకటే Amendment దానికి "Invest and industrialise" అంటున్నాను Industry కావాలంటే పెట్టుబడి పెట్టాలి. అందుకే ఈ argument అంతా. డబ్బు వెంకటేశ్వర్లుగారిని అడిగితే ఇవ్వడు. ఆయనదగ్గరలేదు. ఎప్పుడైనా వెంకటేశ్వర్లుకి రావచ్చునేమో 5 సంవత్సరాలక్రితం

చరిత్రజ్ఞాపకం తెచ్చుకుంటే. నాదగ్గర ఆ మాత్రంలేదు. ఈ Scheme అంతా Investment మీదే ఆధారపడిఉంది. Agriculture ముందుకు తీసుకువెళ్ళాలనండి, విద్యఅభివృద్ధి చెయ్యాలనండి, Health service పురోగమించాలనండి, ఏమైనప్పటికి ప్రతిదానికీ ఈ Investment తెప్పించాలి. దీనికి రెండు మార్గాలున్నాయి. Public loan float చేస్తే ఆరుకోట్ల రూపాయిలు 6 నిముషాలలో వస్తోంది. ఈ ఆరుకోట్ల రూపాయిలు ఇస్తే నీకు 6 Industry లు నేను పెట్టిస్తాను. అయితే voluntary గా ఇచ్చే దృష్టిలేదని నా విమర్శ. దేశంలో డబ్బు లేకుండా లేదు. సుబ్బారెడ్డిగారో, ఎవరో చెప్పారు. 12 రూపాయిలువడ్డీకి ఇచ్చుకుందామనే ఆశచేత ఇవ్వడంలేదని. ధనంఉంది. దాన్ని మనం Canalise చెయ్యాలి. గోదావరిలో నీళ్లున్నాయి. కాని కాటన్ దొరగారు దానికి నాలుగురాళ్లు అడ్డేసి ఆనకట్టకట్టి దాన్ని కాలవలలోకి ప్రవహింపజేస్తే ఈ రోజు మనవాళ్లు గోదావరిడెల్టా, గోదావరిడెల్టా అనుకుంటున్నారు. ఇంకా ఇంచంపల్లిదగ్గర ఇంకో ఆనకట్టకట్టితే ఇంకా బాగా పంటలు పండుతాయి. అందుచేత Canalising లోఉన్నది మనతెలివిఅంతా. ఆ గోదావరి నీరులాగే డబ్బునుకూడా Canalise చేసి store చేసుకోవడంలోఉంది. దేశం ముందుకు వెళ్ళాలంటే ప్రతివాడూ అణాఇయ్యాలి. పెద్దవాడిదగ్గరనుంచి పుచ్చుకుంటూనే ఉన్నాం. Supertax rate మన దేశంలో 89% ఉన్నది. పెద్దవాళ్లను వదలిపెట్టడంలేదు.

కొన్ని లక్షల పైన రు. 100 సంపాదిస్తే రు. 89 లు పన్నుకట్టాలి. దొంగతనం చేస్తున్నారంటే చేస్తున్నారు. వెంకట్రాజుగారు చెప్పారు, 100 రూపాయిలు నోట్లు demonitise చేయాలని, అతని మనీ పర్సులో ఉన్నదంతా కలిపితే కొంత డబ్బు వచ్చేమాట నిజమే. ఆ stage రాకుండా అందరి జేబుల్లోనికి రు 100ల నోట్లు వచ్చే పద్ధతి చేస్తున్నాము. ఆంధ్ర దేశంలో, Industries కు ఎంత చేశాము అని చూసేటప్పుడు, 9 కోట్ల రూపాయిలు ఖర్చుచెయ్యదలచాము అంటే సున్న ఉండేచోట అది ఎంత పెద్దది అని అడుగుతున్నాను. సున్నకన్న 2 పెద్దది; రెండు కన్న నాలుగు పెద్దది; సున్నకన్న 9 ఎంత పెద్దది; ముందుకు తీసుకువెళ్లడానికి ఏ యత్నం లోపం జరిగిందో చెప్పండి. ఈ బాధ్యత శాసన సభ్యుల నెత్తిమీద పెడుతున్నాను. ఈ Minister ఎన్నాళ్లు వెళ్లగలడు ? గవర్నమెంటులోని మినిష్టర్లందరు ఎన్నాళ్లు తిరిగి propaganda చేయగలరు ? వెళ్ళిన రోజున ఎవరూ మాట్లాడలేదు. ఒకటే నిర్ణయంచేసుకున్నాము. ఆంధ్ర దేశంలో దరఖాస్తు అంటూవస్తే చాలు, సిఫార్సు చేయడానికి సిద్ధంగా ఉన్నాము ఏ దరఖాస్తును త్రొక్కి పెట్టాము ? ఏయత్నంలోపమో ఎవరూ point out చేయలేదు. చల్లా సుబ్బారాయుడుగారు చిన్న పరిశ్రమలను గురించి చెప్పారు. వీటికయినా నూలు కావాలి. తాడిపత్రిలో ఇదివరకు చేతితో నూలు వడికి బట్టలు

Sri K. Venkata Rao] [26th March 1956

చేసి మనకు ఇచ్చేవారు. ఎక్కువమందికి పని చెప్పాలంటే మిల్లు కావాలి. ప్రక్క-పరిశ్రమ కావాలి. వాళ్ల ఊరిలో Co-operative spinning mill కడుతున్నారు; 17½ లక్షలు గవర్నమెంటు ఇస్తున్న share capital రూపాయికి రూపాయి ఇస్తామని మొదటనుంచి చెబుతున్నాను. ఎంతో ధైర్యంగా వాళ్లు డబ్బు ఇవ్వకుండా నే చెబుతున్నాను. అధమ పక్షం పెద్దగా లక్షలాది రూపాయిలు పెట్ట లేకపోయినా 5, 10 లక్షలలో ఉపయోగకరమైన చిన్న industries పెట్టడానికి ఎందుకు కృషి చేయకూడదు ? కోటయ్యగారు చెప్పారు, వారితో ఏకీభవిస్తున్నాను. పెద్ద industries వల్ల నిరుద్యోగ సమస్య తీరదు, 350 కోట్లు రూపాయిలు ఖర్చుపెట్టి నిర్మించే మూడు ఉక్కు ఫాక్టరీలు కలిపి లక్షమంది కాదుకదా, లక్షలో సగంమందికికూడా పని చూపలేవు అన్నారు. నేను మొన్న నే చెప్పాను. మన రైలు బండి రెండు పట్టాల మీద నడుస్తోంది. Small scale labour intensive method, capital intensive method లను దీనిని దానిమీద, దానిని దీనిమీద quote చేసి రెండురకాలుగా నడిపిస్తే బండి నడువదు. ఆ పంథామీద నడిపిస్తేనే మన దేశం ముందుకు వెళ్లడానికి ఎక్కువ వీలుఅవుతుంది. నా ఉద్దేశం ప్రకారం ఆంధ్ర దేశంలో medium scale industries ప్రతి జిల్లాలో ఒకటయినా పెట్టుకోవాలి. తలకాయ చితుక కొట్టుకుని నిరశన వ్రతాలు చేయడం కాదు. M. L. As. ఇటువంటప్పుడు చేయాలి. ప్రతి జిల్లాలో ఒక medium scale industry పెట్టిస్తే next step గా big industry కి scope ఉంటుంది. మనకు ఎంతమంది trained mechanics ఉన్నారు? విదేశాలకు వెళ్లి చదువుకొని వచ్చిన వాళ్లు ఎంతమంది ఉన్నారు? ఒక దానిలోనుంచి మరొక దానికి వెళ్ళాలి. ఆంధ్రులు హస్త కౌశల్యానికి ప్రపంచంలో పేరుపొందినవారు. చరిత్రాత్మకమయిన handicrafts దేశంలో ఉన్నాయి. సాంచి, అజంతా, లేపాక్షి చూసివస్తే ఆంధ్రుల హస్తనైపుణ్యం చిరస్థాయిగా అక్కడ ఉన్నది. అన్నింటిని వినియోగించుకుని మనం ముందుకు వెళ్ళాలికాని ఊరికే ఆకాశం కేసి చూస్తే లాభం లేదని మనవి చేస్తున్నాను. Road transport గురించి చాలామంది చెప్పారు. L. D. Works, N. E. S. Works వచ్చిన తరువాత rural area స్వరూపమే మారుతోంది. మారిందని కాదు. Present continuous sense ఉపయోగిస్తున్నాను. August నెలలో వివరాలు publish చేయబోతున్నాము. ఏఏ ఊరిలో ఎంత పని అయినదో A. G. మార్చి 31వ accounts ఇవ్వడు; ఆరు నెలలు పడుతుంది. Independence Day souvineer లో చూడండి. ఆంధ్ర దేశంలో ఎంతవరకు, L. D. Works, N. E. S. వ్యవహారం జరుగుతున్నదో, గమనించాలి. ఈ స్కీములో దీనికి తగిన ఏర్పాటు ఉన్నది. అనుబాలవలసనుంచి ప్రక్కన 15 మైళ్లు వెడితే రెండు ప్రక్కలనున్న ఊళ్లలో

26th March 1956] [Sri K. Venkata Rao

నుంచి మట్టిరోడ్డు ఊళ్లోవాళ్లు వేసుకున్నారు. N. E. S. block వారు కంకర వేసి culverts కట్టించారు. అది బాగా వెనుకబడిన ప్రాంతం. విశాఖపట్నం జిల్లాలో ఒకఊరువెళ్లాను. నక్కపల్లి దగ్గరఅని జ్ఞాపకం. ఊరుపేరు మరిచిపోయాను. 6 ఫర్లాంగులు ఉన్నది, రోడ్డు మీదికి. జనాభా 300. వారందరూకూడా రోడ్డు మీద రాళ్లుకొట్టుకుని పనిచేసే కూలీలు, పగలు పనిచేసుకుని జీవనం వెళ్లబుచ్చుకుంటూ వెన్నెలలో తిరిగి రోడ్డు వేసుకుంటే N. E. S. block వారు కంకర వేశారు. మొన్న ఆ మధ్యవెడితే ఎంతో ఉత్సాహంగా వున్నారు. ఆడవాళ్లు, మగవాళ్లు dance చేశారు. నేను dance చేయలేను అనుకోండి. "శ్రమదానం అని వెళ్లితే ఏలాగ, శ్రమదానం మీకురాదు" అని అంటున్నారు. Equalisation అయితేనేకాని రాదట. గుఱ్ఱంబండి వెనకా ముందు పెట్టడం ఈ equalisation process అని చెప్పాను. శ్రమదానం వస్తోందని సగర్వంగా చెబుతున్నాను. First Five year plan లో 64% శ్రమదానం అయితే నేమి డబ్బు అయితేనేమి, వచ్చింది. 34% మాత్రమే గవర్నమెంటు ఖర్చుచేసింది, ప్రతిరోజు deputations వస్తున్నాయి, మళ్లా L. D. works పెడుతారా అని అడుగుతున్నారు. ఈసారి కూడా జిల్లాకు 25 లక్షలు ఇవ్వగలననే అనుకుంటున్నాను. జరిగిన విషయాన్ని మనంవినియోగించుకుని ముందుకు వెళ్లాలి. రోడ్డు కావలిసిందే, రోడ్డు ఉండడంవల్ల మన ధరవరలు ఎక్కువ అవుతాయి మంచిదే. ఆ కృషికి రెండవ పంచవర్ష ప్రణాళికలో వ్యవహారం ముందుకు వెళ్లుతోందని మనవిచేస్తున్నాను. పెద్ద విషయాలలో ఆంధ్ర దేశం గొడ్డుపోలేదు. గోదావరికి రెండు పాయలమీద 2 కోట్ల రూపాయల ఖర్చుతో వంతెనలు కడుతున్నారు. కృష్ణామీద barrage వంతెన తయారవుతోంది. తుంగభద్రపై ఈ ఊరిప్రక్క ఒక వంతెన తయారవుతుంది, పెన్నమీద కడపలో చెన్నూరుప్రక్క వంతెన తయారు అవుతోంది. రాష్ట్రంలో జరిగిన పెద్ద విషయాలన్నింటిని గుర్తులో ఉంచుకోవాలి. Irrigation and power వ్యాపి విషయంలో రాష్ట్రంలో రెండు మూడు సంవత్సరాలలోపని బాగా జరిగింది. మనకు Industries తక్కువ అంటే Irrigation కు ఎక్కువ పనిజరిగింది. Captial outlay లో, 5/12 Irrigation power ల మీద పెట్టుకున్నాము. మనది వ్యవసాయప్రాంతం కనుక కొన్నాళ్లు ఈ దృష్టితోనే ముందుకు వెళ్లాలి. చిన్నపనులు చూడాలని కొన్ని సలహాలు చెప్పారు. చూస్తున్నాము, కొంతసేపు అయిన తరువాత చెబుతాను. రామకృష్ణరాజు గారు estates tanks గురించి చెప్పారు. ఆయన అసలు జమీందారు, ఇప్పుడు రైతు అయినారు. ఏమైనా ప్రేమఉన్నది. Additional గా 2 కోట్ల రూపాయిలు పద్దడంల్లో 75 లక్షలు ఫక్తు estates tanks మరమ్మతుకు ఇచ్చాము. Mineral

Development మీద చెప్పారు. ఇంగ్లీషువాడు పైనఉన్నది పట్టుకు వెళ్ళాడు కాని భూగర్భంలో ఉన్నది పట్టుకు వెళ్లలేదు. కావలసినంత మాంగనీసు ఉన్నది. చాలా చోట్ల iron ఉన్నది తెలుసుకున్నదే చాలా ఉన్నది; దొరకనిది ఇంకా ఎక్కువగా ఉన్నది బొగ్గుఉంది. వాటిని వినియోగించుకోవాలి. జగ్గయ్యపేటలో reserve forest ఉన్నది 300, 400 ఎకరాలవరకు ఉన్నది. అందులో 10 లక్షల టన్నుల ఇనుమువరకు ఉన్నది, చుట్టు ప్రక్కల పొలాల్లో ఉన్నది, అమ్ముతున్నారు. ఇది ఇవ్వలేదని నామీద pamphlet వేస్తున్నారు బెజవాడలో. నేను ఇవ్వదలుచుకోలేదు. దీనిని అంతనూ వినియోగించుకోవాలి. 15 లక్షల టన్నులు ఉన్నది; విశాలాంధ్ర వస్తే 4 మైళ్ళ అవతల ఇనుము ఉన్నది, మాచెర్లలో ఉంది అంటున్నారు. Steel plant లేకపోయినా అధమపక్షం pig iron plant అయినా పెట్టుకోవచ్చు కదా, కొల్లూరిలో ఉన్నది; దాటి పోయిందికాని సుందూరువస్తే ఇంకా గట్టిగా ఉండేది. కనిపెట్టవలసింది దైవానికి తెలియాలి. అన్నింటికి certificates of approval ఇస్తూనేఉన్నాము. Mining licence ఇద్దరూ ఒకదానికే పెడితే పోవాలి కాని అందరికి ఇస్తూనే ఉన్నాము. ఎంతో scope దేశంలో ఉన్నది. రాజాగారి Constituency లో ferro-manganese plant పెడుతున్నారు; 31 వ మార్చిన శంకుస్థాపన. దానికి electricity supply వల్ల 36 లక్షల లాభం వస్తుంది. కాని ముందు కోటి 30 లక్షలు పెట్టుబడి పెట్టాలి. కొంత మందికి పని దొరుకుతుంది. ప్రయత్నం చేస్తున్నామని మనవి చేస్తున్నాను. Rural credit కు గ్రామీణ ప్రాంతాల్లో తగిన పరపతిలేదని చెప్పారు. దీనిని గురించి Commercial Banks పెట్టడంవల్ల కాని Co-operative Societies వల్లకాని తీర్చేట్లు కనిపించడంలేదు. Co-operative credit దేశంలో 3% జనానికే అందుతుంది. Agricultural production కు village industriesకు ప్రోత్సాహం కల్పించాలంటే villages లో credit ఎక్కువ చేయాలి. క్రొత్త రిపోర్టు ప్రకారం Reserve Bank పూచీ పుచ్చుకొని warehouse కట్టించడం, సంఘంలో చేరడానికి share capital advance చేయడం వంటి ఎన్నో రకాలుగా సహాయం జరుగుతోంది.

"Marketing, warehousing, limited liability, lending share capital" అనే రూపాల్లక్రింద పెట్టుబడిపెట్టే ఏర్పాట్లన్నీ జరుగుతూ ఉన్నాయి. ఇంకా long term credit, short term credit మొదలైనవన్నీ కూడా ఈ plan లో embody చేశారు.

ముఖ్యమైనవిషయం land reforms గురించినది. ఈ సబ్జక్టుమీద అరగంట మాట్లాడదామనివచ్చాను. గాని వ్యవధిలేదు. ఇంతమందిని కూర్చోపెట్టడం న్యాయం

కాదు. కాని నేను మనవిచేసే దేమిటంటే —ఇపుడు జాతీయప్రణాళిక వేసినాము. ఆరు నెలలు ముందువెనుక కావచ్చును. గాని జాతీయనిర్ణయము ప్రకారము, స్థానికమైన పరిస్థితులను కొంచెము దృష్టిలో పెట్టుకొని, మనము ముందుకు వెళ్లవచ్చును. ఆయత్నం మనముచేసితీరాలి. ఈ problem ను మనము solve చేసుకొనకపోతే ముందుకు వెళ్లడానికి వీలులేదు. రమణయ్యనాయుడుగారు చెప్పినట్లు ఇంజను వెనకాల పెట్టి బండిని వెనుకకు లాగడం పనికిరాదు. వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లు ఇంజనును ముందుకుతగిలించి పెట్టెపెట్టెకి మధ్యఉన్నట్టిఆ connecting links విరిగిపోయినా ముందుకు పరిగెట్టడానికి వీలులేదు. అన్ని సమస్యలను సమన్వయంచేసుకోవలసి యున్నది. ఉత్తరఇండియా, దక్షిణ ఇండియాలలోని problems కు తేడా ఉన్నది. ఇప్పుడు భూమిదారి అనేపేరుపెట్టి abolition of landlords అని U. P. లో రైతులనుంచి కొంతడబ్బు పుచ్చుకొని వారికి occupancy right కలుగచేస్తున్నారు. మద్రాసురాష్ట్రములో 1908 Estates Land Act లో ఊరికినే రైతులకు ఈ హక్కు ఇచ్చింది. తరువాత అదే principle ను మనము continue చేస్తున్నాము. U. P. లో ryotwari system లేదు. అక్కడి type of reform వేరు. మన system ను integrate చేసుకొని మనము ఖచ్చితమైన కార్యక్రమము నడిపించుకొనవలెను. Hyderabad లో కొన్ని Acts అమలు జరిగినవి. కుడిచెయ్యి లావుగాను ఎడమచెయ్యి సన్నంగాను ఉండటానికి వీలులేదు. అందువల్ల వారిబలం మనం పుచ్చుకోవడం మనబలం వారికి ఇవ్వడము అనేదానిని ఆధారంగా చేసుకొని ఈ వ్యవహారం అంతా చేసికొనవలసి ఉంటుంది.

రత్నసభాపతిగారు పన్నులు వెయ్యావద్దు అంటారు. అసలు సోషలిస్టు సిద్ధాంతం ఏమిటి? "Tax heavily and utilise it for a public purpose" అనేదే ఆ విధానం. మనం పుచ్చుకొంటూ ఉండే tax అంతా పట్టుకొనివచ్చి గోపాలరెడ్డిగారికి రత్నకిరీటం పెట్టడంకోసం tax వేస్తున్నారంటే అభ్యంతరం చెబుతాను. మంచినీరులేని దూపాడుస్టేషన్‌దగ్గర engine ఆపి బొగ్గుమీద నీళ్లు వస్తూఉంటే పాపము రోజల్లా తాగుతారు,—ఈ చెడు పరిస్థితులను మార్చడము కోసము మనము ఏ పని చేసినా చెయ్యాలి. పన్ను బీదవాడిమీద వేస్తామా అంటే బీదవాడిచ్చేపన్ను 0—4—0 ఉంటుంది. భాగ్యవంతులు ఇచ్చేది proportionate గా ఎక్కువ ఉంటుంది. మనము progressive taxation ప్రవేశపెట్టుకున్నాము. ఈనాడు regressive tax గా ఉన్నదని నాకు తెలుసును. ఈ regressive tax ను progressive tax గా చేసుకుంటే దీనిలో కొన్నిబాధలు తొలగిపోతాయి. దానిని మనము చేసుకొనవచ్చును. ఇప్పుడు నేను ఇదంతా చదివి ఏ రాష్ట్రములో ఏమి జరిగిందో చెప్పడానికి వ్యవధిలేదు. ఒక

Sri K. Venkata Rao] [26th March 1956

విషయముమాత్రం చెబుతున్నాను. ఆంధ్రరాష్ట్రము రైతులరాష్ట్రము. అందుచేత రైతుపురోభివృద్ధికి, రైతుక్షేమానికి సంబంధించినట్టి ఈ land reforms తప్పకుండా తీసుకొనివచ్చే నిర్ణయము చెయ్యడమేకాకుండా అమలులోపెట్టే ఏర్పాటు చేస్తామని మనవిచేస్తున్నాను.

ఇంక సుందరయ్యగారు చైనాలాగ ఎందుకు చెయ్యకూడదు అన్నారు. చెయ్యమనిచెపితే మాకు అభ్యంతరము లేదు. "మీరు ఏపని చేసినారు? అంతకంటె ఎక్కువచెయ్యండి" అని న్యాయమైన విమర్శలు మనవారు చేశారు. కాని చైనాను ఆధారముగా పెట్టుకొనవలెను. ఆ చట్టములను మనము అంగీకరించవలెను అంటే దానిలో కొన్ని వ్యతిరేకభావములు ఉన్నవని గుర్తించుకోవాలి. చైనావారు మనకు స్నేహితులు అయినారు. వారితో మనకు తగవు లేదు. వారి రాజ్యాన్నిగాని, వారి పరిపాలననుగాని విమర్శించవలసిన అవసరం నాకు లేదు. ఆ దృష్టి నాకు లేదు పంచశీలకు మనమందరము సంతకదారులమే. చైనాలో పెద్దబాధ ఏమిటంటే, వారి దేశములో ఉన్న పురోభివృద్ధి percentage basis మీద నడుస్తూఉంటుంది. Quantitative achievements ను publish చెయ్యరు. ఈవేళ irrigation progress 200% అంటారు. ఈ 200%. రెండుమీద అవవచ్చును. Soviet దేశములో they work behind the mask మామూలు అయిపోయింది అది. వాళ్ల కాగితాలు ఈమధ్యనే ప్రచురణ అవుతున్నాయి. కృశ్చేవుగారు చక్రం తిప్పారు. కనుక అంకెలు దొరకవచ్చును. నేను అక్కడ ఏమీ లేదనను. Presentation లో ఉండే defficulty నేను చెబుతున్నాను. అందుచేత సుందరయ్యగారు ఇచ్చిన అంకెలు percentage అంకెలు. Government taxes on land 18%-20% అని అన్నారు. మనము 27% tax ఇచ్చుకొంటున్నామా, లేదా అన్నారు. ఇంకా చాలా ఉన్నవి Collective fines మనకు లేవు. 27% produce పన్నుక్రింద ఇవ్వడమేకాకుండా sinking fund అన్నది ఒకటి ఉన్నది. దానిని అందరు ఇచ్చితీరాలని శాసనము. Compulsory contribution అది. రేటు ఎక్కువచేస్తే ఏమైనట్లు? ధర ఎంత పెరిగినా ఏమి, savings పోతుందికదా? అందుచేత మనము direct గా చైనాలోఉన్న పద్ధతి చూచి చెయ్యలేదు. పన్ను తీసేస్తాం అని పెద్ద కబుర్లు చెబుతున్నారు. కాని peasants ఏమైనా మహాగొప్పవారా? మనము ఏమీతప్పు చెయ్యలేదు. అక్కడే ఒక

స్వర్గం లేదు. అసలు China లో ఉన్న పద్ధతి ఇండియాకు సరిపోదని Russian రచయిత Nesanko వ్రాసినాడు "In india we have seen the full error of mechanically applying the experiences of our Chinese revolution" అని వ్రాశాడు. అందువల్ల 'య, అంటే 'యా', 'మా' అంటే 'మా' జరగదు అనే విషయముకూడా మనవిచేస్తున్నాను. ఇంక స్టాలినుగారికి peasants మీద ఉన్న ప్రేమ మనము records లో పెట్టుకొనవలసిన విషయము. వారు రైతాంగం గురించి ఈవిధంగా చెప్పారు.

"The small peasant economy is at bottom the same type of peasant economy as capitalist economy, for it rests on the private ownership of the means of production. The peasantry as long as it remains a peasantry carrying on small scale production will breed capitalists in its ranks and cannot help breeding them constantly and continuously."

కనుక మనం ఈ రెండింటిని సమన్వయము చేసుకొనవలెను. 13 volume లు, కొన్నాను. వారి విధానం మారిపోతూ ఉన్నది. Stalin బొమ్మను చించేయమనే స్థితిలోకి వచ్చింది. అయితే ఆ మార్పులలో మనకు సంబంధం లేదు. రష్యాలో ఉంటే వ్యక్తులమీద కోపము లేదు.

ఇంకొకరు ఏమిచెప్పారంటే, students ను భారతసేవక సమాజమును వినియోగించుకొనవలెనని అన్నారు. వినియోగిస్తున్నాము. గతసంవత్సరము చాలా student camps నడిచాయి. నేనుకూడా వెళ్ళాను. Bharat Sevak Samaj camps ఈఏడు కూడా వస్తవి. ఏర్పాట్లు చేస్తున్నారు. తప్పకుండా వినియోగించుకుంటాము.

అంతేకాకుండా social services ను గురించి మనవిచేశాను: Social services అనేవి general economy కి reflection మనమొత్తము శక్తి ఎంత ఉందో దానినిబట్టి ఉంటుంది. ఎవరో చెప్పినట్లు "We cannot have 'A' class administration with 'C' class State". రెండూ కుదరవు. అందువలన మనము ఈవేళ ఆదాయాన్ని దృష్టిలోపెట్టుకొని education, health మొదలైన వ్యవహారములు ముందుకు నడిపించుకోవలయును. అయినప్పటికి రాష్ట్రము కొన్ని బరువులు మోస్తునేఉన్నది. III ఫారంవరకు free education ఇవ్వవలెనని నిన్ననే Cabinet వారు decide చేసినారు. ఇందుకుకూడా ఎన్నోలక్షలు మళ్ళి మన deficit కు add అవుతుంది.

రసిక మహాజనులందరూ నాటక అకాడమీ అంటున్నారు. మ్యూజిక్ అకాడమీ అంటున్నారు. నేను నాటకం చూశాను గాని నాటకం ఆడలేదు. Music రానేరాదు.

ఈ ఏడు గోపాల రెడ్డిగారు బెజవాడ గాన సభలకు వెళ్తున్నారు. క్రిందటేడు నేను వెళ్ళాను. అక్కడ 'శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గాన రసం ఫణిః' అని చెప్పారు. నాది రెండో శ్రేణి అని చెప్పాను. అందువల్ల నాకు యిది తెలియదు కాని దీని లాభం మాత్రం చాలా ఉన్నది. మొన్న seminar అయినది యీ ఊర్లో. ఆ Seminar లో cultural programmes రెండు రోజులు పెట్టారు. చాలా ఆనందంగా ఉన్నాయి. రేపు వచ్చే జూన్ నెలలోనో జూలై నెలలోనో Session అయినప్పుడు యీ మధ్య తయారైనవి ఆంధ్ర దేశంలో మొత్తంమీద నున్న plays ను తీసుకుని శాసన సభ్యులకు చూపెట్టడానికికూడా ఏర్పాటు చేస్తున్నాం. ఇది తప్పకుండా జరుగవలసినదే. ఆఖరు విషయం Savings గురించి మొన్న Amritsar Congress లో appeal చేసినది ప్రతి Congressman దీంట్లో పని చేయవలసినదని, ప్రతి Voter దగ్గర Vote ఎంత గట్టిగా యిస్తాడో అంత గట్టిగా 0-1-0, 0-2-0 పనూలుచేయాలి, అని మనవాళ్లకు సలహా చెప్పవలసి ఉన్నది. కనుక చెప్పాను. క్రొత్తగా కాంగ్రెసులో చేరిపోడానికి సిద్ధపడేవారికి కూడా చెబుతున్నాను. ఎప్పుడూ అసలు కాంగ్రెసులో చేరడానికి ఉద్యుక్తులు కానివారికికూడా చెబుతున్నాను. ఈ సందర్భంలో ఎవరో నారీలలాను లందరిదగ్గర ఆభరణదానంకూడా కావాలన్నారు. ఇదివరకిచ్చిన దానాలతోపాటు అదికూడా వస్తే మంచిదే. గాంధీజీ వచ్చినప్పుడు station లో నుంచుని వంటినిండా ఉన్న ఆభరణాలు యిచ్చినవారు లేకపోలేదు. దాని విషయంలో కూడా National Government అంత ఉద్రేకంతో పనిచేయాలి. గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్టు-ఆయన మా పక్షంలోఉంటే యింకా ఎక్కువ సంతోషించే వాడిని. 1921 వ సంవత్సరంలో ఏకలలైతే మనల్ని యీ రాజ్యాంగానికి తీసుకొనివచ్చి, యీ దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదింప చేశామో, మనం సంపాదించిన యీ స్వరాజ్యాన్ని గాంధీగారు కలలుకన్న రామరాజ్యంగా చేసేటటువంటి యత్నంలో మనం తప్పకుండా యీ త్యాగాన్ని, యీ నిర్మాణ శక్తిని, అనంతమైన ఉత్సాహకృతమైనటువంటి ప్రదర్శనచేస్తేనే దేశంల్లోని బీదతనం పోగొట్టుకొని పైకొచ్చే పరిస్థితి ఏర్పడుతుంది గాని యింకోరకంగా వీలులేదు. అటువంటి యత్నానికే నెహ్రూగారు నాయకత్వం వహించినారు. ఒక పంచవర్ష ప్రణాళిక అయినది. దానివల్ల వచ్చిన లాభాలు చెప్పాను. రెండవ పంచవర్ష ప్రణాళికలో యింకా ఎక్కువ లాభాలు వస్తాయి. ఆయనకు దీర్ఘాయువిచ్చి అనేకమైనటువంటి మార్గాలను నిర్ణీతమైనటువంటి శాంతి పద్ధతిని గాంధీ సిద్ధాంతంమీద భారత శ్రేయం, విశాలాంధ్ర శ్రేయం-

ఆంధ్ర మరచిపోవలసిన రోజులివి, విశాలాంధ్ర శ్రేయం మనసులో పెట్టుకుని యీ ప్రణాళిక—దీన్లో 60 కోట్లుకలుస్తాయి—వీటిని సమగ్రంగా అనుకున్న వాటిని plan ప్రకారం ముందుకు వెళ్లేటటువంటి వ్యవహారం చేయడం ధర్మం కాని తలలో మనిషికి రొంప పట్టిందని దానికి మందు తలకాయ కత్తిరించడం కాదని మనం గుర్తించి యీ కార్యక్రమ విధానాన్ని నిర్వర్తించుకుంటే దేశాభ్యుదయానికి తోడ్పడతా మని చెబుతూ . . . . .

SRI R. B. RAMAKRISHNA RAJU :—Details of the plan ఎప్పుడిస్తారు ?

THE HON. SRI K. VENKATA RAO :—Plan finalize కాలేదు. అయిన తరువాత ప్రచురిస్తాం. వెంకటేశ్వర్లుగారి undelivered speech నాచేతిలో ఉన్నది. దీనిప్రకారము ఆయన main criticism ఏమిటంటె, ఆంధ్రరాష్ట్రానికి రావలసినంత రాలేదని ఈ సందర్భంలో మొన్న చెప్పాను. జనాభానుబట్టి, తరువాత విస్తీర్ణాన్నిబట్టి మన దేశంలో వున్నటువంటి పన్ను వసూళ్లనుబట్టి రాష్ట్రాల plans ను నిర్ణయించారు. ఈ మూడింటిని కలిపితే మనకు యితర రాష్ట్రాలలోవచ్చిన దానికంటె ఏ విధంగానూ తక్కువలేదు. ఆ principle తప్పంటే విమర్శించవచ్చు. మేము అంగీకరించిన principle అది. అక్కడ వదిలిపెట్టి ఇస్తామా ? మన వాటా రూపాయి ఎందుకు వదిలిపెట్టాలి ? ఆఖరునిముషమువరకు వదలము. మనకు యింకా 12 కోట్లో, 15 కోట్లో రావలసివున్నది. వస్తుంది. అందుచేత మనకు ఏ విధమైనటువంటి నష్టం రాకుండా నే చూస్తాను. ప్రతిపక్షంవారు బలంతో ముందుకువస్తే యింకా జోరుగా వెళ్తాంఅని మనవిచేస్తున్నాను. మిత్రుడు B. V. సుబ్బారెడ్డిగారు చెప్పిన ప్రశంసావాక్యాలకు కృతజ్ఞుడను. ఈ విషయంలో త్రిదోషంతో మాట్లాడుతున్నాను అన్నారు ఆయన. బయట ఎండ, లోపల ఉద్వేగం అసలు స్వయంగా జ్వరం, ఈ మూడూకలిపి మాట్లాడాను అన్నారు. ఆయనకు ఉద్వేగం తగ్గి త్రిదోషంపోయి ఈ దేశ సేవలో వారు, వారితో నున్నవారు ఒకే మాదిరిని యితర వ్యతిరేక పక్షాలవారితోటిపాటు యీ దేశాన్ని ముందుకు తీసుకువెళ్లడానికి సహాయపడాలని కోరుతూ యీ motion ను adopt చేయవలసినదని నివేదిస్తున్నాను.

SRI. P. GUNNAYYA :—On a point of information, Sir. Madras నుంచి వచ్చినతరువాత dancing మరచేపోయాం పూజ్యులు గోపాలరెడ్డిగారు budget సమావేశం ఆఖరులో dinner యిస్తారు. కాబట్టి ఆ dinner లో

Sri P. Gunnayya] [26th March 1956

పోతే ఒక dance కూడా అధ్యక్షులవారు యిప్పించి సభ్యులను ఆనందపరచి సభ్యుల హక్కులకు అధ్యక్షులవారు తోడ్పడతారని ప్రార్థిస్తున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—గోపాలరెడ్డిగారు tea party యివ్వదలచుకోలేదు. దానిని August నెలకు postpone చేశారు. విశాలాంధ్రకు వెళ్ళేటప్పటికి యివ్వడానికి వీలయినట్టుగా.

**MR. SPEAKER :—We shall now adjourn and meet again tomorrow at 8-30 a.m.**

**The House then adjourned.**